

# జాతీయనాయకులు

## ౨వ సంపుటము

రచయిత:

కోటమర్తి చినరఘుపతి



౧ టంగుటూరి ప్రకాశంపంతులు.

౨ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం.

౩ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య.



వెల ఒక రూపాయి.

ప్రచురణకర్తలు:

వసుపుశేటి బాపిరాజు

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్

రాజమండ్రి

# జాతీయనాయకులు

## ద్వితీయ భాగము

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులు

అభినివేశి

కీ॥ శే॥ డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం

త్యాగి

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

భక్తుడు


ర చ యి త:

కోటమర్తి చినరఘుపతి

(ప్రతాపసింహ, సుయోధన విజయము, చిత్తోడుపతనము, కోటమర్తికథలు, కోటమర్తి సాముద్రికము)





ప్రకాశకులు

పసుపులేటి బాపిరాజు

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.

1946

# ఉపోద్ఘాతము

సర్వవిధముల వెనుకబడియున్న ఆంధ్రరాష్ట్రమును వివిధమార్గముల నభివృద్ధిలోనికి దెచ్చుటకై యత్నించుచు పని చేసిన ఆంధ్రజాతీయ నాయకుల జీవితచరిత్రములు వ్రాసి తన్మూలమున, నాంధ్రులసేవ సేయుటే నాయుద్దేశము.

ఈ గ్రంధమాలమున ఆంధ్రరాష్ట్రోద్యమము, "కాంగ్రెస్సు" ఉద్యమము గత అర్థశతాబ్దమునుండి హిందూదేశమందు ప్రబలిన విప్లవోద్యమాది పలురాజకీయోద్యమముల చరిత్రములు ఆయాసంస్థలకు సంబంధించిన నాయకులజీవితములు వ్రాయుచు, తన్మూలమున కాంగ్రెస్సుసేవ చేయుటే నాముఖ్యోద్దేశము.

ఈ గ్రంధరచనమునకు తోడ్పడిన (1) నిడదవోలు వేంకటరావు (2) మల్లిపూడి పల్లంరాజు (3) గుమ్మిడిదల సుబ్బారావుగార్లకు వందనములు.

ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్యగారి జీవితములోని భాగములు పెక్కులు మిత్రుడు శ్రీగుమ్మిడిదల సుబ్బారావుగారి "ఆంధ్రరత్న పరిశంసలోనివే. వానిని గ్రహించుటకు సుబ్బారావుగారి యనుమతి నొసంగిరి. అందులకు వారికి ప్రత్యేక వందనములు.

ఇట్లు,

కోటమర్తి చినరఘుపతి

ఈ నా గ్రంథరచనమునకు వలయు విషయముల నీదిగువ నుదహరించిన పత్రికల గ్రంథముల సహాయ్యమున సమకూర్చితిని.

**పత్రికలు.**

1 ఆంధ్రపత్రిక
2 ఉగాదిసంచికలు
3 భారతి
4 ప్రజాపత్రిక
5 కృష్ణాపత్రిక

**గ్రంథములు.**

1 Directory of the Madras Legislatures
2 Men in the limelight
3 Constructive Programmee
4 History of the National Congress
5 Haripura Congress
6 ఆంధ్రమహాపురుషులు
7 నిర్మాణకార్యక్రమము
8 ప్రపంచవీరులు
9 చిలకమర్తివారి స్వీయ చరిత్ర
10 పంజాబువధలు
11 ఆంధ్రరత్నప్రశంస
12 కాంగ్రెస్సుచరిత్ర

# కృతిసమర్పణము



పట్టణ మండలముల కధికారియయ్యు
పజాహితవాదియు

ఉభయగోదావరీ కృష్ణా మండలముల కధినాయకుడయ్యు
కాంగ్రెస్సు సేవకుడును

మహదైశ్వర్య సంపన్నుడయ్యు
దేశభక్తుడును

పరిత్యక్తనరకమైన కారాగారమున వసించియు
సహవాసియై మిత్రుడైన

## శ్రీ అద్దేపల్లి సత్యనారాయణగారికి

ఆశీర్వచనపూర్వకముగ
కృతి యొసంగబడినది.

రచయిత:
కోటమర్తి చినరఘుపతి

# జాతీయ నాయకులు



## ఆంధ్రులు - ఆంధ్రరాష్ట్రము

సస్యశ్యామలమైన భారతావనిలో నాంధ్రరాష్ట్ర మొక్కభాగము. గోదావరి కృష్ణ తుంగభద్రాదిపావన జీవన నదులతో; శ్రీశైల, ద్రాక్షారామ, కాళహస్తి, తిరుపతి మొదలగు పుణ్యక్షేత్రములతో, చక్కని యారామములతో విపినములతో నిండిన రాష్ట్రమే ఆంధ్రరాష్ట్రము.

శాలివాహనాదియుగకర్తలగాంచిన కన్నతల్లి యీ తెలుగుతల్లియే. ప్రతాపరుద్రకృష్ణదేవరాయాది మహాసామ్రాజ్యాధిపతులను, యుగంధర తిమ్మరసుప్రభృతులగు మహామేధావులనుగాంచిన దీయాంధ్రమాతయే. నన్నయ, తిక్కన, పోతన, శ్రీనాధాది మహాకవు లమృతధారల గురిపించిన దీయాంధ్రావనియందే. బాలచంద్రునిధాటి - ఖడ్గతిక్కన పోటు - బ్రహ్మనాయుని పేరిటు రుచిచూపిన వీరభూమి యీ యాంధ్రరాష్ట్రమే. ఎట్లో శిల్పచాతుర్యము, అజంతాలోని కళాసౌష్టవము, త్యాగరాయల పలుకుల తియ్యందనము నిర్మించినశక్తి యీయాంధ్రమాతదే.

కాని యిదియెల్ల ఒకనాటిమాట. మెఱుపుకన్నియ వలపు జూపిన యొకనాటి దరహాసరేఖ ఒక స్వప్నగత వృత్తాంతము.

నేటి యాంధ్రదేశము క్షామపీడితము - ఋజానుభూతము. దరిద్రదేవతాలయము - మనదురదృష్టము సర్వతోముఖ విజృంభితము. ఆంధ్రులు దురదృష్టవంతులు - దురదృష్టవంతులు. ఏకభావముగాని, యేకమతముగాని, యేకనాయకత్వముగాని లేక వివిధవిధముల భిన్నాభిన్నులై చిదురుపలై రాష్ట్రము లేకపోవుటయేగాక నామరూపములుగూడ పోవుస్థితిలోనికి దిగుచు నధఃపతనము నందుచున్న రాష్ట్రమే యీ తెనుగుదేశము.

వేషమునందు, భాషయందు నాంధ్రత్వము నశించినది. లక్షణమందుగాని, లక్ష్యమునందుగాని యాంధ్రునకు ప్రత్యేకత యనునది లేదు. మతములగూర్చియు మతాశయములనుగూర్చియు నాంధ్రులకు భిన్నభావము లేగాని యైక్యత యనునది లేదు. రాజకీయములలో బహునాయకత్వము. వివిధవిధరాజకీయాందోళనములును బహువిధ రాజకీయ నాయకులనుగలిగి దేశ మేకత్రాటిపై నడచుట మఱచినది.

దేశమిట్టి దుస్థితియందుండగ నైజాములోని యాంధ్రులు విడివడిపోయిరి. గంజాంజిల్లాయందలి యాంధ్రు లుత్కళులైరి. బళ్ళారియందలి యాంధ్రులు కన్నడులైరి. రామనాడు జిల్లాలోని యాంధ్రు లరవలైరి. ఇట్టిస్థితిలో నైజాము ఆంధ్రరాష్ట్రమందలి "బందరు మొదలు కాకినాడవఱకు"ను గల

నూరుమైళ్ళప్రదేశమును తనకు కావలెనని ప్రభుత్వమును కోరినాడు. ప్రభుత్వ మిదమిద్ధమని యేదియు తేల్చి వానికి సమాధానము చెప్పలేదు. ఆంధ్రుల కిది యేనాటికైన రాచపుండు వంటిది. ఈదురాశ మూలచ్ఛేదమైననాడే ఆంధ్రులు సుఖనిద్ర జెందవలసినది. నేటరేపట ముస్లింలీగువారు ఆంధ్రరాష్ట్రమున ప్రచారముగావించి యాంధ్రరాష్ట్రభాగమును నైజాము కోరుట ధర్మసమ్మతమేయని వివిధగ్రామములనుండి యాందోళనము లేవదీయుచుండిరి. ఆంధ్రరాష్ట్రమున కిట్టిదుస్థితి పట్టినది.

నేటికైన యాంధ్రులలో నేకనాయకత్వము - నేకవిధ రాజకీయదృక్పథమును గలిగిననాడేగాని యాంధ్రులకు దాస్య విమోచనము లేదు. ఆంధ్రులంద రేకీభవించి ఆంధ్రభూభాగము నెల్ల నేకముగా జేసికొని జీవించుటయే యీనాటి యాంధ్రుల కర్తవ్యము.

నేను శాపాలావము లాడుచున్నానని యాంధ్రులు కినియకుందురుగాక - కర్తవ్యమును గుర్తించి కార్యసానుకూలత కెల్లరు బ్రయత్నింతురుగాక. ఆంధ్రకేసరివంటి మహాపురుషులు త్యాగశీలురు - అభినివేశులు ఆంధ్రమాతగర్భమున జన్మించి దేశమును దేశజులను తరింపజేయుదురుగాక!

# జాతీయనాయకులు

[ రెండవ సంపుటము ]

... PROGRESS ...
... HALL ...
... READING ROOM & LIBRARIES
20
277

ఆంధ్ర కేసరి

## శ్రీటంగుటూరి ప్రకాశంపంతులు

### అభినివేశ

అభినివేశము మానవలక్షణము. ఎట్టివిజ్ఞానికైన నెట్టి వేదాంతికైన నభినివేశము ముఖ్యము. ఎట్టిపండితునికైన నెట్టి పరిశోధకునికైన నభినివేశము ప్రథమలక్ష్యము. గంభీరహృదయునకు కార్యశూరునకు నభినివేశమే కావలసినది. గగనసీమలో మొయిలు తెరమఱుగున దోబూచులాడు చిత్రలేఖకునకు, వెన్నెలవెండితీగెలబట్టి వినువీధి కెగసి వీణియగాన మాలాపించు భావకవికినిగూడ నభినివేశ మత్యావసరమే.

అట్టియభినివేశము సదా సత్పథములకే దారి చూపదు. సత్పథగాముల కది యూర్ధ్వలోకమును, దుష్పథగాముల కది నధోలోకమును జూపును. కావున నభినివేశ మనునది యొక

శక్తి. అది యేమార్గమునకుబట్టిన నామార్గమునకే బోవును. ఈశక్తి విద్యుత్తువోలె నొకవస్తువును నడపించుటకు కారణ భూతమై యుండును గాని తనంత దా నేగ శక్తివంతమైనది గాదు. అందుచే నట్టిశక్తి యెవ్వనికి గల్గునో వానిసుగుణదుర్గుణములబట్టియే యది నడపించుచుండును.

అభినివేశమే లేనిమానవుని జీవితము వృథ యగును. ఇది సాధారణముగ పిల్లలలోను, ఏపనియు చేయుజాలని పెద్దల లోను జూచుచుందుము. ఇందునకు భర్తృహరినుడి యొక్కటి గలదు. "విఘ్నములవలని భయముచే భీరువులైన మానవు లే కార్యమును జేయుట కుత్సహించి ప్రారంభింపరనియు, ప్రారంభించియు విఘ్నములు వచ్చుటచే భయపడి తమకార్యముల నెరవేర్చుకొనకుండ మధ్యములు నడుమనే విడుతురనియు, నెట్టి విఘ్నములు వచ్చినను నరకుగొనక ప్రారబ్ధార్థమునకై భయ పడకుండ నుత్సాహవంతులై కార్యసానుకూలమును ధీరులైన వారు చేసుకొనుచుందురనియు" భర్తృహరి చెప్పియున్నాడు. అట్టిధీరుడే యభినివేశి. అట్టియభినివేశియే ప్రకాశంపంతులు.

ప్రకాశంపంతులులో బ్రదీపించునది యొక్కయభినివేశమే గాదు. ఈయభినివేశమునకు ధైర్యసాహసములు రెండును తోడునీడలై యొప్పారుచుండును. అట్టివాడు సరియైన సైనికుని వోలె నమరమున కెదురుచూచుచునే యుండును. నమరోత్సా

హీనమైన సైనికునికన్న త్యాగి మరెవ్వరు? ఆ సైనికునకు ప్రథమ లక్షణము త్యాగము. ఆత్యాగలక్షణము సైనికులలో మూర్తీభ వించుటచే నింటిని, యిల్లాలిని, సంపదను, సంసారమును బాయ జేసి ప్రాణము లరచేతిలో బెట్టించి కదనరంగమున కుఱికించి జయమో – మరణమో వచ్చుదనుక పోరాడించి దేశజాల కారాధింపవలసిన మానవశ్రేష్ఠునిక్రింద నది పరిగణింప జేయును. అట్టిత్యాగియే ప్రకాశం పంతులు.

ఒక్కయభినివేశముతో, నొక్కత్యాగముతో మాన వుని జీవితము సంపూర్తి గాజాలదు. ఆత్యాగికి మేధస్సుకూడ గొప్పదిగ నుండవలె. మానవుని కెంత త్యాగ మున్నను అది మస్తిష్కముకన్న గొప్పది కాదుగదా? త్యాగికి మార్గదర్శి మేధస్సు. అభినివేశమునకు తెరచాపగాలి మేధస్సు. ధైర్యసాహ సోత్సాహికి చుక్కాని మేధస్సు. అట్టిమేధస్సుకలవాడే జీవిత పరమార్థమను గమ్యస్థానమును చేరగలవాడు. అట్టిమేధాన్వి తుడే ప్రకాశంపంతులు.

## బాల్యము

ఈయన 1872 సం॥రమున గుంటూరుజిల్లాలోని కన వర్తి గ్రామమందు తండ్రి కృష్ణయ్యగారికిని తల్లి సుబ్బమ్మగారి కిని జన్మించెను. వీరిన్వస్థానము వల్లూరు. ఈ తల్లిదండ్రుల

కార్గురు సంతానము. అందు ప్రకాశం మూడవవాడు. ప్రకా
శంతాతగారి మరణానంతరము వారికుమారులు విడివడి పిత్రి
యమును పంచుకొని యెవరికాపురమును వారు చేయుదొడం
గిరి. ప్రకాశం తండ్రి తమసోదరులతో విడిపోయినపిమ్మట
గూడ సన్నదమ్ములతో నైక్యత కలిగి కుటుంబపోషణమును
జేసుకొనుచుండెను. కాని వీరియాస్థులు గొప్పవి కావు. సంసా
రము పెద్దదిగాని కుటుంబము బీదదే. అందుచే ధాత యీశ్వర
సంవత్సరములలో వచ్చిన పెద్దక్షామమునకు వీ రష్టకష్టములం
బడిరట. "ఆకరువు దేశమునల్లకల్లోలము పెట్టినది." అనిపెద్దలు
చెప్పుచుండగా వినియున్నాను. "ఆకరువురోజులలో కుటుంబ
ములోనివారి కాహారము తక్కువయైనప్పుడు, మేనత్త, ఆకు
కూర లెక్కువగా సమకూర్చి, అన్నముకంటె కూరలు హెచ్చు
గా పెట్టుచుండుట నాకు జ్ఞాపక" మని ప్రకాశంపంతులు
చెప్పిన ట్లొకరచయిత ప్రజాపత్రికలో ప్రకటించియున్నాడు.

జననము కనపర్తిగ్రామమందైనను నివాసము వల్లూరు
నందే. ఈయన విద్యాభ్యాసము వల్లూరులోని వీధిబడియందు.
అట నీయన గుంటఓనమాలను దిద్దికొనెనట. చిన్నతనములో
స్వబుద్ధిని బడికిపోయినరోజు లేయొకటి రెండుండునోగాని ప్రతి
దినము బడికి గొనిపోవుటకు కనీసము నల్గురైదుగురుపిల్లలకు
పూర్తిగ బనియుండెడిది. వారిలో నొకనికి పుస్తకములు పట్టు

కొనుటపని మిగిలినవారితని కాలుసేతుల పట్టుకొని తిట్లతో కరువులతో తావులతో బాధలంవడుచు నెల్లె సితనిని బడిలోనికి గొనిపోయి పంతులుగారియెదుట హాజరు పెట్టుట నిత్య కృత్య మయ్యెను. పంతులుగారు చెప్పినవిద్యమాత్రము తేలికగ వచ్చినదా? ఎన్ని తొడపాశములు, ఎన్ని చెంపకాయలు, ఎన్ని చింతబరికెలు, బడిలోని విద్యార్థు లందర రొక యెత్తు. ఈ విద్యార్థి యొక్క డొక్క యెత్తు. ఏమైననేమి. ప్రకాశం బడికి పోవుట - బడిపంతులు పాఠములు చెప్పుటకూడ ప్రతిష్ఠించినది. ఇచ్చినపాఠము వెంటనే చదివి వప్పగించి తత్క్షణమే యల్లరి చేయుటకు ప్రారంభించెడువాడు. చిన్నతనముప నింత మొండిగనుండి చదివినవారే రానురాను మేధావంతులై యప్రతిమానవిద్యాగరిష్ఠులై కీర్త్యున్నతుల గడించికొని యశశ్శ్రీ నంద గలిగినవారు. ప్రకాశంపంతు లట్టివాడే.

వల్లూరులో కొలది సంవత్సరము లట్లు చదివిన పిదప "అద్దంకి" యను గ్రామములో నివసించుచున్న ప్రకాశం పంతులు బావ యితని నాహ్వానించి తమకడ శుశ్రూషకు నునిచికొని పాఠములు చెప్పుచుండెడివాడట. అట్లు బావవద్ద నున్నతఱి తండ్రి కృష్ణయ్యగారికి వేంకటగిరిజమీందారీలోని మేనకూరులో నెల కెనిమిదిరూప్యముల జీతముపై 'సముద్దారీ' యుద్యోగము వచ్చినది. అందుచే బిల్లల కింగ్లీషుచదువు

చెప్పించుటకై కుటుంబము సంతయు నాయుడుపేట తరలించి మేనకూరులో నుద్యోగము చేయుచు నింటికి కృష్ణయ్యగారు వచ్చుచు పోవుచు నుండెడివాడు. ప్రకాశం చదువు తిరిగి నాయుడుపేటలో ప్రారంభ మయ్యెను.

పాఠశాల మారినంతమాత్రమున బిల్లవానిగుణములు మారునా? వల్లూరులోని పెంకితనము, కొంటెగుణములు, అల్లరి వాండ్రస్నేహము, పంతులుకి పోలేదు. పైగా వయస్సుతోబా టవికూడ పెరిగినవి. ఆయనతోబాటు గుణములు నాయుడు పేటకుకూడ వచ్చినవి స్థలము మార్పుచే పంతులుకి కొన్ని గుణములుమాత్రము మారినవి. నల్గురిసాయమునగాని బడికి పోవని పంతులు వల్లూరువిడిచి నాయుడుపేట వచ్చినపిదప నం దరికంటె ముందుగనే బడికి పోయి సహోధ్యాయులకొఱ కెదురు తెన్నులు జూచుచుండెడివాడు. వారుకూడ వచ్చినపిదప నిక కావలసినంత యల్లరి. తోడిబాలుర నేడ్పించుటలో పంతులు అగ్రగణ్యుడు. పంతుళ్ళకు పంగనామములు పెట్టించుటలో బ్రసిద్ధుడు. చిలిపికయ్యములతో కాలక్షేపముసేసి దానిని పెంచి తన్నులాటలోనికి దింపి పంతులు బడిపంతులుయెదుట మొదటి ఫిర్యాదీగా నిలువబడినప్పు డందులకు బడిపంతులు తీర్పునొసం గుచు పంతులును బడిలోనుండి వెళ్ళగొట్టెడువాడు. ఈసంగతి కృష్ణయ్యగారికి తెలిసి కుమారుని వెంటబెట్టుకొనిపోయి తిరిగి

బడిలోఁ జేర్చి బడిపంతులతోఁ "మావానిని గట్టిగ కనుగొనవలె" నని 'సిఫార్సు' చేయుచుండెడివారట. పంతులట్లు రెండువర్యా యములు బడిలోనుండి వెడలగొట్టబడెను. పంతులుమాత్రి మెందులకైన మంచిదనియు నుత్తరోత్తరముగ స్వశక్తిపై యా ధారపడవలసినసమయము రావచ్చుననియు దలచి కాబోలు నాయుడుపేటలోని "తాలింఖానా" లోఁ బ్రవేశించి యచ్చటి విద్య లన్నియు నేర్చికొనె నట.

అట్లీయన చదువుకొనుచుండగా తండ్రిగారికి యాకస్మి కమరణము తటస్థించినది. మొదట బీదసంసారము. అందుపై నార్జనపరుడగు తండ్రిగారి యాకస్మికమరణము. దీనితోఁ ప్రకా శంజీవిత మంధకారబంధురమైనది. ఆర్గురిసంతానముతోఁ ప్రకా శంతల్లి యేమిచేయుటకు తోచక నాయుడుపేటలోఁ నుండుటకు సావకాశములేక వంగవోలునకు పయన మయ్యెను. ఈయ ... ధము 1884 సం॥రమునం దేర్పడినది. ప్రకాశం మాంగ్ల విద్యాభ్యాసములోఁ ప్రవేశించిన మూడునాల్గుసంవత్సరము లలోఁ మిడిల్‌స్కూలులోనికి వచ్చెను. అనగా నిప్పటిమూడవ ఫారమునకు సరియగు తరగతి.

ఇంతవఱకు చదువుటే ఆనాడు కష్టముగ నుండెడిది. ఈమిడిల్‌స్కూలుపరీక్షలోఁ నుత్తీర్ణులగువారి కానాటికి యుద్యో గములు దొరకుచుండెడివి. ఆయాశచే వారి నెట్లయిన మిడిల్

స్కూలుపరీక్షలో కృతార్థునిగా జేసి యుద్యోగములో బ్రవే
శింపజేసిన వ్రీకాశం చేతి కందివచ్చి సంసారమును నిర్వహింప
గల డనుకు దేశములో తల్లిగారు విశేషశ్రమ కోర్చి యితనికి
చదువు జెప్పింపనుద్యుక్తు రా లయ్యెను. కాని గడచువిధ మెట్లు?
పిల్లలు చిన్నవారు. ఆమె వితంతువ. అందునను నియోగులు.
విద్య చెప్పించుట యత్యావసరము. వేరు గత్యంతర మేది? సాటి
బంధుగులలో వీరిని జేరదీసి దగ్గరనుంచుకొని మంచిచెడ్డల నా
రసి పిల్లలకు చదువుసంధ్యలు చెప్పింపగల బంధుకోటి తక్కువ.
అందుచే నామెయే సర్వవిధకష్టముల ననుభవింప సంసిద్ధురా
లైనది.

ఆనాటి కీనాటి కాంధ్రదేశములో సన్నవిక్రియము
దూష్యముగా పరిగణింపబడుచున్నది. అందుచేత నీనాటికిగూడ
నాంధ్రదేశమందలి యన్నవిక్రయశాల లరవలహస్తగతము
లైనవి. ఆదేశమున నిది దూష్యము గాదు. ఆంగ్లవిద్యయం
దుత్తీర్ణులయిన మహామహులుగూడ సన్నవిక్రియశాలల
స్థాపించి యాంధ్రదేశమునుండి యపారమగు ధనమును తర
లించుకొని పోవుచుండిరి. వారల కీవృత్తియే సర్వవిధములలాభ
దాయకమై యొప్పినది. కాని యాంధ్రుల కట్లు గాదు. వారికి
కలిగినదా యితరులకు పెట్టుదురు. లేనిచో పెట్టరు. కాని అన్న
విక్రియమునుమాత్రము చేయరు. పూర్వసాంప్రదాయములను,

పూర్వపరిస్థితులనుబట్టి యిది ధర్మమే గాని, కాలము, రాజ్యము మారినవి. ఆచారములు మారుచున్నవి. ప్రజలదృక్పథములు వేరుదారుల బట్టుచున్నవి. ఆముష్మికము దూర మగుచున్నది. ఐహికము ప్రధాన మగుచున్నది. నేటిప్రజలు జీవితములో మత, సాంఘిక, నైతిక, రాజకీయములను వేరుపథముల వెద కించుచు ధనమునకే ప్రాధాన్యమిచ్చినప్పుడు దేశీయుల యాశ యములు మారుటలో విశేష మేమి? ప్రజలు కాలానుగుణ ముగ మారుట సహజము. ధర్మము. ప్రకాశంపంతులు తల్లి కూడ యట్లే మారినది. ఆమె పిల్లలకు విద్య చెప్పించుటయే విధాయకమని తలచినది. స్త్రీయై తానే పిల్లలయభివృద్ధికి కారణ భూతురాలై, యాబాధ్యతి తన నెత్తిపై వేసికొనవలసివచ్చి నప్పుడు నెట్లయిన వారిని బోషించి విద్య చెప్పింపవలసి యున్నదిగదా! అందులకై యామె పూటకూటియింటిని బెట్టి దానివలన వచ్చిన డబ్బుతో పిల్లల బెంచుకొనుచు, విద్యల జెప్పించుచు, వివాహముల గావింపించుచు వారిని సర్వవిధ ముల నభివృద్ధిలోనికి దెచ్చినది. ఆనాడాతల్లి యట్టికష్టములకు తలనొగ్గి ప్రకాశంపంతులు నభివృద్ధిలోనికి తీసికొనిరా గలి గినది కావున నీనాడు ప్రకాశంపంతు లాంధ్రులలో మహా నాయకుడై, మంత్రియై, మన్నన లందగలిగినాడు. వారిసోద రులుగూడ మంచికీర్తి గౌరవముల నసాదించుకొని స్వాచ్ఛంద

జీవితముల జీవించుచున్నారు. ఆసంవత్సరమే వ్రీకాళం పరీక్షకు వెళ్ళి కృతార్థు డయ్యె నట.

## నాట్యకళ – విద్య.

వ్రీకాళం వంగవోలులో నున్నకాలమునం దాయన విద్య నభ్యసించుచున్న విద్యాలయములో 'ఇమ్మానేని హను మంతరావుగారు' అనునొక యుపాధ్యాయుడు వ్రీకాళంమీద నాదరాభిమానముల గలిగియుండెడివాడు. ఇందులకు కార ణము హనుమంతరావునాయుడుగారికి నాటకము లన మంచి యిష్ట ముండెడిది. వ్రీకాళంవంతులులో నొకవిలక్షణమైన గుణ మున్నదనియు, దానిమూలమున స్త్రీపాత్రధారణమునకు పం తులు బాగుగ నరిపోవుననియు, అభినయాదులు నేర్చుచో నాంధ్రదేశమందలి స్త్రీపాత్రధారులలో వ్రీకాళ మగ్రగణ్యు డగుననియు వారు తలంచి పంతులును రంగస్థలమున బ్రవేశ పెట్టవలెనని నాయుడుగా రుత్సాహ లూరుచుండెడివాడు. అందు చేతనే పంతులన్న నాయుడుగా రభిమానముతో జూచు కొనుచు పుత్రవాత్సల్యమును గలిగి యాదరించుచుండెడివారు.

హనుమంతరావునాయుడుగారి కీనాటకాభిమాన మెం దులకు గలిగినదో యిట జెప్పుట యనుచితము గాదు. పూనా నుండివచ్చిన ధార్వారునాటకసమాజమువారి యద్భుతప్రదర్శ

నములచే నాంధ్రలోకమున నాటకకళయం దాదరము కలిగి నది. పెక్కుచోట్ల నాటకసమాజము లేర్పడినవి. నాటకరచయిత లేర్పడిరి. ప్రదర్శనములు ప్రారంభములైనవి. ఇట్లు క్రమక్రమముగా దేశమంతయు నాటకకళ వ్యాపించినది. వివిధగ్రామములలో పెక్కునాటకప్రదర్శనము లేర్పాటు చేయబడుచు వచ్చినవి. ఈవిషయమై నాగేశ్వరరావుగారిజీవితములో వ్రాసియుంటిని. ఆవిషయమును వదలి నాటిరంగస్థలమును గూర్చి కొందివిషయముల దెలుపుదును.

నాటి నాటకములు పాకలలో వేయబడుచుండెడివి. గ్యాసులైట్లుగాని విద్యుద్దీపములుగాని లేనిసమయ మది. గోడలకు తగిలించు పొట్టచిమ్నీలుగల పెద్దసైజు లాంపులు, రంగస్థలములో నమర్చబడిన చెక్కకమ్ములకు మేకులుగొట్టి యేడెనిమిదిదీపము లొకొక్కప్రక్కను తగిలించెడువారు. క్రిందదీపములుగూడ నట్లే పొడుగునను నమర్చి రంగస్థలముపైకి వెల్తురానునట్లుగ బెట్టెడివారు. ఈదీపములు సుమారు 25 కు తక్కువ యుండెడివి కావు. రంగస్థలములో పైన పెట్టినదీపములుగూడ 25 కు తక్కువ యుండెడివి కావు. దుస్తులు ముఖములు, అతరీషుగుడ్డలతో తయారొనర్చి చమ్కీపూసల కుట్టి తొడుగుకొనెడువారు. కొలది తెరలతో కొంచెము దుస్తులతో ప్రదర్శనముల వేసెడువారు. నాటిప్రదర్శనములలో సంగీతము

నకు భ్రాంధాన్య మిచ్చెడివారు. రంగస్థలముపై నటుడు డేదేని పద్య మొకదానిని చదివిన తెరచాటుననున్న యితరనటకు లలో నొక్క డారాగమునే యాలపించి సభ్యుల నానంద పఱి చెడువాడు. నటీసూత్రధారుల సంభాషణము – గణపతిప్రార్థన, సరస్వతీప్రార్థన మొదలగువానితో నాటకమును ప్రారంభించె డువారు. ప్రతినాటకములోను - ప్రతిరంగములోను - హాస్య మును చెప్పవా డొక్క డుండితీరవలసిన దే. మొదట కొన్ని నాళ్ళు వేవరొట్ట గట్టుకొని హాస్యగాడు వచ్చెడువాడు. తరు వాత వివిధములైన వికారపువస్త్రులతో హాస్యగాడు వచ్చి యల్లరిచేసి పోవుచుండెడివాడు. ఈహాస్యగాడు రాజునకంటె గొప్పవాడుగ సేవకునికంటె నధమునిగ బ్రవర్తించుచు నవసర మున్నచోటను లేనిచోటనుగూడ రంగస్థలముపైకి వచ్చి యేవో నవ్వుపుట్టించు కబురులను గొన్ని చెప్పి వెడలిపోవుచుండెడివాడు. కొన్నినాటకప్రదర్శనములలో రాజువేషధారి పేరుగాని రాణి వేషధారి పేరుగాని వ్రాయకుండ "ఫలానివారు హాస్యము చెప్పె దురు" అని నాటకకరపత్రములలో బ్రకటించు వాడుకకూడ యుండెడిది. పురుషవేషములను స్త్రీవేషములనుగూడ పురు షులే ధరించెడివారు. నాటకమంతయు మొదటిపుటనుండి చివరపుటవఱకు ప్రదర్శించెడువారు. సాధారణముగ నాట కము పూర్తియగునప్పటికి భళ్ళుమని తెల్లవారు చుండెడిది.

ఇది పూర్వనాటకముల పద్ధతి. అట్లే హనుమంతరావునాయు డుగారుకూడ తమనాటకసంఘము నేర్పాటుజేసికొని యుండ వచ్చును. ఈసమాజములో పంతులు ముఖ్యమైన స్త్రీవేష ముల ధరించుచుండెడివాడు. కాని యీయన చదువున కానా టకములు నాటంకము పెట్టలేదు. ఈయన మిడిల్‌స్కూలుపరీ క్షలో మొదటిలేగ గతినికృతార్థుడవ్వెను. అందువలన పోలిగారుకూడ హనుమంతరావుగారిసహాయ్యమునకు సానుభూతికిసంతసించి రేగాని వేరుగా వారుభావించి ప్రాశముకు నాటకములలోనికి వెడల వలదని వారింపలేదు. మిడిల్‌స్కూలుపరీక్షలో కృతార్థుడైన పిమ్మట ఫిఫ్తుఫారములో జీతము నీయనక్కరలేనిపద్ధతిపై స్కాలరుషిప్పును దెప్పించుకొని జేరెను. ఇందులకు హనుమంత రావుగారు చేసిన సహాయ్యమపారము. వారు స్కాలరుషిప్పును తెప్పించుటయేగాక కొంతడబ్బుకూడ నిచ్చి సర్వవిధముల వం తుల యభివృద్ధికి తోడ్పడిరి. పంతులట్లు 1886 సం॥రము వరకు వంగపోలులోనే యాగి విద్య నభ్యసించుచుండెడి వాడట.

## రాజమహేంద్రవరజీవితము—నాటకప్రదర్శనములు

ఈసంవత్సరములోనే హనుమంతరావు నాయుడుగారికి రాజమహేంద్రవరములోనిమిత్రులు బంధువులు వారిని రాజ

మహేంద్రవరము రావలసినదిగా కోరుచు జాబుల వ్రాసిరి. రాజమహేంద్రవరములో నెక్కువజీతము దొరికిననియు వ్రజలయాదరము సానుభూతికూడ నెక్కువగ నుండుననియు వ్రాయుటచే నాయుడుగారు వంగవోలునుండి రాజమండ్రికి రావలెనని ప్రయత్నించిరి. కాని ప్రకాశంపంతులును వదల లేక నతనినిగూడ తమవెంట రావలసినదిగ కోరిరి. పంతులు నాయుడుగారిని విడిచియుండుట కుత్సహింపక సర్వవిధముల నాయమొనర్చుచున్న వారితోడనే రాజమహేంద్రవరమువచ్చి యుండవలెనని తీర్మానించుకొనెను. తల్లికూడ పంతులుప్రయాణ మున కుత్సాహమే జూపినది. అప్పటివఱకు పంతులును కంటికి రెప్పవోలె కాపాడిన నాయుడుగారు రాజమహేంద్రవరములో మాత్రమతని కాపాడకుందురా? సర్వమునకు నాయుడు గారిదే భారమని యాపె కుమారుని రాజమహేంద్రవరము పయినించెను. భోజనసామగ్రులు సర్వము మూటగట్టుకొని మూటమోయబడియెడ్లు రెండెడ్లబండ్లపై ప్రయాణముల గావిం చుచు నెట్లెట్లో రాజమహేంద్రవరము జేరుకొనిరి. అనుకొనిన రీతిని నాయుడుగారికి రాజమహేంద్రవరములో నుద్యోగము దొఱకినది. ప్రకాశము నాయుడుగారితోనుండి వంటపూటి యింట భోజనము గావించుకొని పైతరగతిపరీక్షకు చదువ యత్నించెను. కాని కొన్నిదినములట్లు గడచినపిదప పంతులు కింటికిబోవ మనస్సు బుట్టెను. నాయుడుగారితో జెప్పి యింటికి

పయన మయ్యెను. కాని తా నొకటి దలఁచ దైవ మింకొకటి దలచునుగదా! పయనముగుట ప్రకాశముపనిగాని యదికొన సాగుటకు దైవేచ్ఛ యుండవలదా? విధి యెట్లు నిర్ణయించెనో అట్లు జరుగక మానునా! ప్రకాశము ప్రయాణము గోదావరి గట్టువఱకే సాగినది అక్కడనుండి పావనగౌతమిని పడవలపై దాటవలసియున్నది. కాని నాడు పడవలన్నియు ముందే రేవును వీడి నడియేటబడి కొవ్వూరును జేరబోవుచున్నవి. ప్రకాశ మా దృశ్యమును జూచెను. దైవనిర్దిష్ట మిదికాబోలునని వెనుకకు మరలెను. ప్రకాశం వెనుకకు వచ్చుటచూచి నాయుడుగారు సంతోషభరితులైరి. నాయుడుగారిని జూచి ప్రకాశమునకు బ్రహ్మానందమైనది ఈచూపే ప్రకాశములో మార్పు తీసికొని వచ్చినది. ఆనిముషమునుండి ప్రకాశం నాయుడుగారిని వదలక యుండుటకు నిశ్చయించుకొనెను. నాయుడుగారుకూడ ప్రకాశమునువీడి విడిగా నుండుటకు నిచ్ఛగింపకయుండెను. అందుచే హనుమంతరావునాయుడుగారు పంతులు జీతమీయనక్కరలేని పద్ధతిని బడిలో జేర్చి చదువు చెప్పించుచుండెను.

ఈయన చదు విట్లు సాగుచుండగ నాయుడుగారు తిరిగి నాటకప్రదర్శనముల బ్రయత్నము చేయసాగెను. నవాబు దేవిడీలో పాక. అందులో నాటకములు. ప్రజాకర్షణము బాగుగ నున్నది. అందుచే నాటకములు రక్తికట్టుట ప్రారంభించెను.

ప్రకాశము స్త్రీపాత్రధారణము, మనోహరముగ నుండుటచే నాయుడుగారికి నూతనప్రదర్శనముల వేయింపవలెనని బుద్ధిపుట్టినది. ఈనాటకముల హడావడిలో ప్రకాశము 1887 సం॥రమున పరీక్షలో తప్పిపోయెను. కాని అంతమాత్రముచే ప్రకాశము ఆశారహితుడు గాలేదు. నాయుడుగారు ప్రదర్శనప్రయత్నములు మానలేదు. 1888 సం॥రమున విద్యాభ్యాసమును బాగుగ జేయుచుండెను. 1889 లో ప్రవేశపరీక్షయందు త్తీర్ణుడయ్యెను. ఈసంవత్సరములోనే నాయుడుగారు శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారివద్దకు వెళ్ళి నూతననాటకముల వ్రాసియిమ్మని కోరిరి. వారికోరికపై కీచకవధ వ్రాయబడెను. అందు ప్రకాశంపంతులు ద్రౌపదీవేషమును వేసెను. ఆసంవత్సరములోనే ద్రౌపదీపరిణయనాటకములో పంతులు అర్జునపాత్రము, నాయుడుగారు భీమపాత్రమును ధరించిరి. శ్రీరామజననాటకములో ప్రకాశం దశరథపాత్ర ధరించెను. రెండవసారి యీప్రదర్శనము వేయబడినప్పుడు పంతులు కౌసల్యాపాత్రమును ధరించెను. 1890 సంవత్సరములో గయోపాఖ్యానము పూర్తియయ్యెను. అందులో పంతులు చిత్రరేఖపాత్రమును చిదప మూడవయంకమునుండి అర్జునపాత్రమును ధరించెడివాడు. పంతులు శృంగారరసమును వీరరసమును బాగుగ నొప్పించెడివాడట. ఈయన పారిజాతాపహరణమునందు సత్యభామవేషమును నలనాటకమున దమయంతీవేషమును సారంగధరలో

రత్నాంగివేషమును వేసి ప్రేక్షకుల మన్ననలకు పాత్రుడై యుండెడివాడట. 1891 సం॥రమున ధవిళేశ్వరములో హరిశ్చంద్రనాటకమును వేసినప్పుడు ప్రికాశం చంద్రమతివేషమును వేసెనట. నాటకము బాగుగ రక్తి గట్టినదట. ఆప్రదర్శనమునకు రి యింజనీయరులు వచ్చిరట. ప్రదర్శనమును సాంతముగ జూచి మెచ్చుకొని మాకు ఫొటోలు తీసికొనవలెనని యున్నది. రేపటిదినమున పగటిపూట వత్తుము. మేము ఫొటోలుతీసికొని యింగ్లాండు పంపుదుము. కావున అనుజ్ఞ నీయవలయు" నని కోరిరట. అందులకు నాయుడుగారు సంతసించిరి. పంతులు సంతసింప లేదు. ఫొటోలోనికి రాలేదు. నాయుడుగారిమనస్సు చివుక్కు మనినది. కాని పంతులు పట్టినపట్టు వదలలేదు.

1892 సంవత్సరములో కాకినాడలో నాటకప్రదర్శనములు వేయుటకు తగిన యేర్పాటులు జరిగినవి. సింగితపు అబ్బాయిగారు అనే వెంకటారావుగారి నాటకశాలలో ప్రదర్శనములు వేయ నారంభించిరి. ప్రప్రథమమున పారిజాతాపహరణములో పంతులు సత్యభామవేషమును వేసెనట. నాటకము రక్తి గట్టినది. క్రమక్రమముగా పెక్కునాటకములు ప్రదర్శింపబడుచు వచ్చినవి. నాటకములు రక్తిగట్టి డబ్బు మిక్కుటముగా వచ్చుటచే నాటకశాలవద్ద నల్లరులు బయలుదేరిన

వనియు అందులో అబ్బాయిగారు వారిశిష్యులు వచ్చి సాయం చేయుటకుమూరుగా నల్లరులు చేయుచు వచ్చిరనియు, నప్పుడు నాయుడుగారి నాటకసమాజములోని సభ్యులు సింగితవుఅబ్బాయిగారిశిష్యులను గొట్టిరనియు నందుచే నబ్బాయిగారి శిష్యులు ప్రతీకారమును దీర్చుకొను నవకాశమును వెదుకుచుండగా కాకినాడలో సాంబరములు వచ్చుటయు, నాయుడుగారు వలదనుచుండగా పంతులు నల్గురుమిత్రులతో బయలుదేరి సాంబరమునకు రాగా యెనమండ్ర కొండయ్యాయును నాతడు ప్రకాశమును కొట్టగా ప్రకాశము పారిపోయి యొకమార్వాడీ కొట్టులో దూరి తలుపుగడియ వేసికొనెననియు, అప్పుడు కొండయ్య కిటికీవూచలసందునుండి పంతులును కత్తితో బొడవబోగా పంతులు తప్పించుకొని మురుచటియుదయమున కిల్లు చేరుకొనెననియు, అప్పుడు నాయుడుగారు తప్పించుకొనివచ్చిన ప్రకాశమును చూచి చాకచక్యమునకు మెచ్చుకొనిరనియు, మరికొన్నిదినములకు కొండయ్య రాజమహేంద్రవరము రాగా పంతులు వారిమిత్రులు కలిసి కొండయ్యను బండిలోనుండిలాగి బుజ్జి బ్రద్దలకొట్టిరనియు, కొండయ్యకు నెత్తురు కారుచుండగా వాని నాసుపత్రిలో జేర్చిరనియు, కొండయ్య చచ్చినాడను వదంతిని విని నాయుడుగారు హడలిపోయి ప్రకాశముతో చెప్పగా ప్రకాశము వాడుచావడు అని సమాధానము చెప్పె

ననియు, కొండయ్య దెబ్బలు దిని ఛార్జీ నీయుగా సాక్ష్యము చెప్పవచ్చిన కోమటి యధికారిని కోర్టులో చెట్టుకిరింద నుండగా పంతులు కొట్టెననియు పిమ్మట కొండయ్య యిచ్చిన ఛార్జీ కొట్టివేసిరనియు మొదలగు సంగతులు కొన్ని చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారి స్వీయచరిత్రవల్లను మరికొన్ని సంగతులు పెద్దలవల్లను తెలియవచ్చినవి. మరియు, కులము, విద్య, వయస్సు, రూపము, నాటకములయందు పాత్రధారణము, విశేషించి స్త్రీవేషము, చక్కని యభినయము వగవద్దిగలు గలిగినప్రకాశము పెక్కండ్రచే నాకర్షింపబడుచుండెడివారనియు పంతులును చెడునడతలలోనికి జారనీయకుండ కంటికి రెప్పవోలె సదా నాయుడుగారు కాపాడుచుండెడివాడనియు, నాయుడుగారిపై గలభక్తివిశ్వాసములచే పంతులు సత్ప్రవర్తనము గలిగియే మసలుకొనుచు వచ్చెననియుగూడ పెద్దలు చెప్పుచుందురు.

1889 వ సం॥రమున మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థుడైన పిమ్మట ప్రకాశంపంతులుకు ఉద్యోగసమస్య తీవ్రరూపమును దాల్చినది. ఈయన నాయుడుగారిపై నాధారపడి జీవితమును గడుపుకొనుచుండెను. స్కూలుజీతములు, వంటపూటిఖర్చు, తదితరఖర్చులు నాయుడుగారే భరించుచున్నారు. ప్రకాశము ఉద్యోగార్హత గలిగించెడి పరీక్షయందు త్తీర్ణుడై

యున్నప్పుడుగూడ నెచ్చటనైన పనిలో బ్రవేశింపక మిన్న కుండి సర్వమునకు నాయుడుగారిదగ్గరనుండియే సొమ్ముతీసు కొని వెచ్చించుకొనుచుండుట ధర్మము కాదని తలపోయదొడం గెను. రాజమహేంద్రవరమున సబురిజస్ట్రారు ఆఫీసులో రెం డవగుమాస్తాపని ఖాళీ పడినప్పుడు ప్రకాశము దరఖాస్తు పెట్టెను. కాని ఆయుద్యోగి పంతులును పరీక్షింప నెంచినపుడు ప్రకాశ మాయత్నమును విరమించుకొనెను.

ఈయనకు 1890 సం॥లో అద్దంకిలో వివాహమయ్యెను. ఈయన అప్పగారికుమార్తె ననగా మేనకోడలినే యిచ్చి వివాహము చేయుటచే వివాహమున నీతని జీవితములో విశేష మగు మార్పులు రాలేదు. కాని యామెపాదము చల్లనైన దగుటచే వివాహమైనది మొదలు ప్రకాశంపంతులు అదృష్ట రేఖ బయటపడినది. 1891 వ సంవత్సరమున ఎఫ్. యే. పరీక్ష రాజమహేంద్రవరములో నిచ్చెను. ఈయన యఫ్. యే. పరీ క్షకు చదువుకాలమునందే సర్. కూర్మా రెడ్డినాయుడు సహా ధ్యాయుడై చదివెను. ఆపరీక్షయందు కృతకృత్యుడైన పిదప జీవనోపాధినిమిత్తమై యుద్యోగమును జేయుతలంపును విరమిం చుకొని స్వచ్ఛందమైన న్యాయవాదవృత్తి నవలంబింపకోరెను. అందులకై పంతులు చెన్నపట్టణమున న్యాయశాస్త్ర మభ్య సింప కళాశాలయందుఁ బ్రవేశించెనుగాని యఫ్. యల్. పరీ క్షతో నప్పటికి చదువు విరమింపవలసి వచ్చెను.

## న్యాయవాదివృత్తి – మ్యునిసిపల్ వ్యవహారములు

1944 డిశంబరు 20, 27 తేదీల ప్రజాపత్రికలలో ఈవిషయమై శ్రీరవిగారు వ్రాసిన ప్రకాశంపంతులు జీవితచరిత్రలోని కొంతభాగము సీక్రింద బొందుపరచుచున్నాను.

"1891 వ సం॥ రమున ప్రకాశము ఎఫ్. ఏ. పరీక్ష నిచ్చి ప్లీడరీకి యింటనే చదువ నారంభించెను. అప్పుడు ఏలూరి లక్ష్మీనరసింహముగారుకూడ నితనితో జదువబూనిరి. అయినను 21 సం॥రములు నిండినవా రీపరీక్షకు నింట జదువకూడదను నిబంధన యితనిచదువున కడ్డువచ్చెను. ఈప్రతిబంధమువలన నిరుత్సాహముపడక యితడు సావాసుడగు కొణితివాడనుండి కొంతిసొమ్ము బదులు పుచ్చుకొని చెన్నపురికేగి అచటిన్యాయ శాస్త్రకళాశాలలో చేరెను. ఎంతశ్రద్ధతో జదివినను ఆసంవత్సరమునందుని రెండవతరగతి న్యాయవాదిగమాత్రమే గెలుపొందెను. ప్రకాశము సందేహింపక రాజమండ్రికి వచ్చి అచట వకీలుపని చేయబూనెను.

పెద్దపరీక్ష లిచ్చి, గొప్పపేరు సంపాదించిన న్యాయవాదులుండెడి యీపురమున, ముక్కుపచ్చలారని ఈచిన్నవాడు ప్లీడరువృత్తిలో జొచ్చి, వారితో పోటీచేయుట కడు సాహసమని పలువు రభిప్రాయపడిరి. ఐనను సాహసము నిరం

తర పరిశ్రమయును ప్రకాశమునకు వెన్నతో బెట్టిన గుణములు. ఒక్కొక్క న్యాయాధిపతి ఆశ్రయపక్షపాతిగ నుండువాడు. ప్రకాశమునకుమాత్రము మొతికవనలు పెరటిత్రోవలును బనికిరావు. మీదుమిక్కిలి, తనవిలువ హెచ్చుగా నుండుటకై యితడు యెక్కువఫీజు పుచ్చుకొనువాడు. ఐననేమి? యింట దుబరాఖర్చు, వంగవోలు బంధుగులు మరొకము! పొడుగునను దనను సంరక్షించిన హనుమంతరావునాయుని కిపుడు సాయము చేయుచుండువాడు. ఈవ్యయముల కన్నిటికి సరిపడు ధనము నితడు సంపాదించెను. వకీలుగా పేరునందుటకు ప్రజాశక్తులతో పాటుగ పైమెరుగులుకూడ కావలెనని గుర్తెరిగిన ప్రకాశం మొదట నొక రంగులబండిని పిమ్మట గుర్రపుబండిని బెట్టుకొనెను. గొప్పవకీళ్ళతో డీకొని, పెద్దపెద్దకేసులలో నెగ్గి ఇతడు మంచిపేరు తెచ్చుకొని రెండుచేతులతోను సొమ్ము సంపాదించెను.

కాని యెన్నడును ప్రకాశము తృప్తి నెరుగడు! పట్టి ధనార్జనతో గడుపుచుండక, అతడు మునిసిపాలిటీ వ్యవహారములలోనికి దిగెను. ఆంధ్రదేశమందెల్ల రాజమండ్రి మునిసిపాలిటీ మిగుల పురాతనమైనది. దాని కపుడు 50, 60 వేల రూపాయలు సంవత్సరాదాయము. ఏలూరి లక్ష్మీనరసింహము గారు అచట మొదట అనుద్యోగి చైరుమను. ఆకాలపున

కాయన మకుటములేని మహారాజె! తక్కినసంగతులం దెటు లున్నను, ఏలూరికి డబ్బువిషయమున కర్తలేదు. అంత నాతని నోడింప న్యాయవతి సుబ్బారావుపంతులు మున్నగు పుర ప్రముఖులు పూనిరి. వీరేశలింగముపంతులు, లక్ష్మీనరసింహము చర్యలను ప్రహసనములలో నెక్కించి వెక్కిరించెను. దీనిఫలితముగా ఏలూరివారి పరువునష్టముదావా!

ఆరోజులలో నిడమర్తి దుర్గయ్యగారు మునిసిపలు ఛైరు మను. ఛైరుమనులు యెట్టిగుణవంతులైనను, పక్షపాతబుద్ధి వహించి, కవున్సిలులలో తమమిత్రులను జేర్పించుట, శత్రువులను రాకుండ జేయుటయును, వారి కానాడు నిత్యకర్మకలాపమే! ఆకారణముచేత న్యాయవతిపార్టీకి "దేవిడీమన్నా" కాగా వారు దొరతనమువారిప్రాపుతో సభ్యులై పెరటిదారిని కవున్సిలులో ప్రవేశించిరి! ఐనను, తనపక్షమున నెక్కువ సభ్యులుండుటవలన నిడమర్తి తనయిచ్ఛవచ్చినట్లు చేయ గలిగెను.

ఆకాలమున రాయప్రోడి సుబ్బారాయుడుగారను వర్తకునికి మునిసిపల్ వ్యవహారములలో మిక్కిలి పలుకుబడి గలదు. తెరమీద బొమ్మ నెక్కించి బొమ్మను దింపించగలడు! అతనికి మునసబుకోర్టులో చాలకేసు లుండెడివి. కాని స్వతంత్రబుద్ధి గల నిడమర్తి, రాయప్రోడిని లెక్కసేయక పోవుటచేత వర్తకునిదృష్టి ప్రకాశంమీద పడెను. ప్రకాశమునకు కేసులలో

మేలుచేసినను, ఈక్రొత్తప్రివకము, కవున్సిలరుపనిమాత్రము రాబట్ట లేకుండెను. ప్రకాశ మంతట 1896 నుండి వరుసగా మూడేండ్లు ఆపదవికి ప్రియత్నించినను చైరుమను తనవలుకు బడిని వినియోగించి, వోటర్లను త్రిప్పివేయుచుండెను. దుర్గయ్యా పంతులు మేధావి, స్వతంతుృడు, నైతికోన్నతి కలవాడునని ప్రకాశ మెరుగును. కావుననే యామూడేండ్లును ప్రకాశము కవున్సిలులోని కడుగు పెట్టలేకపోయెను. కాని 1899 లో ప్రకాశము కవున్సిలులోనికి వచ్చి, నిడమర్తిపార్టీ నిట్లు ఓడించి నను, చైరుమనుమాత్రం కాలేకపోయెను. ప్రకాశము వచ్చుట న్యాపతికి సంతోషమేగాని, స్వతంత్రబుద్ధిగల యతడు చైరుమను అగుట మాత్రము వలకిరాదు.

ఇంతలో మద్రాసు లేజిస్లేటివు కవున్సిలు నియామక ములు వచ్చెను. ఆయెన్నికలకు మునిసిపల్ కవున్సిలరు లందరును వోటర్లు. బళ్ళారివకీలు కోలాచలము వెంకటరావుగారొక అభ్యర్థి. కాకినాడ న్యాయవాది కృత్తివెంటి పేరాజుగారికి వారితో పోటీ. సుబ్బారావుపంతులు పేరాజుపక్షము. సంఘసంస్కారి. యగు వెంకటరావు పక్ష ప్రకాశము. దీనివలన న్యాపతికిని ప్రకాశమునకును మరింత యెడ మయ్యెను.

సందడిలో సందడి, అపుడె రాజమండ్రి మునిసిపలు చైరుమను యెన్నికలును. కొందరు దుర్గయ్యగారిని మరల

రమ్మనిరి. కాని కొంతకాల మాగౌరవపీఠ మలంకరించి వదలి వేసినవారు తిరిగి దాని నపేక్షింపక, ఇతరులకు యువకులకును గొంత అవకాశ మిచ్చుచుండవలెనని యాతనిమతము. ఏలూరి తిరిగి రాజూచెనుగాని, ప్రకాశము వలదని నివారించెను. సబు కలెక్టరు రై సుదొరకూడ వాంఛించెనుగాని, స్వదేశస్థుల కుద్దేశింపబడిన యిట్టిగౌరవపదవులకు ప్రభుత్వోద్యోగులు పాల్కొలాడ గూడదని ప్రకాశము గట్టిగ జెప్పెను. అంతట, సుబ్బారావుగారితో గలసి వకీలుగనుండి, ఆయన యనుగుజాడల నడుచునట్టి మోచర్ల రామచంద్రరావుగారికి వుద్యోగ మయ్యెను. మితవాదియు, ఉద్యోగస్థులపాల్పు నపేక్షించువాడును అగుట చేత నితనిని రెండవసారి చైరుమనుగ జను లెన్నుకొన లేదని ప్రకాశ మనుకొననే కాని, యిది సరిగాదు. న్యాయశీలుడని పేరుపడిన మోచర్లవంటివారు, వేవేగమె జనరంజకులు కాగలరా?

ఆమరుచటి సంవత్సరము ప్రకాశమునకు చైరుమను పదవి లభించెను. ఇది న్యాపతి మున్నగు ప్రముఖులకు గొందరికి గంటకముగ నుండెను. ప్రకాశముయొక్క నియామకము నకు దొరతనమువారు వెనువెంటనే సమ్మతిని దెలుపకుండ కొండ రడ్డుపడిరి. కొంప రీతనిసావాసులమీద కేసులు తెప్పించి అవ్విధముగ నితనిని సాధింపబూనిరి. ఇవియేవియు లెక్కసేయక

ప్రకాశము సమర్థతో కార్యసాధనము చేసెను. కష్టములన్నియు దొలగిపోయెను. ఇతనిని చైరుమాను నియామకము తమ కంగీకార మెయని యెట్టకేలకు ప్రభుత్వమువారు ప్రకటించిరి.

రాజమండ్రి పురపాలన మెంతో చాకచక్యముతో ప్రకాశము జరిపించెను. గుర్రమెక్కి యనుదినము నితడు పట్టణము నాలుగువైపులను స్వారిచేసి వచ్చుచు పురపారిశుద్ధ్యమును జక్కగ గాపాడుచుండువాడు. హితులు విరోధులునను వివక్షత లేక యెల్లరను సమదృష్టితో జూచి, జనులకు న్యాయ సౌఖ్యములు గలిగించు చుండును.

దిీ 27—12—44 ప్రజాపత్రిక.

## ఇంగ్లండులో చదువు

ఇట్లు ప్రకాశము రాజమండ్రిలో వకీలుగ పుష్కలముగ ధనమును, మునిసిపల్ చైరుమనుగ ప్రతిష్టయును గడించుచుండెను. కుటుంబములోని చిన్నలు పెద్దలును శాంతిసౌఖ్యములనుభవించుచుండిరి. కాని మన కథానాయకుని కెన్నడును ఉన్నదానితో తృప్తి లేదు. ఒక కేసువిషయమున నితను చెన్నపురి పోయి, బారిష్టరు స్వామినాధన్ గారితో సంభాషించునపుడు, తనవలెనే ప్రకాశముకూడ సీమపోయి బారిష్టరు అయి

వచ్చినయెడల, అతడు చిన్నప్రదేశమగు రాజమండ్రిలో నిరంతరమును కూపస్థమండూకముగా నుండనక్కర లేదనియును, చెన్నపురివచ్చి గొప్ప న్యాయస్థానములలో వాదించి యపార ధనరాసు లార్జింపవచ్చు ననియును ఆదాత్మీయాత్ముడు గట్టిగా బోధించెను.

గొప్పసంగతులు వినుటకును, అవి యాచరణలో బెట్టుటకును ప్రకాశమున కెక్కువ వ్యవధాన మక్కరలేదు. ఇల్లు సేరగనే యితడు, ఉన్నత న్యాయశాస్త్రవిద్యకై సీమ పోయి వత్తుననియును, అపుడె తనకోర్కె లన్నియును సఫల మగు ననియును, తల్లితో జెప్పెను. పరదేశమున దాను మద్యమాంసములు ముట్టనని వాగ్దానము చేసెను. తల్లి సమ్మతించెను. భార్యయు ననుమతించెను. అక్టోబరు మొదటివారములో నతడు బొంబాయిలో స్టీమరెక్కి ఇంగ్లండు చేరెను. ఆదేశస్థులు హిందువుల నెంతో గౌరవించుట కాతడు సంతోషించెను. తనకళాశాలలో నతిశ్రద్ధతో న్యాయశాస్త్ర మభ్యసించెను. తీరికసమయములందు న్యాయస్థానములకు బోయి, అచటి వాదనలు, తీర్పులు మున్నగువవి వినుచుండును. స్వదేశమున దనకు పదిసంవత్సరముల న్యాయవాది యనుభవము గలదు గావున, సీమ చదువు ప్రకాశమున కెంతో లాభకారి యయ్యెను.

ప్రకాశము లండనులోని భారతీయసమాజములో సభ్యుడయ్యెను. అదివరకు రాజకీయములం దభిరుచిగల ఇతని మనస్సును ఆంగ్లేయుల రాజకీయము లమితముగ నాకర్షించెను. ఆసమాజ సభల కీతడు తరుచుగ బోయి, పేరెన్నికగన్న యందలి సభ్యులను ప్రేక్షకులను జూచువాడు. పార్లమెంటుసభ్యుడగు దాదాభాయి నవరోజి నుతికెక్కిన సర్. హెన్రీకాటను, వెడ్డరుబరును, బెనర్జీగార్లును ఆసంఘసభ్యులె. నవరోజిగారి యెన్నికల విషయమై ప్రకాశము మిత్రులును ప్రచారము సలిపిరి.

వీరిసమాజములో నొకానొక సందర్భమున నుపన్యసించుటకు గోష్ఠే సురేంద్రనాధ బెనర్జీలలో నెవనిని బిలువవలెనాయను సమస్య రాగా, చిరకాలము బంగాళాలో నున్నతోద్యోగము చేసిన కాటను బెనర్జీ పక్షమునను, బొంబాయిలో ఉద్యోగకాలము గడిపిన వెడ్డరుబరను గోష్ఠేపక్షమునను, సంభాషించిరట. చిట్టచివరకు అధిక సంఖ్యాకుల కోరికచొప్పున గోష్ఠే యాహ్వానింపబడెను. అచటనే ప్రకాశము, లాలాలజపతిరాయి, శ్యామకృష్ణవర్మలను సందర్శించెను. ఆరోజులలోనె బారిష్టరు చదువుకై పోయియుండిన శంకరనాయరుకూడ యీతని కగపడెను. కాని, నాయరు న్యాయశాస్త్రవిద్య పూర్తి

కాకయె తనకు హైకోర్టుజడ్జీపదవి రొయసంగ బడుటచేత, హిం దూదేశము తిరిగివచ్చెను.

ఇట్లు భారతస్వాతంత్ర్యముకొరకు పరిశ్రమించు వ్యక్తుల తోను సంస్థలతోను వ్రీశాశమునకు సాహచర్యము కుదిరెను. ఐన నిట్టికాలక్షేపము, వ్రీశాశము విద్యాభివృద్ధికి భంగకరము గాలేదు. ఇంట వాగ్దానము చేసినచొప్పున సీమలో శాఖాహా రమునె భుజించువాడు. అందుచేత సావాసు లీతనిని "గడ్డి మేసి బ్రదుకువాడా!" యని గేలి చేయుచుండిరి. తా నాదేశ ములో నుండిన మొదటి యెనిమిది నెలలలోను వ్రీశాశము అందలి ముఖ్యపట్టణము లన్నిటిని జూచి వచ్చెను.

అంత తనసెలవు దినములు హిందూదేశమున గడవ గోరి, వ్రీశాశము జూను— 30 వ తేదీని స్వదేశమునకు బయన మయ్యెను. ఇతడు సీమనివాసఫలితముగా మద్యపాన స్త్రీలోల త్వములలోబడి చెడిపోకుండుటకు రాజమండ్రి మిత్రు లెంతో సంతోషించిరి. మీదుమిక్కిలి, "విదేశజీవితమె న స్ని బలహీనత నుండి మానసికముగా గొంతవరకు తప్పించి, మంచిమార్గము నకు మళ్లించినది" అని ప్రకాశము చెప్పెను.

ఈలోపల, రాజమండ్రి పరిస్థితులు మిక్కిలి మారినట్లు వ్రీశాశము కన్నులకు గానబడెను. న్యాయపతి సుబ్బారావుగారికే దెలియకుండ, ఆయన తమ్ముడు శేషగిరిరావుగారికి వీరేశలిం

గముపంతులు వితంతువివాహము చేసినందున, ఆచిరకాల మిత్రులకెడబాటు గలిగెను.

ఆకాలమున సముద్రయానము నిషిద్ధము గావున, ప్రాయశ్చిత్తము చేసికొనినగాని ప్రకాశమును సంఘములో చేర్చుకొనరాదని పూర్వాచార పరాయణులవట్టు. కాని, దీనికి ప్రకాశ మెంతమాత్రము నొప్పుకొనలేదు. ఇతని నభినందించుచు మిత్రు లెన్నియో విందులు చేసిరి. ఆవిందులలో పాల్గొన్నవారిని వెలివేయుటకై పలువురు ప్రయత్నించిరి. శంకరాచార్యులవారి యుత్తరువును ప్రకాశ ముల్లంఘించెను. ఇతనిని సంఘ బహిష్కృతుని జేయవలెనని పెద్దలు కొందరు మార్కండేయాలయములో పెద్దసభ చేసిరి. ఆ తరుణమున ప్రకాశము స్నేహితులు కొందరు లేచి యాతని పక్షమున ప్రసంగింపగా సభలో కల్లోలము జరిగెను. "సంఘసంస్కర్త" వీరేశలింగము పంతులుగారు ప్రకాశము పక్షమున నుండిరి.

ఇంతలో ప్రకాశము విద్యాపరిపూర్తి చేయుటకై తిరిగి యింగ్లండు పోయెను. ఈమారాతడు యూరపుఖండ దేశముల న్నియు సంచారముచేసి వచ్చెను. జర్మనీవెళ్లి, తొట్టివైద్యమున ప్రసిద్ధినొందిన డాక్టరు నేకూ యుండు లీప్జిగు పురమేగి, ఆవైద్య విషయమై యనేకసంగతు లాయనయొద్దనుండి తెలిసికొనెను. ఇప్పటికిని ప్రకాశమున కావైద్యమునం దభిమానము హెచ్చు.

జర్మనులు యుద్ధమందునరక్తి గలవారనియు, సైనికులె యీదేశమున పూజార్హు లనియును అతడు గ్రహించెను.

ఇంగ్లాండులో బారిష్టరుపరీక్షయందు త్తీర్ణు డగుటకు బూర్వమె, తాను హిందూదేశమునకు వచ్చినపిదప యెక్కడ న్యాయవాదిగ నుండవలెనా యనుసమస్య ప్రకాశము మనస్సును వేధించెను. వెనుక రాజమండ్రిలో నున్నకాలమున అతడు స్థానిక రాజకీయములలో నూరుకొని పోయెనుగదా! అసలు తన సీమచదువుయొక్క ముఖ్యోద్దేశము మద్రాసు వచ్చి అధికధనార్జనము చేయవలె ననియెకదా! కావున మద్రాసులో నుండుటకే ప్రకాశ మపుడు నిశ్చయించుకొనెను.

1912 వ సం॥రములో గాంధీమహాత్ముడు యింగ్లండు వెళ్ళినప్పుడు ప్రకాశము మహాత్ముని కలిసికొని సంప్రదించెను.

ఈపైవిషయము లన్నియు ప్రజాపత్రికలోనుండియే గ్రహించినాను. ఈవిషయములలో వివాదగ్రస్తములుగాని భిన్నాభిప్రాయములుగాని యుండుటకు సావకాశము లేదు. పైగా నవియెల్ల ప్రకాశంపంతులు చెరలోనుండగా స్వయముగా వ్రాసికొనిన జీవితచరిత్రములోని అంశము లేయని తెలియవచ్చుటచే వానిలో భ్రమప్రమాదము లుండవనియు, నత్యేతరములుండవనియు తలంచియే యథారూపమున దానినెల్ల గ్రహించితిని. మరియు ప్రకాశము రాజకీయమునుబట్టి

యాంధ్రులకు నాయకుడైనాడు. ఈరాజకీయజీవితమే లేనినాడు ప్రకాశము అందరు బారిష్టరులవలె సామాన్యుడే యగును. కావున నాతని రాజకీయ జీవితవిషయమును ప్రత్యేకముగ వ్రాయదలచి సాధారణజీవితచరిత్రను ప్రజాపత్రికనుండి గ్రహించితిని. ఈ వ్యాసమును రచించినవారు మొదటివ్యాసము లలో పేరువ్రాయక గూఢముగ నుంచిరి. పిదప మూడవ వ్యాసమునుండి కాబోలు శ్రీరవి రచయితయని రెండువ్యాస ముల వ్రాసికొనిరి. పిదప చివరిరెండువ్యాసములలో రచయిత రాయసం వెంకటశివుడు అని వ్రాసికొనిరి. ఈ ముగ్గురు ఒక్క రేయైనచో నిన్నిభిన్ననామముల బెట్టుకోవలసిన యవసరమేమి వచ్చినదో? రచయితలు భిన్నులైనచో పత్రికాధిపతికి నా వందనములు.

ప్రకాశంపంతులుతో నింగ్లాండునందు బారిష్టరుగా చదువుకొనినవారిలలో నృపేంద్రనాధసర్కార్ ఒక్కడు. పం తులు యింగ్లాండునుండి తిరిగి స్వదేశమునకు వచ్చునప్పుడు పది వేలరూప్యముల గ్రంథములు అరువుపద్ధతిపై తీసికొని వచ్చి నసియు, మొత్తంమీద చదువు పూర్తియై యింటికి వచ్చు నప్పటికి సుమారు అరువదివేలు అప్పు మిగిలినదనియు, ఈ అప్పుతోనే చెన్నపట్నమున బల్లకట్టి న్యాయవాదవృత్తి నవ లంబించెననియు తెలియుచున్నది.

కాని ప్రకాశం న్యాయవాదవృత్తి ప్రారంభించునప్పటికి ఋణముతో నుండినాడు. వృత్తి మానునప్పటికి వేలు లక్షలు గణించినాడు. లక్షల కధికారి యైనాడు. సత్యాగ్రహోద్యమములో జేరి ప్రజాసేవ చేయుట ప్రారంభించినాడు. స్వరాజ్యపత్రిక బెట్టినాడు. గణించిన లక్షలన్నియు హారతి కర్పూరపురూపాయి లైపోయినవి. తిరిగి ఋణము. మొట్ట మొదట యేస్థితియో చివరి కాస్థితియే - ఋణజాతకుడు పంతులు. అని ఆతనిజీవితమును సింహావలోకనము చేసి చూచిన చెప్పవలసినవిషయ మది యొక్కటే కాని పంతులు ప్రజలకు పడిన బాకీకంటె ప్రజలే పంతులున కెక్కువ బాకీ పడినమాట వాస్తవము. సైమనునప్తకమును బహిష్కరించుటకై చేసిన కార్యదీక్షలో గుండుదెబ్బలకు గుండె లిచ్చిన వీరుడు; నెలకు వేలకొలంది గడించి యశశ్శ్రీనందిన ఘనుడు; మహాత్ముని తొలిపిలుపునకు జవాబిచ్చి తోడివారలతో చెరలో బాధపడిన ధీరుడు; తనమహదైశ్వర్యమును స్వరాజ్యపత్రికకై కొనగోర వెచ్చించిన త్యాగి; రాజ్యాంగవేత్తలలో నొక్కడై యమాత్యుడైన ధీశాలుడు; రాష్ట్రమండలి జమీందారుల, రాజుల, మహారాజుల నల్లలాడింపజేయగల జమీందారివన్నుల సవరణ చట్టమును నిర్మింపగల విజ్ఞాని; ఈనాటివఱకు స్వేచ్ఛావృత్తినే యవలంబించి జీవించి వృద్ధాప్యమునుగూడ నరకకూపసదృశమైన చెఱలో పెట్టబడిన యాంధ్రాభిమానీ; ఆంధ్రకేసరి; ఆంధ్రావని

క్తైకైక నాయకుడు ప్రకాశంపంతులు. అట్టివానిఋణమును యాంధ్రావని యున్నంతకాల మాంధ్రులు తీర్చుకొన లేరు-తీర్చుకొన లేరు. రూప్యము లాతనిఋణమును దీర్పలేవు. పొల ములు సేరీలు వానిఋణమును దీర్పజాలవు. ఆస్తిపాస్తులు, మేడలు మిద్దెలు వానిఋణమును దీర్పలేవు. ఆంధ్రులత్యాగ ధనము, ఆంధ్రుల యమూల్యపౌరుషము, ఆంధ్రజాతిలోని యప్రతిమానప్రతిభావిశేషైశ్వర్యము, పంతులఋణమును వెళ్ళ బెట్టగలవు. నే నాంధ్రుడనని సగౌరవముగ సగర్వముగ నిలువ బడి తనరాష్ట్రమునకు, తనజాతికి యౌన్నతిగొనిరా గల్గిన యాంధ్రుడే పంతులుఋణమును తీర్పగలిగినవాడు. ఆనాడే పంతులకు ఋణవిముక్తు లగుదురు ఆంధ్రులు.

## బారిష్టరు ప్రకాశం.

మద్రాసులోని కొండిచెట్టివీధిలో పదకొండవనెంబరు యింటిని ప్రకాశం బాడుగకు తీసికొని న్యాయవాదవృత్తిని ప్రారంభించెను. అచిరకాలములోనే యతడు మంచిన్యాయ వాదిగ పేరు గడించుకొనెను. ఈతడు బహుసాహసికుడు. వృత్తినిబట్టి స్వతంత్రజీవనమేగాని సర్వదా యధికారులతోను క్లయింట్లతోను కాలక్షేపము చేయవలసిన న్యాయవాది సాహ సికుడుగ గాకయుండుట మంచిదని పెద్ద లందురు. కాని ప్రకాశ

మట్టివాడు కాడు. అతడు నిజమైన సాహసికుడే. మిత్రుడు నిడదవోలు వేంకటారావు ప్రకాశమునుగూర్చి వ్రాయుచు "ఒకానొకసమయమందు ఒకన్యాయమూర్తియెదుట ఒకవ్యాజ్యంలో ప్రకాశంపంతులు ఆర్గ్యుమెంటు చెబుతూవుండగా ఆన్యాయమూర్తికి కునుకు పట్టిందట - అది కనిపెట్టి ప్రకాశంపంతులు తనవాదమును నిలిపివేసి ఆయనకు తిరిగి మెలకువ వచ్చేవరకు తనకుర్చీలో కూర్చొని యున్నాడట ఈవిధంగానే మరియొక వ్యాజ్యంసందర్భంలో నీతడు వాదం ప్రారంభించాడట. ఈతని ఆర్గ్యుమెంటు వింటూనే అక్కడిన్యాయమూర్తి గుఱ్ఱు ప్రారంభించాడట. ప్రకాశంపంతు లదిచూచి తననంచి, కాకితాల కట్ట పట్టుకొని టకటకమని క్రిందకి వెళ్ళిపోయినాడట." అని 3—12—1944 ఆంధ్రపత్రికలో వ్రాసినాడు.

అధికారములకు తరకటబరకటలకు బచ్చినవుటిచ్చకములకు భయమందక తబ్బిబ్బుజెందక బ్రాలుమాలక, ఆత్మగౌరమును, ఆత్మబుద్ధిని, ఆత్మవిశ్వాసమును, ప్రధానముగ ముఖ్యముగ లక్ష్యశుద్ధిగ బెట్టుకొని, జీవించెడి ప్రకాశముకంటె పుణ్యులు-పూజ్యులు ధన్యజీవు లెవరు? అట్టివాడుకావుననే ఆంధ్రుడయ్యు నరవల్ల ప్రాముఖ్యముగల న్యాయవాదిసంఘమునకు నాయకుడై ప్రకాశించినాడు. అట్టివాడుకావుననే యురవల ప్రాభవము మిన్నుముట్టెడి మద్రాసులో తా నొక ఆంధ్రుడై

యసమాన వైభవవోన్నతుల నందగలిగి, ప్రతిభావిశేషమున ప్రజ్ఞాన్వితుడై, లక్షలాదిగ గడించి, తానొక మేటి న్యాయ వాదిగ రాణకెక్కినాడు. అట్టివాడు కావుననే తనవద్ద పని నేర్చుకొనిన ముగ్గురున్యాయవాదులు హైకోర్టుజడ్జీలుగ మహో న్నత పదవుల నందియుండగా చూచి యానందింపుచు, న్యాయవాదవృత్తిని విసర్జించి రాజకీయజీవితమును ప్రారంభించి యాంధ్రావని కేకైకనాయకు డైనాడు. ప్రకాశ మట్టిధీశక్తి కలవాడు. చిన్నతనమునుండియు న్యాయవాది కావలెనను కోరిక, కాగలనను ధైర్యము, కాదలచిన యభినివేశము, ప్రకా శమును బారిష్టరుగ తయారు చేసినవి. ఈయన బారిష్టరుగ 1907 నుండి 1921 వఱకు చేసిన పదునాలుగుసంవత్సరము లలో మొదటి యేడుసంవత్సరములు కృషిగ రెండవయేడు సంవత్సరములు తత్కృషిఫలితముగ విభజింపవచ్చును. ఈచి వరి యేడుసంవత్సరములలో నీతడు ఉదకమండలములో రెండు, వ్యగ్రామం దొకటి, రాజమండ్రిలో నొకటి, వంగవోలులో నొక్కటి, చెన్నపురిలో నొక్కటి చక్కని విశాలభవనముల కట్టించుకొనెను. రెండులక్షలు బ్యాంకిలో నిల్వ చేసికొనెను. మదాసులో న్యాయవాదివృత్తిలో నపారధనరాసుల గడించు కొనిన యరవసోదరులతో బాటాంధ్రుడుగూడ సమముగ తులతూగగలడను విషయమును ప్రకాశము తనయభినివేశము

వలన నిరూపించెను. బారిష్టరుగ ప్రకాశము సత్యావోలు గున్నేశ్వరరావు కరెస్సినోట్ల కేసులోను, కందుకూరి వీరేశ లింగంపంతులుగారు టంగుటూరి శ్రీరాములుగారిమీద తెచ్చిన యభియోగములోను, ఈనడుమవచ్చిన మద్రాసు రాజకీయపు కుట్ర కేసులలోను పనిజేసి విఖ్యాతి గడించుకొనిన విషయ మాంధ్రుల కెల్లరకు తెలిసినదే. చెన్నపురియందలి యాంధ్ర న్యాయవాదులలో నగ్రగణ్యుడై న్యాయవాదిసంఘాధ్యక్షుడై న్యాయశాస్త్రములపై న్యాయాధికారు లిచ్చు తీర్పుల బ్రక టించు పత్రికాధిపతియై, జస్టిసు పాండలే మొదలగున్యాయాధి కారులను తయారు చేయగలిగిన అగ్రన్యాయవాదియై లక్షలా దిగ చరస్థిరాస్థుల గడించిన మేటియార్జనపరుడై ప్రకాశము కీర్త్యున్నతుల వడసెను.

## హో ం రూ లు లీ గ్గు.

1916 సం॥రమున ప్రారంభమై 1916 – 1917 సం॥ రములలో నున్నతస్థితికి వచ్చిన హోంరూలులీగ్గులో ప్రకాశం పంతులు సభ్యుడుగానుండి పనిచేసెను. ఈలీగ్గు అనిబిసెంటు వలన స్థాపింపబడెను. రెండవలీగ్గు లోకమాన్య బాలగంగాధర తిలకుగారివలన స్థాపింపబడినది. ఈరెండవలీగ్గులో నాంధ్రులు విశేషముగ లేరు. బిసెంటు ఆంధ్రరాష్ట్రములో సంచారము

చేయుటచేతను, మద్రాసు హోంరూలులీగునకు కేంద్రస్థాన మగుటచేతను ఆంధ్రులలో చెక్కుచెదరని బిసెంటుహోంరూలు లీగులో సభ్యులుగా జేరిరి; కాని యెంతమంది జేరినను విశేష ప్రయోజనము లేకపోయినది. ఈసంస్థ విద్యాధికుల కొందఱినే యాకర్షింప గలిగినది. వెక్కుడ్రుము రహితులుగాని, కూలీలు గాని, సాధారణజనముగాని లీగునుగూర్చి తెలిసికొనగల స్థితిలో లేకపోవుటచేతను, ఈసంస్థ జనసామాన్యమును కాకర్షణీయ మార్గముల ప్రబోధించి యుండకపోవుటచేతను త్వరలో లీగు పతన మందినది. బిసెంటు ప్రోగుచేసిన ధనరాసులు, స్థాపించిన న్యూయిండియాయను ఆంగ్లదైనికపత్రిక, ప్రచురించిన వేలాది కరపత్రములు జనసామాన్యమును వశము జేసికొన లేకపోవు టచే లీగు పతన మందినది. నేటియాంధ్రులలో నాయకులైన పట్టాభి, ప్రకాశము, కాళేశ్వరరావు, వెంకటప్పయ్యపంతులు మొదలగు మహామహులు నాడు లీగునకు చేయూత నిచ్చి నను నిలువలేక లీగుపతన మందినది. ఇందులకు కారణము చెప్పియే యున్నాను. జనసామాన్యములోనికి లీగు చొరుచు కొని వెడలలేకపోవుటే లీగుపతనమునకు మూలకారణము. ఈ కారణమును గుర్తించియే గాంధీ తనసహాయనిరాకరణోద్య మమునకు కోటిమంది సభ్యులు కావలెనని తీర్మానించి దేశ ములో మూలమూలలనున్న జనసామాన్యమునకు కాంగ్రెస్సు

సందేశమును కొనిపో గలిగెను. అందుచే గాంధీగారి సత్యా గ్రహోద్యమము స్థిరమైనది.

## మా ప్లా వి ప్ల వ ము

దక్షిణభారతదేశములో మళయాళమునుభాగముకలదు అందలి తురకలను మాపిళ్ళాలు లేక మాప్లా లందురు. 1919–1920 సం॥న ప్రభుత్వమునకును మాప్లాలకును విభేదకారణములు వర్ధిల్లినవి. మాప్లాలు విప్లవమును లేవదీసిరి. ప్రభుత్వము నిర్దాక్షిణ్యముగ వేలకొలదిని సంహరించినది. స్త్రీలనుదప్ప మిగిలినపురుషుల నందఱబట్టి చెఱలలో బెట్టిరి. నేరస్థులందఱ కురిశిక్ష వేయబడినది. ఆప్రదేశమున సైనికశాసన మములులోనికి తెచ్చిరి. ప్రభుత్వము దారుణవధలు – నిర్బంధములు చేసి మాప్లాలను సర్వవిధముల హింసించినది. నూర్గురు మాప్లాఖైదీల నొక్కరైలుపెట్టిలో కూరుటచే మరుసటియుదయమునకు వారెల్ల నమసిరి. సైనికశాసన మములులో నుండుటచే నక్కడి సంగతులు పైవారికిగాని, పైవారిసంగతు లక్కడివారికిగాని తెలియనిస్థితి ప్రబలినది. అప్పుడు ప్రకాశము సైనికశాసనము నుల్లంఘించెను. హిందూదేశములో సైనికశాసనమునే యుల్లంఘించినవారిలో మొట్టమొదటివాడు ప్రకాశము.

విప్లవకారులైన మాప్లావారిని హిందూదేశమునుండి వెడలగొట్టింప ప్రభుత్వము కృషిచేసెను. 1923 సం॥రములో Mr. Nap అను మద్రాసురాజధానిలోని ప్రభుత్వోద్యోగిని యీపనికై నియోగించెను. అందుపై నాతడు చెరలలో బంధింపబడిన మాప్లాలను సందర్శించి వారలతో ప్రసంగించి వారల కీవిధముగ నాశల గొల్పెను. 1. ఖైదీల నందఱ విడిచిపెట్టించుట. 2. ఎవరికుటుంబముల వారికి జేర్చి వారిని సుఖజీవులుగ జేయుట. 3. ప్రతికుటుంబమునకు వస్త్రాదికములు, వ్యవసాయపుపరికరములు, పశువులు, కుటుంబమున కింత భూమియుని కొలిచి వారల కాభూమిని పట్టాలతోసహా నొసంగుట. 4. పైసుఖములు బడయదలచిన వారు అండమాను నికోబారు దీవుల నాక్రమించుకొని యక్కడనే సుఖజీవులై జీవింప వలసియుండుట మొదలగు షరతుల నాతడుప్రచారముచేసెను. ఇందులకు మాప్లా లంగీకరింపలేదు. అందుచే Mr. Nap యొక్క పూనిక విఫల మయ్యెను.

## అసహాయోద్యమము

1914 సం॥ ఆగష్టు 4వ తేదీని ప్రకటింపబడిన మొదటి ప్రపంచయుద్ధములో విశేషముగ భారతీయులు పాల్గొని యున్నారు. 1919 సం॥రముతో యుద్ధము విజయవంతముగ

ముగిసినది. కాని యిందుకు ప్రతిఫలమే జలియన్‌వాలాబాగు హత్యలు. లాహోరునకు సు॥ప్పదియారుమైళ్ళ దూరములో నున్న అమృతసరములో “జలియన్‌వాలాబాగు” అనునది యొక్క ఆరామప్రదేశము - ఈఆరామములో ప్రవేశించుట కొక్కటే మార్గము కలదు. పోవుటకు వేరుదారి లేదు. లోనికి పోవుమార్గమునుండియే వెలుపలకు రావలెను. ఈఅమృతసరము శిక్కులకు పుణ్యభూమి. కత్తులు కటార్లు మొదలగు నినుపసరుకులు తయారుచేయుటే యక్కడివారిపని. ఊరంతయు నిరుకుసందులు. వీధివెంబడి బండిపోవుచో బాటలోని జనము అరుగులెక్కి తప్పుకొనవలసినదే. ఇట్టియిరుకుసందులు గల యీగ్రామములో రాజవీధి కొకప్రక్కగ ‘జలియన్‌వాలాబాగు’ కలదు. ఈతోట సుమారు 3 లేక 4 యెకరముల భూమి. గ్రామమధ్యమం దీతోట యుండుటచే గ్రామస్థులు పెక్కండ్రీతోటలో వాహ్యాళికై వత్తురు. అక్కడ బహిరంగ సభలు జరుగును. ఇది పెక్కుసంవత్సరముల నుండియు బహిరంగసభ లొనర్చుకొనుటకు తగిన తావుగ గ్రామస్థులచే నెన్నుకొనబడినది.

ఈఅమృతసరగ్రామముగల రాష్ట్రము పంజాబు. దీనికి సర్. మైకేల్ ఓడ్వాయరు గవర్నరుగా నుండెడివాడు. ఈతడు బహుక్రూరుడు. హైందవులను పట్టిపురుగులక్రింద చూచెడి

స్వభావము కలవాడు. వీనివద్ద సైన్యాధికారి జెనరల్ డయ్యర్. వీనిలో మానవస్వభావముమాత్రము లేదు. మూర్తీభవించిన పశుత్వము-కాదు కాదు పశువునకైన జ్ఞానమున్నది. విశ్వాస మున్నది. పురాణయుగమునకు పూర్వమందున్న మహిషా సుని కలియుగావతారము. అట్టి డయ్యర్ పంజాబుప్రజలను చిత్రవధ చేయించినాడు. జలియన్ వాలాబాగునకు ద్వారముకడ తనమరఫిరంగుల నమర్చినాడు. జనము చెదరిపోకుండ సైనికుల కావలిపెట్టినాడు.

ప్రజలందరు బహిరంగ సభలో పాల్గొని యుప న్యాసముల వినుచున్నారు. ఆసభలో స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, పదువేల్గువందలమంది వచ్చి పాల్గొను చుండిరి. అంతయు నిశ్శబ్దము. ఇంతలో గుమ్మముకడ ధ్వని. ఎవ్వడో ద్వారమువద్ద కాగితమును చేబట్టి చదువుచున్నట్లు పొడగట్టినాడు. కాని యెవ్వరికిని అది వినిపించలేదు. ఇంతలో మరఫిరంగి ప్రేలినది. వేలాది గుండ్లవర్షము కురిసినది. హాహా రావములతో ముందువంక్తిలోనివారు పడిరి. వీరివెనుకవారు కదలిరి. తిరిగి గుండ్లవర్షము. స్త్రీలుకూలిరి. పిల్లలఆర్తారవములు చెలరేగినవి. తిరిగి గుండ్లవర్షము. సభలో కలరవము బయలు దేరినది. భార్యలకై, సోదరీమణులకై మాతృమూర్తులకై పురు షులు వెదుకజొచ్చిరి. పిల్లల నంరక్షించుకొనన కదలిరి కొందరు. కాని తిరిగి గుండ్లవర్షము. వృద్ధులు హార! హారా!! యని నేల

కొరిగిరి. ఇంతలో సభావేదిక పై నున్నవారు దిగిరి. అటునిటు జనము పరుగిడ జొచ్చిరి. తిరిగి గుండ్లవర్షము. కాళ్ళపై-చేతులపై-కడుపులలో వెన్నులపై- గుండ్లు తగిలి యొఱిగినవారే. చంటిపిల్లల గుండెల కదుముకొనియు వారితోగూడ నేల కొరిగినవారే. మాతృమూర్తుల సంరక్షించుకొనబోయి వారికంటె ముందు మరణించినవారే. సంరక్షింపబోయిన ప్రియసీబాహువల్లరులలో శవమై పడిపోయినవారే. ప్రేతభూమి-స్మశానవాటికయైనది. నాటిజలియన్‌వాలాబాగు బ్రతికియున్నవారి హాహాకారావములు మిన్ను ముట్టుచున్నవి. మరఫిరంగులధ్వనులు మారుమ్రోగుచున్నవి. అంతయు ఆక్రందనధ్వనియే. ప్రత్యక్షనరకము. మృత్యుదేవత తాండవించినది. శివుని ప్రళయతాండవము ప్రారంభమైనది. రక్తము వరదలు గట్టినది. మానవకళేబరములు గుట్టలు మిట్టలుగ క్రిందపడినవి. "భారతావని కీనాటితో బానిసతన మంతరించినది." అని దివంగతులైన జాతీయనాయకులు స్వర్గపథమునుండి యైక్యకంఠముగ బల్కిరి. సభ కరుదెంచిన పదునాల్గువందలమందిలో పండ్రెండువందలమంది యాక్షణములో మరణించిరి. మిగిలినవారికి దేహములనిండ గాయములు. ఇట్టిసమయములోగూడ గ్రామస్థులు తోటలోనికిగాని, తోటలోనివారు వెలుపలకుగాని పోవుటకు సైనికులు సావకాశ మీయలేదు. గ్రామములో నేమి దౌర్జన్యములు

జరుగుచున్నవో యని తోటలోనివారికి భయము, తోటలో నెందరు మరణించిరో వారెవ్వరో యని వెలుపలివారికి భయము. మొత్తముమీద గ్రామమంతయు నట్టుడికిన ట్లుడక జొచ్చినది.

పండ్రెండువందలశవముల నొక్కమారు చూచినాడు డయ్యర్ — వికటాట్టహాసమును చేసినాడు. మీరు మాకు యుద్ధసమయమున జేసిన సహాయ్యమునకు ప్రతిఫల మిదియే యని క్రియారూపమున ప్రజలను హెచ్చరించినాడు. బ్రిటిషు ప్రభుత్వపురాజనీతి యిదియేయని దేశీయులకు గుణపాఠమును చెప్పగలిగినాడు. ఈరాజనీతిని ప్రజలకు క్రియారూపమున బోధించుటచే నాతనికి ప్రభువులు వేలాదిగ వెచ్చించి వజ్రస్థగితమైన ఖడ్గమును బహూకరించిరి.

"ఓడ్వాయరుగారి నిరంకుశత్వము హరతాళముతో ఫలించినది. పంజాబునకు గాంధీమహాత్ముని యాగమనము నిరోధింపబడినది. కిచిలు, సత్యపాలుగార్లు నిర్బంధప్రవాసమునం దుంచబడిరి. ప్రజలు చెలరేగి అమృతసరము మొదలగు ప్రదేశములందు దౌర్జన్యకార్యముల జేసిరి. ప్రజలహృదయవీర్యమును నిర్మూలము చేయుటకై ఓడ్వాయరు పంజాబునందు చండశాసనమును ప్రయోగించెను. డయ్యరు, జాన్సను, ఓబ్రీను, లాన్వతుస్మిత్తు, శ్రీరామునురుమాలికునా హెంబుఖాను

గారలు చండశాసనము నవమానకరముగ నుపయోగించిరి. హంటరుకమిటీయెదుట వారిచ్చిన సాక్ష్యములమే వారిని దోషులను జేయుచున్నది. జలియన్ వాలాబాగునందు నిరాయుధులు నిరపరాధులు 1200 మంది గుండ్లవాతబడిరి. చండశాసనులు విధించిన కొరడాదెబ్బలు, ప్రాకెడిశిక్ష, నిర్బంధములు ధర్మవిరుద్ధములని యంగీకరింపవలయును. గుజ్రనువాలాయందు నిరపరాధులమీాద విమానములనుండి బాంబులు వేయబడినవి. ప్రజలనుండి దండనద్రవ్యము వసూలు చేయబడినది.

♦ ♦ ♦ ♦ ♦

గాంధీదాసు, తయ్యాబ్జీ, జయకరుగార్లు నివేదికను సిద్ధము చేసిరి.

♦ ♦ ♦ ♦ ♦

పంజాబునందు తిరుగుబాటు లేదని నిర్ణయింపబడినది. చండశాసనమును ప్రయోగించుట కవసరము లేదనియు చండశాసన మనవసరసమయమునందు చిరకాల ముపయోగింపబడినదనియును తీర్మానింపబడినది.” అని ఉగాదిసంచికలో పంజాబుదురంతములగూర్చి వ్రాయబడినది.

ఇట్టి పంజాబుదురంతములకు చేయూత నొసంగినది రౌలట్టుచట్టము. ఈచట్టమును పురస్కరించుకొనియే ప్రభుత్వ

మిట్టిదారుణములగావించినది. పంజాబుమారణకాండములు, కిలాఫత్ వలన జరిగిన అన్యాయములకు గాంధీమహాత్ముడు సత్యాగ్రహోద్యమమును బయలుదేరదీసెను. ఆంధ్రదేశమునందుగూడ కాంగ్రెస్సుఉద్యమము వృద్ధిజెందెను. గాంధీమహాత్ముని తొలి పిలుపునకు మొదట సమాధాన మిచ్చినవాడు ప్రకాశం. ఆనాటికి 6 లేక 7 లక్షలరూపాయిల ఆస్తి కధికారి ప్రకాశమని లోకప్రతీతి. అప్పటినుండియు ప్రకాశము నిర్మలమైన దేశభక్తుడై మహాత్యాగస్వరూపముగ వర్ధిల్లి యాంధ్రదేశములో నధినాయకుడై ప్రకాశించినాడు. ఈసంస్థయే సీతనిజీవితమునకు మార్పు తీసికొనివచ్చినది. మహదైశ్వర్యసంపన్నుని — మార్చివైచినది. సంసక్తుని — విరక్తుని చేసినది. సంసారిని — సన్యాసిని చేసినది. కర్మవీరుడై కార్యరంగములోనికి దూకినాడు ప్రకాశము. బారిష్టరుగ పొందినగౌరవముకంటె రాజకీయవేత్తగ — మహాత్యాగిగ — నాయకునిగ పొందిన గౌరవము వేయిరెట్లు మిన్నయైనది. ఈరాజకీయజీవితమే ప్రకాశమునకు లేనిచో పన్యాయాధికారిగనో మారి న్యాయవాదులు చేయు వాదములనుబట్టి చట్టములను ప్రమాణముగ తీసికొని సాపరాధుల నిరపరాధులగనో — నిరపరాధుల సాపరాధులగనో జేసి న్యాయాన్యాయవిచక్షణాపేక్షితుడై ధర్మాధర్మములకు బాధ్యుడై సుఖదుఃఖములకు లోనయి యుండెడివాడు. కాని యీా

యుద్యమ మాతనిదృక్పథమునుమార్చివైచినది. సత్యజీవనము-త్యాగబుద్ధి – జీవితాశయములుగ బెట్టుకొని సుఖైకజీవనమును గలిగి ప్రజానీకమునకు నాయకుడై విరాజిల్లినాడు. ఈ యుద్యమము ఒక్కప్రకాశమునే గాదు – వేలాదిగ – లక్షలాదిగ ప్రజల దృక్పథముల మార్చినది. బిల్వమంగళునివలె; వాల్మీకునిరీతి సత్యాగ్రహోద్యమసంస్థవలన మార్పుజెందిన వ్యక్తులొక్క ఆంధ్రదేశముననేగాక యావద్భారతావనియందును గలరు. ప్రజలదృక్పథములనేగాక, జీవితములను, జీవితాశయములను మార్పు తీసికొనిరాగలిగినది సత్యాగ్రహోద్యమ మొక్కటే. అట్టి యీసత్యాగ్రహానంరంభమునకు ముందే ప్రకాశము మహానందిలోని యాంధ్రమహాసభ కధ్యక్షుడై మహాసభను దిగ్విజయముగ నడిపించినాడు.

## ఆంధ్రరాష్ట్రసమస్య 1920 సం॥రం (నందిగామ) మహానంది మహాసభ

ఈసభకు శ్రీప్రకాశంపంతు లధ్యక్షత వహించాడు. శ్రీ మోచర్ల రామచంద్రరావు, ఆమంచర్ల కృష్ణారావు, డాక్టరు పట్టాభి ప్రభృతులు సభ నలంకరించిరి. ఆసభాతీర్మానములు గమనార్హములు. కావున వాని నీక్రింద బొందుపఱచుచున్నాను.

"(1) హిందూ దేశము సంపూర్ణ బాధ్యతాయుతపరిపాల నముసకు ఇదివరకే తగియున్నదని యీసభవా రభిప్రాయపడు చున్నారు. అట్లు తగియుండ లేదని మొప రెక్కడ చెప్పినను అట్టి అపోహాలను ఈసభవారు ఖండించుచున్నారు.

(2) నూతనసంస్కరణపుచట్టము అపర్యాప్తముగను అసంతృప్తికరముగను ఆశాభంగకరముగను నున్నదని యీ సభవా రభిప్రాయపడుచున్నారు.

(3) స్వయంనిర్ణయసూత్రమున కనుగుణముగా హిందూ దేశము లో సంపూర్ణ బాధ్యతాయుతపరిపాలనము స్థాపించుటకు ప్రయత్నములు వెంటనే సలుపవలెనని బ్రిటీషుపార్లమెంటు వారిని ఈసభవారు కోరుచున్నారు.

ఈలోపుగ అట్టిసంపూర్ణ బాధ్యతాయుత పరిపాలనము త్వరలో లభించునటుల సంస్కరణముల నాచరణలోనికి తెచ్చు టకై ఆంధ్రులు సాధ్యమైనంతవఱకు తోడ్పడి పనిచేయవలయు ననియును అవసరమైనపుడు ప్రతిష్ఠంభనతంత్ర మవలంబింప వలయుననియును యీసభవా రుద్బోధించుచున్నారు."

ఈయాంధ్రరాష్ట్రీయమహాసభ యామోదించిన రా జ్యాంగసంస్కరణతీర్మానము జాతీయమహాసభాతీర్మానమునకు ముందంజ వేయుచున్నది గాని వెనుకంజ వేయుట లేదు. ప్రకా శంపంతులు భాషాప్రయుక్తరాష్ట్రవిభజనసూత్రమున కంగీక

రించి, తనమహాసభయందు తీర్మానరూపమున ప్రవేశపెట్టి సర్వజనాంగీకారమును పడసెను. ఈభాషాప్రయుక్తరాష్ట్ర తీర్మానమునుగూర్చి అనంతపురమున జరిగిన యాంధ్రమహాసభకు శ్రీ అయ్యంచర్ల కృష్ణారావుపంతులుగారు అధ్యక్షులుగ నుండిరి. ఆసభలో నీక్రిందితీర్మానము నేకగ్రీవముగ నంగీకరించిరి.

"ఇప్పుడు ప్రభుత్వమువారు ప్రవేశపెట్టబోవురాజ్యాంగ సంస్కరణప్రణాళికలో నిమిడియున్న బాధ్యతాయుతమగు పరిపాలన సాఫల్యముగ నుండుటకును, అట్టిబాధ్యతను ప్రజలు చక్కగ నిర్వహించుటకును ఇండియాలో రాష్ట్రములు భాషాప్రయుక్తముగ విభజనచేయుట ఆవశ్యకము కావునను అట్టివిభాగముయొక్క విభజనము మాంటుఫర్డు సంస్కరణనివేదికయందును, ఇప్పుడు పార్లమెంటునెదుట నున్న ఇండియాప్రభుత్వశాసనములోను అంగీకరింపబడియున్నది గనుకను మదరాసు రాజధానిలో ఉత్తరమునయున్న 12 జిల్లాలును చెన్నపురియును చేర్చి ఒక్కప్రత్యేక ఆంధ్రరాష్ట్రముగా చేయవలసినదని యీ సభవారు ప్రభుత్వము వారిని కోరుచున్నారు."

ఈఅనంతపురసభలు 1919 సం॥రమున జరిగినవి. ఆనాడే భాషాప్రయుక్తరాష్ట్రమును విభజింపవలసినదనియు, చెన్నపురిని యాంధ్రరాష్ట్రములో చేర్చి ఒక్కప్రత్యేక ఆంధ్ర

రాష్ట్రమును నిర్మాణము చేయవలసినదనియు తీర్మానింపబడి నది. 1919 సం॥రమున అనంతపురములో తీర్మానింపబడి తిరిగి మహానందిలో 1920 సం॥రమున మహాసభ వారిచే నంగీకరింప బడిన యీతీర్మానములోని ముఖ్యపట్టణమునుగూర్చిన విష యము శ్రీబాగుపాక్టులో తద్వ్యతిరేకముగ తీర్మానింపబడినది.

ఇక భాషాప్రయుక్త రాష్ట్రవిషయములో మహానందిలో గూడ యీతీర్మాన మామోదింపబడినది. ఆ తీర్మానము నీక్రింద నిచ్చుచున్నాను. ఈ భాషాప్రయుక్త రాష్ట్ర తీర్మాన మునే డాక్టరుపట్టాభి అఖిలభారతజాతీయ మహాసభ వారిచే నామోదింపజేసెను.

"ఇప్పుడు ప్రభుత్వమువారు నిర్మించిన రాజ్యాంగసం స్కరణశాసనమునకు మూలాధారమగు బాధ్యతాయుతపరి పాలనము సౌష్ఠవముగ నుండుటకును, అట్టిబాధ్యతలను ప్రజలు చక్కగా నిర్వహించుటకును భారత రాష్ట్రములు భాషాప్రయు క్తముగ విభజన చేయుట ఆవశ్యకము గావునను అట్టివిభాగ మున కవకాశము ఆశాసనమునందలి 15 వ శెక్షనులో సూచింపబడినది గావునను చెన్నరాజధానిలో నుత్తరమున నున్న వండ్రింతుమండలములను చెన్నపురితో చేర్చి యొక ప్రత్యేకమైన ఆంధ్రరాష్ట్రముగ చేయవలయు ననియును,

భాషాప్రయుక్త రాష్ట్ర విభజనకై ప్రయత్నములు చేయుచున్న ఉత్కళ, కర్ణాటక, మహారాష్ట్ర, ఘూర్జర,

FREE READING ROOM & LIBRARIES

సింధుదేశముతో సంప్రతించి రాగలజాతీయమహాసభనాటికి అఖిలభారతసభ యొకటి సమావేశము గావించి దేశీయమహాసభయందు భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణవిషయమును గూర్చిన తీర్మానమును ప్రతిపాదించుటకు ప్రయత్నించవలయు ననియు ఈప్రయత్నమునకు వలయు వ్యయములు స్థాయిసంఘద్రవ్యమునుండి యొసంగవలయుననియును ఈసభవారు తీర్మానించు చున్నారు." అని యొకచక్కని తీర్మానము మహానంది సభలో ప్రవేశపెట్టబడి సకలజనులచే నామోదింపబడినది.

ఈవిధముగా ప్రకాశము మొదటినుండియు నాంధ్ర రాష్ట్రవిషయములో విశేషమైన శ్రద్ధ తీసికొనుచుండెను. ఆంధ్ర రాష్ట్రమును భాషాప్రయుక్తరాష్ట్రముగా కాంగ్రెస్సు ఆమోదించి దేశీయమహాసభలలో ప్రత్యేకప్రాతినిధ్య మిచ్చుచున్నది. కాని ప్రభుత్వము మనమాట నేటివఱకును వినలేదు. శాసన సభలలో కాంగ్రెస్సువారు ప్రవేశించినతరువాత తిరిగి ఆంధ్ర రాష్ట్రప్రశంస వచ్చినది. మనవారు శాసనసభలలో నుండగనే రాష్ట్రము విడిపోవలయునుగాని తదుపరి కృషిసలుపుటకు సావకాశ ముండదని యాలోచించి ఆంధ్రరాష్ట్రతీర్మానమును గూర్చి రాజగోపాలాచారిగారితో తెల్పగా వా రామోదింప లేదు. రాష్ట్రమును విభజించినచో తమిళభూమికి ఆదాయములు, ఉద్యోగములు తగ్గునని యాలోచన లోలోన కల్గి

యున్న దేమో తెలియదుగాని బహిరంగముగ వారు రాష్ట్ర విభజనమున కంగీకరింప లేదు. అందుచే పట్టాభి, కల్లూరి సుబ్బరాయలు, తిరుమలరావు, పళ్ళమరాజు, వెంకటప్పయ్యపంతులు ప్రభృతులు అఖిలభారతకాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారిని సందర్శించి వారితో రాష్ట్రవిషయకప్రశంస చేసిరి.

అప్పుడు కాంగ్రెస్సున కధినాయకుడు శ్రీ సుభాస్ బోసు. ఆంధ్రరాష్ట్రప్రశంసనుగూర్చి బోసుతో తెల్పగానప్పుడు "ఇది చిన్నరాష్ట్రవిషయకప్రశంస; అది నిర్ధారణ సేయుట కిది సమయము కా"దని తెల్పెను. వెంకటప్పయ్యపంతులున కా వాక్యములు క్రోధోద్రేకమును రేకెత్తింప జేసినవి. వల్లభాయిపటేలు పంతులును జూచి "ఎక్కడైతే రెండు భిన్నభాషాప్రయుక్తరాష్ట్రములు కలసి యొకే రాజధానిగ నుండునో అక్కడ యీవివాదము కలుగుట సహజమే" యని తెల్పెను. రాజేంద్రబాబు పటేలుమాట నందుకొని "సుభాసు బాబూ! మొదట వారికష్టముల నెల్ల వినరాదా?" యని తెల్పుచు నొకచక్కని వాక్యమును ముచ్చటించినాడు. ఆంధ్రులు పరిపాలింపబడుచున్నారు. సుభాసుబాబువలెనే మీరును ఆంధ్రుల కష్టనిష్ఠూరము లర్థముచేసుకొన లేకుండ నున్నారు. కారణము మీరు పాలకులు- వారు పాలితులు- బొంబాయి రాష్ట్రములోను, పూర్వపుబంగాళారాష్ట్రములోను, నేటి

మద్రాసు రాష్ట్రములోను కూడా పాలకులు, పాలితులు కలరు. బొంబాయిలో గుజరాతువారు, బెంగాలులో బంగాలీలు, చెన్నపురిలో నరవవారు పాలకులు. బొంబాయిలో మహారాష్ట్రులు, బంగాళాలో బీహారీలు, మద్రాసులో నాంధ్రులు పాలితులు. పాలకులకు పాలితులకు విశేషభేదము లుండితీరును. అవి మీరు వినతగినవి. పాలకుల దేశములో నున్న మీకు పాలితుల బాధలు తెలియనేరవు. కావున మీరు వానిని శ్రద్ధమెయి నాలింపవలెనని తెల్పెను. పట్టాభి రాజేంద్రబాబు చెప్పినవిషయమును సూత్రముగా గ్రహించి ఆంధ్రరాష్ట్రమును భేదించుటకు వలయు కారణములను సహేతుకముగ, సక్రమముగ దెలిపి పరిపాలనా సౌకర్యము లందుటకేగాక దేశీయముగ జాతీయముగ నాంధ్రరాష్ట్రమును విడదీయుదగిన కారణము లన్నిటిని సూచించి వాదించెను.

పట్టాభివాగ్ధోరణిని విని పటేల్ ఆంధ్రరాష్ట్రమునుగూర్చిన తీర్మానమును వ్రాయవలసిన పద్ధతిని నిరూపించి వ్రాయింపించెను. అటుపిమ్మట సంస్కరణవిధానముల సమలులో బెట్టినపిదప వారు ప్రత్యేకాంధ్రరాష్ట్రవిషయకమై తిగినశ్రద్ధ వహింతుమనియు అంతదనుక ఎ. ఐ. సి. సి. అఖిలభారతకాంగ్రెసుసంఘతీర్మానమును గోప్యముగ నుంచవలసినదనియు

తెల్పిరి. పిదప పట్టాభి ప్రకాశంగార్లసలహాలు తీసికొని శ్రీసాంబమూర్తిగారు కళా వెంకటా్రవును ఆంధ్రలెజిస్లేటర్లనంతకములు ప్రత్యేకాంధ్రరాష్ట్రతీర్మానమువిషయములో తీసికొనవలసినదని చెప్పగా కల్లూరి సుబ్బారావు, కళా వెంకటా్రవు, పళ్ళంరాజుగార్లందరినంతకముల దీసికొనినారు. రాజగోపాలాచారిగారికి ఆంధ్రశాసనసభాసభ్యుల యేకగ్రీవాభిప్రాయమైన తీర్మానమును చూపినప్పుడు పాపము రాజగోపాలాచారిగారికి వప్పుకొనక తప్పినది గాదు. ప్రత్యేకాంధ్రరాష్ట్రము పరాధీనత లేకుండ స్వతంత్రముగ నిలువగలదని చెప్పుచు తీర్మానమును శాసనసభలో ప్రవేశపెట్టిరి. ఈతీర్మానానంతర మేమి జరిగినదియు లోకమునకు తెలిసినవిషయమే. 9—1—1940 సం॥ తేదీని యేలూరులో జరిగిన ఆంధ్రరాష్ట్రమహాసభలో రాష్ట్రావశ్యకతగూర్చి ప్రకాశం తిరిగి యుద్ఘాటించినాడు. 1941 లో విశాఖపట్టణములో ప్రకాశం మాట్లాడినధోరణి మీద ఆంధ్రరాష్ట్రతీర్మాన మెగురగొట్టుటకు కారణభూతుడు రాజగోపాలాచారి యని లోకమునకు తెలిసినదిగాని గాంధీగారావిషయమునుగూర్చి ప్రకాశముతో సంప్రదింపగా ప్రకాశము తనకు కారణభూతు లెవరో తెలియదనియు, తాను తన యుపన్యాసములో నెవ్వరిని పేర్కొన లేదనియు తెలియబఱచి

యున్నాడట. అందుచే ప్రకాశమిచ్చిన యువన్యాసభావము లోకమున కంతకు వెల్లడియైనది. గాంధీజీతో జరిగిన వీరిసంభాషణలు రహస్యముగ నుండిపోయినవి. ఆంధ్రదేశమునకు శాశ్వితాపకారమును జేసినవా డెవడో తెలియలేదు గాని వాడు చరిత్రాత్మకపురుషుడై రాష్ట్రాభిమానుల తీవ్రసిరసనమునకు నాగ్రహమునకు గురికాగలడని చెప్పవచ్చును.

## స్వ రా జ్య ప

సత్యాగ్రహోద్యమము ప్రారంభించిన కొలదిమాసము లలో ప్రకాశము స్వరాజ్యపత్రికను బెట్టెను. ప్రకాశంచేసిన మహాకార్యములలో స్వరాజ్యపత్రికాస్థాపన మొకటి. ఇది 23—10—1921 తేదీని చెన్నపురిలోని బ్రాడ్వేవీధిలో నొక విశాలభవనమునందు స్థాపింపబడినది. దీనిని ప్రకటించుటకు శ్రీ కాసా సుబ్బారావుగారు, కోటంరాజు రామారావుగారు, ప్రభృతులు పత్రికాధిపతులుగానుండి పనిచేసిరి. ఈదినపత్రికను స్థాపించుటకు కొన్ని కారణములు కలవు. ప్రకాశంపంతులు అభిప్రాయములు దేశదేశములకు తెలియజేయుట, గాంధీమహాత్ముని యాశయములు సంపూర్ణముగ భాష్యరూపమున లోకమున కందజేయుట మద్రాసులోనున్న హిందూపత్రిక, అర

వలసంస్థయగుటచేతను, అది మితవాది పత్రికయగుటచేతను, సహాయనిరాకరణ వాదమును నిరూపింపగల యాంధ్రసంస్థ వేఱొక్కటి స్థాపించి దేశజుల కుద్బోధింపజేయుట యత్యావసర మని తలంచినాడు. ఈపత్రికాస్థాపన కివియే వీని యాశయములు. అట్టిపత్రిక యాంధ్రమున నాంధ్రపత్రిక రూపమున వెలువడుచుండుటచే నాంధ్రమునగాక నాంగ్లమున నది ప్రకటింపనెంచుట. ఈసంస్థ యొక్కరిసొత్తుగగాక సాధారణపుజనుల యాదరణమున ప్రకటింపనెంచి యాసంస్థ లిమిటెడ్డు సంస్థగా జేసి ప్రజలకందుబాటులోనుంచి పత్రికను ప్రకటింపనెంచుట వీని పత్రికాస్థాపనమునకు ముఖ్యకారణములు. ఈపత్రికాశయములన్నియు నెరవేరినవి. ఈపత్రిక జేగీయమానముగ ప్రకాశించి దేశజులకు సక్రమమైన రాజకీయప్రబోధమును గావించి మహత్తరసేవను జేసినది. తీవ్రమైన రాజకీయములను, నిర్మొగమాటముగ విమర్శించినది. ప్రభుత్వ మొనర్చుచువచ్చిన దోషములను నగ్నరూపమున బహిర్గతము సేయుటకు జంకక, దేశహితైక కార్యములగూర్చి సగర్వముగ ముచ్చటింపుచు నపరిమితమైన ప్రజాసేవ యొనర్చినది. మహాత్ముని మహదాశయము లోకమునకు విప్పిజెప్పి, దేశజు లాయాపరిస్థితులలో నెట్లు ప్రవర్తించు కొనవలెనో యదియెల్ల చక్కగ బోధించినది.

మహాత్ముని సత్యాగ్రహ సైన్యమును నిర్మించుటలో స్వరాజ్యపత్రిక యపార సేవ చేసినది. జాతీయపత్రికా ప్రబోధము లితరరాష్ట్రములోని ప్రజల నక్రమ రాజకీయాందోళనములో పాల్గొనజేసి పనిసేయుటకు సావకాశ మొసగినట్లే స్వరాజ్య పత్రికి గూడ చక్కగ ప్రబోధము గావించి యాంధ్రులను నక్రమ రాజకీయాందోళనమునకు మేల్కొలిపి వారలచే దేశ సేవ చేయించినది. ఇట్టిమహదాశయముల నెరవేర్చుటచే స్వరాజ్యపత్రిక నైతికముగ విజయ మందినది. ఈపత్రిక కధిపతిగ పనిచేసిన మిత్రులు కాసా సుబ్బారావుగారు "Men in the Lime Kight" అను గ్రంథములో ప్రకాశమును గూర్చి వ్రాయుచు నీక్రిందివిధమున స్వరాజ్యపత్రికనుగూర్చి వారియభిప్రాయముల వెలిబుచ్చిరి.

"స్వరాజ్యపత్రికవలె నుద్రితమైన జీవితము కొన్ని పత్రికలకుమాత్రమే కలదు. నాడు ప్రకటింపబోవు పత్రికను జూచుటకై మధ్యాహ్నము మూడుగంటలనుండియు పెద్దజన సమూహము బ్రాడ్వేలో మొదటనున్న మాపత్రికాలయ మును తుపానువలె చుట్టుముట్టెడిది. మొట్టమొదటనుండియు స్వరాజ్యపత్రిక ప్రజాభిమానమును సంపాదించుకొనినది. ఈ పత్రిక విశేషముగ వ్యాప్తినందుట ప్రకటనకర్తలు గుర్తించు కొనక పోలేదు. మూలధనము చాలక పోలేదు. ఇందులకై

పరిశ్రమలోగడ గడించి నిలవచేసికొనిన యావదాస్తియు వ్యయపఱచుటయేగాక దేశస్థులకడనుండియు, విదేశజులకడ నుండియుగూడ వాటాసొమ్ములు (అనగా విరాళములక్రిందనే యని భావించుకొనవచ్చును) విశేషముగ తీసికొనివచ్చి వ్యయ పఱచెను. మంచివాతావరణములో చక్కని శుభావహమైన పరిస్థితులలో స్థాపింపబడిన స్వరాజ్యపత్రిక పతన మందు టనం భవ మనుకొంటిమిగాని పత్రిక పతన మందినది. ఇందులకు కారణము కార్యనిర్వాహకుల (Managers)లో దురదృష్టమైన యెన్నికయే. రావలసినసొమ్మును దమ్మిడీలదగ్గరనుండి వసూలు చేసి జాగ్రత్తగ ఖర్చు పెట్టియున్నచో పత్రిక చక్కగ నడిచె డిది. మంచిలెక్కలలోనారితేరి సమర్థతతో పనిచేయలేని కార్య నిర్వాహకులయాజమాన్యమాటయే కారణము. వచ్చిన ధనము ఖజానాదారునకు జేరకపూర్వమే దారిలో ఖర్చైపోయెడిది. చందాసొమ్ము లేజెంట్లు అపహరించెడివారు. ఇట్టియసందర్భ ములు వచ్చియు పత్రిక నిలువగలిగినంతకాలము జీవించినది.”

శ్రీసుబ్బారావుగారు వ్రాసిన యీవార్త యథార్థమును కనులార చూచి గ్రహించుకొనినదిగాని యూహాప్రపంచము లోనుండి సృష్టించుకొనినది గాదు. ఈపత్రికానిర్వహణమునకై ధనము లభ్యము కానప్పుడెల్ల పరిశ్రమ తనస్వార్జితములైన ఉదకమండలములోని రెండుభవనములు, రాజమహేంద్రవర

ములోని విశాలభవనము, స్వగ్రామమందలి దివ్యభవనము, వంగవోలులోని పెద్దగృహము, తుదకు చెన్నపురిలోని వసతి గృహముకూడ విక్రయించివైచెను. ఆర్జనకాలమున బ్యాంకులో నిలవచేసికొనిన రెండు లక్షలు మొదట ఖర్చైనపిమ్మటనే స్థిరాస్థులపైకి దాడివెడలుట తటస్థించినది. ఇంతాస్థియేగాక, నిలువసొమ్మేగాక చందాలమూలమున వసూలైనమొత్తములు, ప్రకటనములకు వచ్చిన సొమ్ములు, వాటాలధనము, విరాళములు వచ్చిన మూల్యము సర్వము వమ్మైనది.

## కాంగ్రెస్సు - స్వరాజ్యపార్టీ

37 వ జాతీయమహాసభ గయాక్షేత్రమున కూడినప్పుడు నానారాష్ట్రములనుండియు వచ్చిన కాంగ్రెస్సునాయకులలో విదేశవస్తుబహిష్కారవిషయమునను, శాసనసభాప్రవేశ విషయమునను, శాసనోల్లంఘనవిధానవిషయమునను ప్రచండమైన సంరంభము గలిగినది. దేశబంధుదాసు, మోతీలాల్ నెహ్రూ, పటేలుగా రొకపక్షమునను, రాజగోపాలాచారి, వల్లభాయిపటేలు, రాజేంద్రప్రసాద్, అన్సారీగార్లు వేరొకపక్షమునను నిలచి కాంగ్రెస్సును తమతమపక్షములకు త్రిప్పుకొన ప్రయత్నించిరి. నాటికి రాజగోపాలాచారిగారి తీర్మానమే గెల్చినది. శాసనసభాబహిష్కార మామోదింపబడినది. పిమ్మట

స్వరాజ్యపార్టీవారు దేశమంతయు తిరిగి ప్రచారము గావించిరి. 33 వ కాకినాడ కాంగ్రెస్సులో స్వరాజ్యపార్టీవారి ప్రణాళిక మీాద తిరిగి పునర్విమర్శనము వచ్చినది. పిమ్మట బెల్గాములో కొంతవఱకే చర్చ జరిగినది. 1925 వ సం॥రములో నితడు స్వరాజ్యపార్టీసభ్యుడుగా జేరెను. 1926 వ సంవత్సరములో ఢిల్లీ అస్సెంబ్లీపదవికి కాంగ్రెస్సుపక్షమున నిలచెను. వీరికి ప్రతికక్షి సర్ మోచెర్ల రామచంద్రరావు- గొప్పపలుకుబడి గలిగిన యేలూరుపురవాసి. పెక్కువత్సరములనుండి పెద్దపెద్ద పదవుల నధివసించినవాడు. అట్టిమహానుభావుడు ప్రకాశముతో పోటీపడి పదకొండువేల వోట్లతేడాతో నోడిపోయెను. అప్పుడు ప్రకాశము ఎస్సెంబ్లీసభ్యుడుగ రెండుసంవత్సరములుమాత్రమే పనిచేసి 1928 వ సం॥రమున కాంగ్రెస్సుఆదేశానుసారముగ తనపదవికి రాజీనామా నొసంగి వచ్చివేసెను. కాని 1929 వ సం॥రమున దేశములో తిరిగి యెన్నికలు రాగా ప్రకాశ మభ్యర్థిగ నిలచెను. ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్సుసంఘమువారు ప్రకాశ మభ్యర్థిగ నిలచుట కంగీకరింపలేదు. కాని ప్రకాశము సభ్యుడుగా నిలచి జయ మొందెను. 1930 వ సం॥రములో ఉప్పు సత్యాగ్రహోద్యమమును గాంధీమహాత్ముడు లేవదీసినప్పుడు ప్రకాశము తనపదవికి రాజీనిచ్చి సత్యాగ్రహోద్యమములో ప్రవేశించెను. కాంగ్రెస్సులోని స్వరాజ్యపార్టీ అంతతో నంత

మొందెను. పిమ్మట యాపార్టీఆశయమును కాంగ్రెస్సువర్గమంతయు నామోదించుటచే పార్టీగా నిలువలేదు. 1937 వ సం॥రములో కాంగ్రెస్సుసంస్థయే యెన్నికలలో పాల్గొని 1939 వ సం॥రమువఱకు ఆయాసంస్థలలో నిలచి పనిచేసెను. కావున 1937 వ సం॥రపుచర్య వేరే ముచ్చటింతును.

## సైమనుకమీషను

అది 1927 సం॥రము. నాడు ఫిబ్రవరి 3 వ తేదీ. ఢూ, ఢూ. బసవన్నల యూరేగింపు- డోలుబజాయింపులతో- పిల్లనగ్రోవులసంగీతములతో- చేచిరుగంటల వాయిద్యములతో బయలుదేరిరి బసవన్నలు. గుమ్మముగుమ్మముకడ నాగిరి. గ్రామగ్రామములు సంచరించిరి. మండలముల రాష్ట్రముల దాటిరి. వారు పాడిన దొంకతిరుగుడుపాట- వేసిన దొంకతిరుగుడు తాళము- అభిమాను లిచ్చిన పత్రములు- అనాదరణముగ నిచ్చిన ప్రసాదములు స్వీకరించిరి. బొంతలశృంగారమున- వింతగుహొయలొప్పిన బసవన్నలు; గంతలుకట్టగ- గంతులువేసిన బసవన్నలు; సంతసావిళ్ళలో- వింతలు చేసినబసవన్నలు- ఒకరా?- ఇద్దరా? సప్తకము- అశ్లీలద్యోతకసంఖ్య- అరిష్టదాయకసంజ్ఞ; అదే సైమనుసప్తకము! అని యాక్షేపించిరి నాటివివిధరాష్ట్రప్రజలు. వీరిరాకను ప్రజలు నిరసించిరి-ప్రభువు

లాహ్వానించిరి. అఖిలభారతజాతీయనాయకులు రావలదని చెప్పిరి. ప్రభుత్వోన్నతోద్యోగు లాహ్వానపత్రిక లందిచ్చిరి. కాంగ్రెస్సు వలదన్నది. ప్రభుత్వము రమ్మన్నది. అన్యోన్య విరుద్ధాభిప్రాయములు ప్రబలినచోట సంఘర్షణములు సహజ ములుకదా!

ప్రజలనిరసనము హరితాళరూపమును బొందినది. కళా శాలలు మూయించిరి. బజారులు మూయించిరి. ప్రభుత్వము వానిని తెరిపించి సర్వము సవ్యముగ నడిపింపవలెనని బ్రయ త్నించినది. కాని ప్రభుత్వమును ప్రజాశక్తి యెదుర్కొనినది. హరతాళము లన్నిచోటుల చక్కగ సాగినవి. మద్రాసులో కూడ సాగుట ప్రభుత్వమునకు పరాభవప్రదముగ కాన్పించినది. సైనికదళములను గొనితెచ్చి గస్తీ వేసినది. పికెటింగు సాగు చుండుట చూచి ప్రజల భయభ్రాంతుల చేయదలంచి టుపాకుల పేల్చినది. పికెటింగు చేయువారిలో నొక్కడు గుండుదెబ్బ తిని నేలకొరిగినాడు.

కొందఱు భయభ్రాంతులైరి. కొందఱు పలాయితులైరి. మరికొందఱు రచ్చసావిడులలో దూరిరి. ప్రభుత్వము తలచిన కార్యము నిర్విఘ్నముగ సాగినదని సైనికులు సంతసించుచుం డిరి. అట్టిస్థితిలో సైనికుల నాపగలవా రెవ్వరు. గుండుదెబ్బ తిని నేల కొఱిగినవాడు తంబుచెట్టివీధి మొదట నట్లే పడియు

న్నాడు. సైనికులు కావలా కాయుచు నెవ్వరిని దరికి జేర నిచ్చుట లేదు. అంతయు భీభత్సము- భయము మూర్తీభవించి నట్లున్నది. ప్రజలలో సంక్షోభము బయలు దేరినది.

ఇంతలో నొకవ్యక్తి నిర్లక్ష్యముగ ముందునకు చొరుచు కొని పోవుచుండెను. వలదు వలదని ప్రజలు- జాగ్రత్త-జాగ్రత్త యని సైనికులు; ప్రమాదము- ప్రమాదము అని ప్రజలు; ఆగు- ఆగు- అను అధికారియరుపులు; అయ్యో- అయ్యో- అను ఆర్తారావములు; ఫైర్- ఫైర్- అని సైన్యాధికారియాజ్ఞలు. కాని ఆవ్యక్తి యేదియు వినిపించుకొన లేదు. ముందునకు సాగు చునే యుండెను. సైనికుడు ముందు దట్టించెను. టుపాకి నెత్తెను. బుజమున కెత్తుకొనెను. గురిచూడ నారంభించెను. కాని వ్యక్తి ఆగలేదు. వెనుకంజ వేయలేదు. సైనికుని ఆగమని సంజ్ఞయైన చేయలేదు. అది తనపని కాదు. ముందునకు బోయి పడిన శవ మును చూడివచ్చుటే యాతనివని- సిస్సంశయముగ- ధైర్యో త్సాహములతో- ముందునకు బోవుటయే యాతనివని- నిర్ల క్ష్యముగ- మందహాసముతో- ముందునకు బోవుటయే యాతని పని- ఇంతలో సైనికుడు తనతుపాకును పేల్చుటకు నంసిద్ధు డయ్యెను. "అప్పుడు అధికారియాజ్ఞ; వలదు- ఆపు- పేల్చ వలదు" అని. సైనికుడు తిరిగి చూచెను. ఆయాజ్ఞ యిచ్చిన వాడు ప్రధానరాజధానిమేజస్ట్రేటు- Mr. పాండలే- టుపాకి క్రిందకు దింపబడెను. ఆవ్యక్తి యిది యెల్ల గమనించనే లేదు.

తా జేయదలచిన కార్యమును చేసి తీరినాడు. ఆతడే అభినివేశి-ప్రకాశం—

ఆనాడు ప్రకాశము చేసినసాహసమునకే యావదాంధ్రము జోహారు లిచ్చినది. ఆంధ్రవీరకుమారుడని యాశీర్వదించిరి పెద్దలు—

ఆతనియభినివేశ మాంధ్రులలో నెవ్వరికిని లే దనిపించినది. అప్పటి కప్పుడే కొండా వేంకటప్పయ్య ప్రభృతులను మద్రాసులో నరెస్టు చేసిరి. ప్రకాశ మిట్టి సాహసమున కొడిగట్టునని ప్రభుత్వము తలంపలేదు. ప్రజ లనుకొనలేదు. అందుచే ప్రకాశమును ముందుగనే అరెస్టు చేయలేదు. అంతయు మించుటచే తరువాతగూడ నరెస్టు చేయలేదు.

ఢిల్లీలోని సెంట్రల్ అస్సెంబ్లీకి 1929 సం॥లో తిరిగి ప్రకాశము నిలువదలచినాడు. రాష్ట్రములోని కాంగ్రెస్సునంఘము రాబోవు సత్యాగ్రహోద్యమమును గుర్తించుకొని ప్రకాశమును అస్సెంబ్లీకి నిలువవలదని తనయసమ్మతిని చూపించినదట. కాని ప్రకాశమున కది నచ్చలేదు. శాసనసభాస్థానమునకు నిలచి విజయ మందినాడు. అంతమాత్రముచే నతనిని కాంగ్రెస్సునకు వ్యతిరేకి యని చెప్పుటకు సావకాశము లేదు. 1930 లో గాంధీమహాత్ముడు సత్యాగ్రహసమరమునకు సింహనాదమును గావించినాడు. దండీయాత్రను సంకల్పించినాడు. ప్రకాశ మాసింహనాదమును విని యందలియాంతరంగికప్రబో

ధమును గుర్తించి వెంటనే శాసనసభాస్థానమును వదలి తిన్నగ చెన్నపురికి వచ్చి సత్యాగ్రహోద్యమములో పాల్గొనినాడు. సముద్రపుటొడ్డున శాసనధిక్కారమును గావించినాడు. ప్రభుత్వ మీతనిని బట్టుకొనినది. కారాగారవాసశిక్ష విధించినది. ప్రకాశమును పెనిటెన్షియరీ (మద్రాసులోని పెద్దచెరసాల) లో పెట్టిరి.

అక్కడనుండి ప్రకాశము రాయవెల్లూరు చెరసాలకు పంపబడినాడు. ఆచెరలో నుండగ కృష్ణాష్టమినాడు పెద్దయుత్సవము బి. క్లాసుజెయిలులో జరుపబడినది. ప్రకాశము ఎ. క్లాసు ఖైదీగ వచ్చినవాడు నాడు పండుగకావున బి. క్లాసు చెరలోనిమిత్రులను జూడ వచ్చి వినోదమును జూచుచు నిలచినాడు. ఇంతలో జెయిలరు లోనికి వచ్చినాడు. ఖైదీల కోలాహలమును చూచినాడు. ఇది యేమియని దగ్గరనున్నవారిని ప్రశ్నించినాడు. "నేడు పండుగ. ఖైదీలు వినోదమును కల్పించుకొని యుల్లాసముతో నున్నారు." అని సమాధానము. "అయితే యిది చెరయని యెఱుగరా?" అని అధికారిప్రశ్న. "అయితే నేమి" యని సమాధానము. "అట్లనా" అని అధికారి వెడలి పోయెను. అధికారి వేసిన యీప్రశ్నలకు సమాధాన మిచ్చిన వారు ప్రకాశం, వి. యల్. శాస్త్రిగార్లు ఆమరుచటిసాయంకాలమే యుభయులు రాయవెల్లూరుజెయిలునుండి కన్ననూరు మార్చబడిరి. శిక్షానంతర మిచ్చటనుండియే విడుదలయైనాడు.

1932 సం॥రమున తిరిగి సత్యాగ్రహోద్యమము ప్రారంభింపబడినప్పుడు ప్రకాశము రెండవసారిజెరలో పెట్టబడెను. ఈసారి కడలూరు జెయిలులోను రాయవెల్లూరుజెయిలులోను శిక్షాకాల మంతయు గడపి విడుదలయైనపిదప ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్సు సంఘమునకు అధ్యక్షుడుగ నుండి యపారసేవ జేసెను. 1935 సం॥ ఇండియాయాక్టు ననుసరించి 1937 సం॥ర ములో హిందూదేశమునం దంతటను యెన్నికలు జరిగినవి. ప్రకాశముకూడ యెన్నికలలో పాల్గొనెను.

1937 లో మద్రాసు పట్టణమున దక్షిణమధ్యభాగమున పట్టణ సాధారణస్థానమున కభ్యర్థిగ నిలచినాడు. ఆ యెన్నికలో ప్రకాశమునకు 6450 వోట్లు వచ్చినవి. ఇతని ప్రత్యర్థి టి. ఆర్. కోదండరామ మొదలియారు. ఇతనికి 2046 వోట్లు మాత్రమే వచ్చినవి. రెండువోట్లు యెవరికిని పనికిరాని వైనవి. అందుచే ప్రకాశము దిగ్విజయమును బొందెను.

ఈ యెన్నికల సందర్భమున నొక్కమాట చెప్పవలసి యున్నది. కాంగ్రెస్సుపక్షమున నిలచిన నాయకు లందరీయె న్నికలలో విజయమందిరి. ఇద్దరుతప్ప.1. గొట్టిపాటి బ్రహ్మయ్య. 2. కొవ్వాలి గోపాలరావు. వీరిరువ్వురుమాత్ర మపజయ మందిరి. సాధారణస్థానములకు నిలచిన కాంగ్రెస్సునాయకు లందఱు విజయ మొందుటకు ప్రకాశము కారణభూతుడు. ఈయనకు

సాంబమూర్తిగారు వేదోడు వాదోడుగనుండి సాయ మొన ర్చిరి. అందుచే కాంగ్రెస్సున కపారవిజయము లభించినది.

కాని ప్రకాశ మింతవిజయము కాంగ్రెస్సునకు సమ కూర్చినను ఎసెంబ్లీవర్గము ప్రకాశముగారిని నాయకునిగ నిలు పక రాజగోపాలాచారిని నిలబెట్టెను. ఇందులకు కారణము కాళేశ్వరరావుజీవితమును వ్రాయుచు తెలియబఱచితిని. అం దుచే ప్రకాశము ఆర్థికమంత్రిగా నెన్నుకొనబడెను. తనయ పారవిజ్ఞానమును ప్రదర్శించుచు చక్కగ కార్యముల నిర్వహిం పుచు ప్రకాశము పరిపాలించెను.

ఈ సమయముననే ప్రకాశము జమీందారీ పన్నుల నవరణబిల్లును తయారుచేయుటకై యొక్క యుపసంఘము నేర్పాటు చేయించెను. విశేషపరిశ్రమ చేసిన యీయుపసం ఘము మండలములన్నియు తిరిగి, సాక్ష్యముల నంపాదించి, రిపోర్టును పూర్తి చేసెను.

ఈసాక్ష్యములు పూర్తియైనపిమ్మట శ్రీ పిఠాపురం, వేంకటగిరి, బొబ్బిలి వగైరా మహారాజులు, జమీందారులు కొందఱు వల్లభాయిపటేలువద్దకు Deputation వెళ్ళిరట. ఈజమీందారీబిల్లుతో సంస్థానములకు న్యాయము చేయించ వలసినదని కోరగా పటేలు ప్రకాశమునకు "సీరిపోర్టును పం పించవలసిన" దని వ్రాసెనట. ఆజాబునకు సమాధానము

వ్రాయుటకు కొంచె మాలస్యమైనదట. అంతలో యుద్ధప్రక
టనమూలమున తమతమ పదవులకు కాంగ్రెస్సుపక్షమువారు
రాజీనామా లిచ్చివచ్చివేయుటచేత జమీందారీ రిపోర్టును
Bill గా Pass చేయుటకు సావకాశము లేకపోయినది. ఈ
సారియైన ప్రకాశము తానుతలపెట్టిన జమీందారీ పన్నుల
సవరణచట్టమును శాసనముగా చేయుగలందుల కాంధ్రులు
కోరుచున్నారు.

1939 సం॥రమున ఎస్సంబ్లీలు, కౌన్సిలున్ను పదవుల విర
మించుకొని కాంగ్రెస్సువారు బయటకు వచ్చివేసిరి. ఈరాజ
కీయప్రతిష్టంభనమువలన ఎస్సంబ్లీలలో జరుగవలసిన పనులు
ఆర్డినెన్సులద్వారా జరిపించబూనిరి. కాంగ్రెస్సుసంస్థలు తిరిగి
తీవ్రముగ పనిచేయ ప్రారంభించినవి. గాంధీమహాత్ముడు వ్యక్తి
సత్యాగ్రహము నమలులో బెట్టెను. ప్రకాశము తిరిగి శాస
నోల్లంఘనము చేసెను. ప్రభుత్వము ప్రకాశమును పట్టుకొని
బంధించెను. తిరుచునాపల్లి చెరలో శిక్షాకాలము పూర్తి చేసు
కొని వచ్చెను. తిరిగి 1942 సం॥ ఆగష్టుమాసములో గాంధీ
బొంబాయిలో సత్యాగ్రహోద్యమ శంఖారావమును పూరిం
చెను. నాయకు లందరిని ప్రభుత్వము పట్టుకొని బంధించెను.
ప్రకాశమునుకూడ చెరలో బెట్టిరి. ఈసారి మధ్యపరగణాల
లోని అమరావతీజెయిలులోను, పిదప రాయివెల్లూరు చెరలోను

డెటిన్యూగా పెట్టబడెను. 1945 సం॥రము:లో జూలై రెండవ వారమున చెరనుండి విముక్తు డయ్యెను.

ప్రకాశము చెరలోనుండి విడుదలయైన పిమ్మట 16-8-45 తేదీని రాజమహేంద్రవరము వచ్చినాడు. పదివేలమంది ప్రజలు ప్రకాశమునకు స్వాగత మిచ్చినారు. సాయంకాలము బ్రహ్మాం డమగు మహాసభ జరిగినది. అందు ప్రకాశ మి ట్లుపన్యసించినాడు.

"గత మూడు సం॥రములనుండియు జెయిలులోనుండి యెక్కువ బాధలు పడినామని కొందఱు చెప్పియున్నారు. కాని నేను బాధ పడలేదు. నేను ఆరోగ్యంగా నున్నాను. నేను జెయిలులో నున్న సమయములో నాచిన్నతనములో నేర్చుకోవలసిన సంగతులన్నీ నేర్చుకొన్నాను. నావయస్సుయొక్క భారం నాశరీరంమీద లేదు. నేను తెన్నేటి విశ్వనాథం సంస్కృతం నేర్చుకొన్నాం. భగవద్గీతమీద కొంత వ్యాఖ్యానం వ్రాశాను. అందులో ప్రమాదాలు వున్నాయి. అందుచేత దానిని ప్రకటించలేదు. శంకరభాష్యం చదివాను. దానికి తాత్పర్యం తెనుగులో వ్రాశాను. నా 80 సం॥రముల జీవిత చరిత్రలోని విషయాలు క్రోడీకరించి వ్రాశాను. ఇటువంటి కార్యక్రమం చేసి కాలక్షేపం చేయుడానికి సావకాశం దొరికింది. నేను వ్రాసిన గ్రంథాలు Notes గా వ్రాశాను.

జగత్సృష్టికి మూలకారణము త్రిగుణము లు. సత్వము, రజస్సు, తమోగుణములే యీసృష్టికి మూలకారణములు. ఈపరమార్ధరహస్యము శంకరభాష్యములోను ఉపనిషత్తుల లోను, వేదాలలోను మహాత్ములు వ్రాసియున్నారు. శంకరుడు గుణమును Energy శక్తియని భాష్యము చేసినాడు.” అని ప్రకాశ ముపన్యసించి తనయాస్తికబుద్ధిని వెల్లడించుకొనినాడు. Russian Communism అంటే తన కిష్టంలేదని విస్పష్ట ముగ వక్కాణించినాడు. గ్రామములు కట్టడములో అంతా కలిసి కట్టవలెననియు ఒకనికి 100 యకరములుండిన ఆభూమి పంచుకోవలెననియూ, నివి అన్ని జాతులవారికి సమానముగా పంచవలెననియు, ఇది పూర్వకాలములోనుండియూ వచ్చిన పద్ధతియనియు చెప్పుచూ అరవ దేశములో Ellections మీద Votes ని గూర్చి శాసనములు వ్రాయబడి వున్నా యనియు చెప్పియున్నారు.

“నేను Russian Communist ని కాను. నా కా సిద్ధాంతాలు పనికిరావు. కాంగ్రెస్సుసంస్థను యెవరు పడకొట్టా లని ప్రయత్నం చేసినా నేను అంగీకరించను. Communism అంటే సామాన్యప్రజలందరికి కూడూ గుడ్డా వుండాలి. అదే Communism అంతేగాని మరేది Communism కాదు” అని చెప్పుచు “గ్రామాల్లో, పట్టణాలలో, జిల్లాలలో,

Budget లు Pass చేయాలి. అందరికీ కూడాగుడ్డా వుండే టట్లు అన్నిగ్రామాల్లోను Budget వేసి Pass చేయాలి. అప్పుడే దేశంలో అందరికీ కూడూగుడ్డ వుంటుంది. ఆలాంటి Communism కావాలి. Russiah Communism నాకు అక్కరలేదు" అనికూడా ప్రకాశ ముపన్యసించి యున్నాడు.

Communism విషయములో ప్రకాశము చెప్పిన విషయములు వ్రాసియున్నాను. ఇక వానిజీవితాశయములు ముఖ్యమైనవి రెండు కలవు. వానినిగూర్చి కొలదిగ వ్రాయు దును.

1. గ్రామపంచాయితీలు—గ్రామగ్రామమందలి సర్వ విధవ్యాపారములు, గ్రామపంచాయితీలవలన జరుపబడవలె ననియు, నేరములు, వ్యాజ్యములు మొదలగు కోర్టువ్యాపార ములుకూడ పంచాయితీలమూలమున పరిష్కరింప బడవలె ననియు, గ్రామశుభ్యము, ఆరోగ్యము, వైద్యాలయములు, పంచాయితీదారుల యధికారములకు లోబడి యుండవలెననియు, ప్రతిగ్రామమునకు పుష్కలముగ మంచితీర్థము, చక్కని బాటలు మొదలగునవిగూడ పంచాయితీ పరిపాలనలో నుండ దగినవనియు ప్రకాశము తలంచుటయేగాక అది సాధించుటే యాతనిజీవితాశయముగ నెంచుచుండెడివాడు.

2. వస్తువినిమయము—Barter System క్రయ విక్రయములకు ధనము ప్రధానము కాకుండ నుండవలెనను తలంపుతో వస్తువినిమయము అనగా వస్తువు నిచ్చి వేరొకవస్తువును గ్రహించుపద్ధతియే ముఖ్యమైనదనియు, అట్లు చేయుటచే గ్రామస్థులకు ధన మప్రధానమై ధరవరలతో నిమిత్తము లేకుండ కాలక్షేపము చేయవచ్చునని యు ప్రకాశము తలంచును. ఇది సాధించుటయే రెండవ జీవితాశయముగ నీతడు పెట్టుకొనినాడు.

## ఆ ద ర్శ గ్రా మ ము లు.

కితడు గ్రామములన్నియు స్వయంపోషకములుగనుండవలెననియు, ఆదర్శనీయములుగ నుండవలెననియు, నెంచి యేలూరుతాలూకా " జోగన్నపాలెం " అను గ్రామమును తయ్యారు చేయుచూనినాడు. అది యెంతవఱకు కొనసాగినదో విశేషముగ వ్రాయనక్కరలేదు. ఆయన ప్రయత్నమును (Experiment) చేసి చూచినాడు. సరియైన ఫలితము వచ్చినదని తలంచినాడు—

ది 19-12-45; 20-12-45 తేదీలలో రాజమహేంద్రవరములో ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్సు కార్యనిర్వాహకవర్గసమా

వేశము జరిగినది. ఇందు లోగడ బెజవాడలో నేర్పాటు గావిం చిన పార్లమెంటరీ బోర్డును మరికొంతటి సభ్యులజేర్చి పెద్దది జేయుటా! లేక అట్లే యుంచుటా! అను ప్రశ్నము వచ్చినది. ప్రకాశము పార్లమెంటరీబోర్డు పెంచవలెనని పట్టుబట్టెను. తది తరులు వలదని వాదించిరి. ఈ వివాదము రెండుదినములు పట్టినది. ది 20—12—45 తేదీని సాయంకాలమున ఆంధ్ర రాష్ట్రకాంగ్రెసు కమిటీ సమావేశమైనది. అందులో రంగా గారొక ఎమెండుమెంటును ఉపపాదించిరి. బెజవాడలో నేర్పాటు కావింపబడిన సభ్యులుగాక మిగిలిన ప్రతిమండలము నుండియు నొక్కొక్క సభ్యుని పార్లమెంటరీ బోర్డులోనికి యెన్నకొనవలెనను ఉపపాదనము. ఈ ఉపపాదనమునకే ప్రకా శము కార్యవర్గ సమావేశములో పోట్లాడెను. కాని కార్య వర్గములో నోడిపోయినట్లే యీరాష్ట్రకాంగ్రెస్సుకమిటీలో కూడ నోడిపోయెను. రమారమి 81 వోట్లు రంగాగారి ఉప పాదనమునకును రమారమి 96 వోట్లు వర్కింగుకమిటీ వారి తీర్మానమునకును వచ్చినవి. దీనితో ప్రకాశము తలచిన కార్యము విఘ్నమైనది. కాని ప్రకాశము నిరుత్సాహికాలేదు. నేను నిరుత్సాహినికానని ఆతడుసభలో విస్పష్టముగ తెల్పెను.

ఆ తలో రెండవతీర్మానమును శ్రీ గోపాలరెడ్డిగారు తీసికొనివచ్చిరి. అది ప్రకాశముపై విశ్వాసతీర్మానము. తిరు

మలరావు ప్రభృతులు మాట్లాడిరి విశ్వాసతీర్మాన మూమో దింపబడినది. ప్రజలు సంతోషించిరి.

ఇచ్చటనే ఒక్క విశేషమున్నది. ఆంధ్రులలో విశేషించి రాష్ట్రకాంగ్రెస్సు వర్గములో ప్రకాశముమీద కల విశ్వాస అవిశ్వాసములు త్వరలోనే ఋజువు కానున్నవి. గత 1937 సం॥రపు ఎన్నికలలో జరిగిన కుంభకోణపు తిరుమంత్రోపదేశ మాంధ్రులు మఱచిరో లేక తన్మంత్రదీక్షితులై పాతపాటనే పాడుదురో చూడవలసిన సమయ మాసన్నమైనది.

విశ్వాసతీర్మానానంతరము నాకు ప్రకాశ మాంధ్రదేశమున కైక నాయకునివలె కాన్పించినాడు. నా మిత్రునకు, వేరొక్క అరవవానికి Beware The Ides of March అని ప్రబోధింపబడిన జూలియస్ సీజరువలె కన్పడెనట. కాని ఆంధ్ర లిట్టివారుకారని వానితో వాదింపవలసి వచ్చినది.

నేను నా అరవస్నేహితుని వాక్యము యథాతథముగ వ్రాసినందులకు శ్రీ పంతులుగారుగాని చదువరులుగాని నాపై కినియకుందురు గాక. ది 20—12—45 తేదీని రాజమహేంద్రవరమునందు జరిగిన ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్సు వర్కింగుకమిటీలోని సమాచారములు కర్ణాకర్ణిగ నా యరవ మిత్రునికి తెలియుటచే తా నిట్లు చెప్పితిననియు అరవదేశ

ములో నాయకత్వమును గూర్చిన తగాయిదాలు రచ్చకెక్కినవి గాని ఆంధ్రదేశములోనివారు మిత్రత్వమును ప్రకటింపుచు ద్రోహము చేయుదురేమో యనుభీతిచే తానట్లు చెప్పుచున్నా ననియు, 1937 సం॥రపు ఎన్నికలలో ఆంధ్రులలో కొందరు అరవనాయకుడైన సి. రాజగోపాలాచార్యుల గారితో చేరి ఆంధ్రులకు ఆంధ్రదేశమునకు ద్రోహము చేసిరనియు, అట్టి క్లిష్ట పరిస్థితులే నేను తిరిగి ఆంధ్రదేశమునకు రాబోవుచున్నవనియు నా యరవమిత్రుడు చెప్పియున్నాడు. ఇట్లాతని యభిప్రాయము ను వ్రాసినందులకు చదువరులు నన్ను మన్నింతురు గాక.

## ఇ త ని గు ణ ము లు.

సాహసికుడు, మంచిత్యాగి, ధన మప్రధానముగ జూచెడివాడు, జీవితములో నిరుత్సాహ మెరుగనివాడు, నిర్భయుడు, వివేకి, అభినివేశి ప్రకాశము. ఆంధ్రరాష్ట్రమున కేకైక నాయకుడు.

౨

# డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు

## త్యాగి

ఆంధ్రభూమిలో చారిత్రాత్మకమైన మండలము గుంటూరు. ఈ గుంటూరుమండలములో ప్రసిద్ధులగు వీరులు పెక్కుండ్రు జన్మించిరి. పల్నాటివీరులు, కొండవీటిరెడ్లుకూడ యీమండలములోనివారే. మెరకలు, పర్వతములు గలభూములలో వీరులు జన్మింతురట. పశ్చిమకనుమలలోని మహారాష్ట్రులొక్కనాడు సేతుశీతాచలము నేకచ్ఛత్రాధిపత్యముగ పరిలించినవారే. ఉత్తర హిమాలయపర్వత భూములలో నేపాల్ భూటాన్ మొదలగు ప్రదేశములయందు జన్మించి వీరులై సైనికులైన ఘూర్కాపటాలములు క్షాత్రతేజముతో నొప్పొంగు చుండునని పాశ్చాత్యులుసహిత మంగీకరించి తీరిన విషయమే. ఇంత యెందులకన పర్వతప్రాంతములలోని జనులు క్షాత్రమును గలిగి ప్రకాశింతురని చెప్పుటకు. అట్లే మన సుబ్రహ్మణ్యముగారుకూడా!

## వీ రి బా ల్య ము.

సుబ్రహ్మణ్యంగారి యింటిపేరు బ్రహ్మజోస్యులవారు బ్రాహ్మణులు. వైదీకులలో తెలగాణ్యశాఖకు జెందుదురు. వీరి జన్మస్థానము కొండవీడు సీమలోని ఫిరంగిపురము. వీరి జననము 12 అక్టోబరు 1891 సం||రము. బాల్యమునందు కొద్దితరగతులు ఫిరంగిపురములో చదివిరి. కాని విద్యార్థిదశ యంతయు బెజవాడలోనే గడపిరి. ఆ విద్యయందైన నుత్తీర్ణులు కాలేకపోయిరి. మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థులు కాలేకపోవుటచే విద్య నభ్యసించుట మానిరి. విద్య పరిపూర్ణత నొందకపోవుటచే జీవనాధారమునకు బనికివచ్చు వేరు విద్యల నభ్యసింపవలయునని వీరు తలంచుచుండెడివారు.

## వై ద్య వి ద్య.

ఆ కాలములో వైద్యమునం దెక్కుడాదర ముండెడిది. ఆ వైద్యమువలన యిహపరసాధనములు రెండునుకూడ లభించునని తలంచి ఆవిద్యను బడయుచుండెడివారు. ఈవైద్యవిద్య కూడ చెన్నరాజధానిలోని వైద్యవిద్యకన్న బంగాళమండలి విద్యావిధానము బాగుండునని పెక్కుండాంధ్రులు బంగాళమున కేగుచుండెడివారు.

వారలలో సుబ్రహ్మణ్యముగా రాకరు. మెట్రిక్యు-
పరీక్షయం దు త్రీర్ణులు కాకపోయినను వీరు నిరుత్సాహులుకాక
కలకత్తా కేగి విశేషశ్రమలంది నాలుగు సంవత్సరములు వైద్య
విద్య నభ్యసించిరి. అక్కడనుండి చదివి విద్యాపరిసమాప్తిమైన
పిమ్మట తిన్నగ రాజమహేంద్రవరము 1915-16 సంవత్సర
ములో తిరిగి వచ్చి వైద్యవృత్తిని ప్రారంభించిరి. వీరీవృత్తిలో
బ్రవేశించుట తడవుగా విశేషగౌరవమర్యాదలు సంపాదింపుచు
నపారధనము నార్జించుట ప్రారంభించిరి. వీరి యార్జన వంద
లాదిగ నుండెడిది. గ్రామమునందలి వైశ్యప్రముఖులలో వీరి
పేరు ఖ్యాతి వహించినది. నెల కే డెనిమిదివందలు యీవృత్తి
వలన గడించెడివారు. వీరీగరణితో బాటు బీదవిద్యార్థులకు
విద్య చెప్పించుట పాఠ్రంభించిరి. వీరు పెక్కండ్రు విద్యార్థు
లకు ధనసహాయ్యమును గావింపుచు గుప్తదానమునందు ప్రసిద్ధి
వహించిరి.

## వీరి రాజకీయోద్యమములు.

ఈ వృత్తియం దేమి దోష మున్నదోగాని వైద్యుల
కీ రాజకీయాందోళనములయందు ప్రేమ మెండు. వైద్యులు
విద్యాధికులైన సర్వతంత్రస్వతంత్రులు. వీరలకు సాధారణ
ముగా దేశాభిమానము మెండు. అందుచే యెట్టి జాతీయోద్య

మము వచ్చినను వైద్యులు ముందంజవేసి కార్యరంగములోనికి దూకుదురు. శ్రీ సుబ్రహ్మణ్యంగారుకూడ నట్టివారే. 1916-17 సంవత్సరములలో వచ్చిన హోంరూలులీగ్గు ఆందోళన దేశ మం దంతటను విజృంభించినప్పుడు సుబ్రహ్మణ్యముగారు నడుముకట్టి కార్యరంగములోనికి దూకి పనిచేయుట ప్రారంభిం చిరి. వీరి కార్యనిర్వాహణదక్షత గమనించియే సభ్యులు వీరిని సహాయకార్యదర్శిగ నెన్నుకొనిరి. అప్పటినుండియు వీరు గాఢ మైన దేశాభిమానము గలిగి ప్రజలదృష్టిని తమవైపు త్రిప్పు కొనజాలిరి.

## కాంగ్రెస్సు.

1920 సం॥రములో గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్య మము తీవ్రముగ విజృంభింప జొచ్చినది. మొట్టమొదట వీరు శాసనసభాబహిష్కార సందర్భములో ప్రచారము చేసిరి. అప్పటినుండియు ప్రజాసేవ చేయ ప్రారంభించిరి.

డాక్టరు సుబ్రహ్మణ్యముగారు తమవైద్యవృత్తిని విడచు నప్పటికి ప్రజ లీయవలసిన మొత్తములు సుమారు రెండారువేల వఱ కుండెను. ఈ మొత్తములు వసూలు జేసుకొనకుండ నా కస్మికముగ యుద్ధరంగములోనికి దిగిరి. అందుచే ప్రజ లీయ వలసిన సొమ్ము బాకీలక్రింద నిలచిపోయినది. సత్యాగ్రహ

షులో ప్రవేశించిన కొన్నిదినముల కీసొమ్ము వసూలుచేసి పెట్టవలసినదని సుబ్రహ్మణ్యంగారి యింటిలోనివారు (భార్య మొదలైనవారు) కోరినట్లును కొంత ఆ బాకీలు వసూలు చేయుచుండగా సుబ్రహ్మణ్యముగారికి తెలిసి యాబిల్లుల లాగు కొని చింపివేసిరనియును తెలియవచ్చినది.

వీరు మంచివక్త లగుటచే చక్కని యుపన్యాసముల నొసంగుచు ప్రజలహృదయములు చూరగొనుటలో నగ్ర గణ్యులై యొప్పెడువారు. గోదావరీమండలమున వీరు తిరగని గ్రామములు, పోవని నభలు, నిలువని వేదికలు లేవు. లలిత మైన పదములతో, హాస్యోక్తులతో, మృదుమధురభాషతో, చక్కగ-గంభీరముగ-హృదయంగమముగ-సభికు లానందించు నట్లు-ఆనందించుటే గాదు. ఉత్సాహవంతులుగ జేయునట్లుగ- ఉత్సాహవంతులుగనే కాదు. నడుముకట్టి-కార్యరంగములోనికి దూకి-ప్రచారకులుగ చేయునట్లు వీ రుపన్యసించెడివారు. వీరి కార్యదక్షత జూచి పెక్కండ్రు వీరిచుట్టును చేరిరి. నేడు రాజ మహేంద్రవరముసందలి రాజకీయవేత్త లోకనాడు సుబ్రహ్మ ణ్యముగారి శిష్యకోటిలోనివారే. వీరి ననుసరించుకొని పని చేసినవారిలో నగ్రగణ్యుడు మద్దూరి అన్నపూర్ణయ్య, ధరణి ప్రగ్గడ శేషగిరిరావు, రామచంద్రుని వెంకటప్ప, మామిడిలక్ష్మీ పతి, మాచిరాజు రామచంద్రమూర్తి, డాక్టరు శ్రీ వంగవేటి

దీక్షితులు ప్రభుతులు. ఆనాడు వారియాజమాన్యమును నంగీక రించి వారికి తోడ్పడి పనిచేయుటచేతనే యీనాడు వీరు చక్కని నాయకులై ప్రజలను నడిపింప గలుగుచున్నారు.

1920–21 సంవత్సరములలో తీవ్రకృషి చేసి సత్యాగ్రహోద్యమము దిగ్విజయముగా నడువబట్టియే వీరిని 1921 డిశంబరులో ప్రభుత్వము వారు బంధించి చెరకు గొనిపోయిరి. మొదట రాజమహేంద్రవరమునందునను, పిదప కడలూరు జెయిలునందునను వీరిశిక్ష సంవత్సరము గడపిరి. ఆశిక్షా కాలములోకూడ వీరు చక్కని ఆరోగ్యవంతులై తోడిఖైదీలకు చేయూతనిచ్చి చేసిన సేవ అపారమైనది. తిరిగి వీరు 1922 నవంబరులో విడుదలయై బయటకు వచ్చి ప్రజాసేవ సేయుచు గాంధీగారి యుద్యమమును సక్రమముగ నడిపింపజొచ్చిరి. 1923 సం॥ రమున కాకినాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్సు మహాసభానమయమున వీరు చేసినసేవ అపారము. వీరు తీరుబడిగ కూర్చొని వ్యర్థముగ కాలక్షేపము జేసిన దిన మొక్కటియు లేదు. నూలువడకుట వీరికి ప్రీతి. మంచిరాట్నములచేయించి నూలు వడుకుచు వడికించుచు నిర్మాణకార్యక్రమమున కెంతో సహాయభూతులుగ నుండి పనిచేసెడివారు. 38 వ జాతీయమహాసభ కాకినాడలో దిగ్విజయముగా జరుగుటకు డాక్టరు సుబ్రహ్మణ్యముగారు, వారి యనుచరులు చాలా వఱకు కారణులని చెప్పవచ్చును.

రాజమహేంద్రవరములోని ఆచంట పరబ్రహ్మమను నొకవైద్యుడు దురాగ్రహావేశపూరితుడై నిష్కారణముగ సుబ్రహ్మణ్యముగారిని చెంపపై కొట్టినాడు. ఆనాడు గ్రామమంతయు విచారించినది. ప్రతీకారమును జేయుటకై పల్వు రుత్సహించిరి. కాని అహింసాపద్ధతి నలవఱచుకొనిన సుబ్రహ్మణ్యముగారు వారి నందరిని వలదని వారించినారు. పిమ్మట పరబ్రహ్మము క్షమాపత్రమిచ్చినట్లు తెలియవచ్చినది.

1924 సం॥రము నుండియు సుబ్రహ్మణ్యముగారు తీవ్రవాదులై మంచికృషి చేసిరి. వీరికి నిర్మాణకార్యక్రమముపై నున్న విశ్వాసము శాసనసభాప్రవేశమునందు లేదు. ఈశాసన సభాప్రవేశము 1922 సం॥రములో చిత్తరంజనదాసు, మోతీలాల్ నెహ్రూగార్లు లేవదీసిరి. ప్రభుత్వశక్తికి మూలస్థానములైన శాసనసభాస్థానములు పట్టుకొని, ఆసభల విచ్ఛేదనము సేసిన ప్రభుత్వవిధానములో ప్రతిష్టంభనము గలిగింపవచ్చు ననియు, దాని మూలమున ప్రభుత్వము లొంగివచ్చుననియు వీరు తలంచి తీవ్రప్రచారమును గావించిరి. దీనినే స్వరాజ్యోద్యమ మందురు. కొంతమంది కీవిధానము బాగుగ నున్నదని తోచినది. కొంతమంది కీవిధానము నచ్చలేదు. అట్లు నచ్చని వారిలో సుబ్రహ్మణ్యముగా రొకరు.

## సీతానగర ఆశ్రమము.

అందుచే వీరు రాజకీయము బహువిధమార్గము ల నడచు చున్నదని తలంచి గాంధీగారి నిర్మాణకార్యక్రమమునందే దృష్టినిలిపి యుంచిరి. పట్టణములో నుండి ప్రజాసేవచేయుట ప్రారంభించిన వివిధరాజకీయములతారు డెక్కుడుగ నుండునని యాలోచించి తమ నివాసస్థానమగు రాజమహేంద్రవరమునకు సమీపగ్రామము చేరుకొని అక్కడ నొక చక్కని యాశ్ర మము నిర్మించుకొని శిష్యవర్గముతో పనిచేయుచు, నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుచుండిన బాగుండునని నిశ్చ యించుకొనిరి. ఈపద్ధతికి మిత్రు లంద రంగీకరించిరి. వెంటనే ఆశ్రమనిర్మాణమునకు పూనుకొనిరి. రాజమహేంద్రవరము నకు పరిసర గ్రామమైన సీతానగరములో ప్రవేశింప నిశ్చ యించుకొనిరి.

ఈ ఆశ్రమనిర్మాణమునకై 1925 సంllరములో వద్దాను గెకరముల భూమిని రమారమీ రూ 3000—0—0 లు విలువగట్టి ఆధనమును పోగుచేసి ఆధనముతో ఆశ్రమమునకు వలసిన భూమిని కొని స్వాధీనపఱచుకొని ఆ భూమిలో శంఖు స్థాపన జేసి ఆశ్రమభవనముల నిర్మాణమునకు ప్రారంభించిరి. ఈ ఆశ్రమనిర్మాణమునకై మిక్కిలి శ్రమ జెందిరి. వేలాదిగ

ధనమును పోగు చేసిన గాని యిటుక, సెంకు, కలప వగైరాలు పోగుపడవుగదా! అందుచే మంచి ప్రచారమును గావించి ధనమును పోగుచేసిరి. సుమారు రూ 20, 000 లు వెచ్చించి ఆశ్రమభవనము లన్నియు నిర్మించిరి. ఈ భూమిలో 13 యకరములు వ్యవసాయాదికములకును, ఒక్క యకరము ఆశ్రమభవనములకును నిర్ణయించుకొనిరి. వీరు కట్టిన భవనము లన్నియు ఆ యెకరములోనే నిర్మించుకొనిరి. వీరు పెట్టదలచుకొనిన వివిధశాఖలకు వివిధభవనములును, వీరు నివసించుటకు ప్రత్యేక భవనములును ఆ స్థలములోనే కట్టిరి. అవి 12 భవనములు. ఈ భవనములలో వివిధశాఖల నిర్మించి ప్రజాసేవ సేయుట ప్రారంభించిరి. ఈసేవ గాంధీగారు సూచించిన నిర్మాణ కార్యక్రమమునుబట్టి నిర్ణయింపబడినది. కావున ఆ నిర్మాణకార్యక్రమమును గూర్చి కొంచెము తెలియ బఱతును.

## నిర్మాణ కార్యక్రమము.

నిర్మాణకార్యక్రమమునుగూర్చి గాంధీగా రీవిధముగ దెల్పియున్నారు. నిర్మాణకార్యక్రమ మనగా, సత్యము, అహింసాపద్ధతులతో పూర్ణస్వరాజ్యమును లేక సంపూర్ణస్వాతంత్ర్యమును నిర్మాణము చేసికొనుటయని చెప్పవచ్చును. దౌర్జన్యయుత సాధనములపై స్వాతంత్ర్యనిర్మాణ మనగా, అట్టిది

అసత్యముపై నాధారపడ వలసివచ్చునని తెలిసికొనుట కష్ట ముగా నుండును. ఈనాటి యుద్ధములో నిత్యము కోట్లకొలది ఖర్చు, వేలకొలది ప్రాణనష్టము జరుగుచుండుట మనముచూచు చుండుట లేదా? సత్యము అహింసాపద్ధతులపై సంపూర్ణ స్వాతంత్ర్య మనగా జాతి మత కుల విభేదములు లేకుండ, నెంతటి చిన్నరాజ్యమునకైన స్వేచ్ఛాస్వాతంత్ర్యములు కలిగి యుండుటే యని చెప్పవచ్చును. ఈస్వాతంత్ర్యము బహిర్గత మైనది కాదు. కావున నది అంతర్లీనమైన యన్యోన్యాశ్రయ ముపై యాధారపడియున్నది. ఈ స్వాతంత్ర్యమునుగూర్చి మన మెంతవఱకు కృషిచేసి లభింప జేసుకొందుమో అంతవఱకే అది లభించును. ఈ నిర్మాణకార్యక్రమమును సింహావలోక నము చేసి చూచిన, నీకార్యక్రమమును సక్రమముగ మనము నెరవేర్పగలమేని మనము కోరిన స్వాతంత్ర్యము మనకులభించి తీరగలదని నాతో చదువరికూడ నంగీకరింపగలరు. వివిధపక్ష ములవారి కలయికను గౌరవింతునని ఆమెరీచెప్పియుండ లేదా! ఇందుల కాతని విశ్వాసమును మనము శంకింప నవసరములేదు. ఏలయన ఆకలయిక న్యాయమైన అహింసా పద్ధతులపై లభించి నచో సంపూర్ణస్వాతంత్ర్యము దా నంతట నదే వచ్చితీరును.

దౌర్జన్యపద్ధతులపై వచ్చిన స్వతంత్రతకు నొక నరి యగు నర్థముగాని, అట్టిస్వతంత్రత కాని యుండదు. ఏజాతి

మైన తాను చూపించిన దార్జన్యాధిక్యతనుబట్టి దానికి స్థానము దొఱకును. అట్టిచో రాజకీయముగ, నార్థికముగ సమానలక్షణములు కలుగ నేరవు. దార్జన్యరహితతతో గూడిన నా నిర్మాణకార్యక్రమమును నాచరణములోనికి తీసికొని వచ్చినచో స్వాతంత్ర్యసంపాదనమునకు దార్జన్య మనవసరమని నేను వేరుగ జెప్ప నక్కర లేదు. అట్టి యీ నిర్మాణకార్యక్రమమునకు వలసిన 13 విషయములను నిరూపింతును.

(1) వివిధజాతి సమీకరణము. (2) అస్పృశ్యతా నివారణము. (3) త్రాగుడు. (4) ఖద్దరు. (5) ఇతరపల్లెటూరి పరిశ్రమలు. (6) గ్రామపారిశుధ్యము. (7) నూతనవిద్యావిధానము. (8) వయోజనవిద్య. (9) స్త్రీజనోద్ధరణము. (10) ఆరోగ్యబోధ. (11) రాష్ట్రభాషాప్రచారము. (12) స్వభాష. (13) ఆర్థికసమత్వపుకృషి. ఇది యీ యాశ్రమమునందె ట్లాచరణములోనికి దీసికొని రాబడినదో క్లుప్తముగ నిచట విశదీకరింతును.

(1) హిందూ, మహమ్మదీయ, క్రైస్తవాది వివిధ మతస్థులలో, పరమతసహనము, అన్యోన్యగౌరవము, ఆదరణము, భక్తి, ప్రేమ కలిగియుండి యితరమతస్థులు సాటిసోదరులని తలంతుమేని ప్రభుత్వము చీల్చి పాలించలేదు. ముఖ్యముగా హిందూ మహమ్మదీయ సఖ్యము కుదిరినచో మన

మైక్యకంఠముతో గోరు కోరికను ప్రభుత్వము మన్నించితీరును. ఈ సూత్రమును ఆశ్రమవాసులు ప్రచారము గావించిరి.

(2) అస్పృశ్యతా నివారణము. దీనికి విశేషవ్యాఖ్యాన మనవసరము. దీనిని ఆశ్రమవాసు లమలులో బెట్టిరి.

(3) త్రాగుడు. ఈవిషయములోగూడ సీతానగర ఆశ్రమము తీవ్ర ప్రబోధమును చేసినది. పికెటింగుకూడ చేసిరి. ఇతరులచేత చేయించిరి.

(4) ఖద్దరు. 13, 451 గ్రామములలో వసించుచున్న 19, 645 హరిజనులను, 57, 878 మహమ్మదీయులను, మిగిలిన దేశస్థులను కలిపి 275, 146 వల్లెటూరి ప్రజలకు ఒక్క 1940 సం॥రములో నిడిన డబ్బు రూ 34, 85, 609 లు. వీరిలో నూలువడికినవారు చాలామంది స్త్రీలే. కాని యింతపని జరిగినను యిది, కాంగ్రెస్సు అభిమానులందరు యీపనిలో పాల్గొని చేయించినచో జరుగవలసిన దానిలో శతాంశముకూడ లేదని చెప్పవలెను. ప్రత్తిచెట్లు మొలిపించుట-ప్రత్తినితీయుట-గింజలు తీసివేయుట-శాగుచేయుట-ఏకుట- ఏకులుచేయుట - వడకుట- దానిని సరియైన విభాగములు చేయుట- రంగులు వేయుట- వడుగు- పేకలు సరిచూచుట- నేయుట- ఉదుకుట మొదలగు వనులన్నియు ఖద్దరుత్పత్తి కావశ్యకములు. అని గాంధీగారు చెప్పుటచే నిది యాశ్రమమునకు ముఖ్యపరిశ్రమ మైనది. దీనిగూర్చి ముందుముందు వ్రాయుదును.

(5) ఇతరపల్లెటూరి పరిశ్రమలు- ఆశ్రమమునందు విశేషముగ నితర పరిశ్రమలు స్థాపించ లేదు. వ్యవసాయము మాత్రము చేయుచుండెడివారు.

(6) గ్రామపారిశుధ్యము- ఈవిషయమై ఆశ్రమము శ్రద్ధ వహించినది. వైద్యాలయమునుకూడ స్థాపించి పని చేసినది.

(7) నూతనవిద్యావిధానము- వీరు చిన్న పాఠశాలను పెట్టి గ్రామీణులకు విద్య గఱపెడువారు.

(8) వయోజనవిద్య- ఈవిషయమై ఆశ్రమము శ్రద్ధ వహించినది. కాంగ్రెస్సుపత్రికను స్థాపించి ప్రబోధమును చేసినది. ఇచ్చట కాంగ్రెస్సు పత్రికనుగూర్చి కొంచెము వ్రాయవలసియున్నది. ఆంధ్రదేశములో పత్రికాధిపతులుగ నుండి పని చేయుచు కారాగారములకు వెడలినవారు గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు, మద్దూరి అన్నపూర్ణయ్యగారు. అన్నపూర్ణయ్యగారు మంచితీవ్రవాదులు. చక్కని వ్రాతకాడు. మృదుమధురమైన భాష. మంచిశైలి. ఉద్బోధజనకమైన విషయములు గలిగి వీరి యాజమాన్యమున కాంగ్రెస్సుపత్రిక యాంధ్రదేశమున మంచిపేరు గడించుకొనినది.

(9) స్త్రీజనోద్ధరణము - ఈవిషయమై ఆశ్రమము ప్రత్యేకకృషి చేయలేదు.

(10) ఆరోగ్యబోధ- ఈవిషయమై ఆశ్రమస్థాపకులైన శ్రీ సుబ్రహ్మణ్యంగారు వైద్యులగుటచే గ్రామీయుల కారోగ్యబోధ చేయుటే వారిపని యైనది.

(11) రాష్ట్రభాషాప్రచారము- ఈవిషయమై విశేష కృషి చేయుటలేదు. ఆశ్రమవాసులలో కొందఱు హిందీ నేర్చుకొనిరి. ఇతరులకు నేర్పించిరి.

(12) స్వభాష- వీరు స్థాపించిన కాంగ్రెస్సుపత్రిక తెలుగుననే ప్రకటింపబడుచు వచ్చినది. మంచిమంచి వ్యాసములు వ్రాసియు, వ్రాయించియు స్వభాషలో మంచికృషి చేసిరి. ఈపత్రికకు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారే ప్రధానులు.

(13) ఆర్థికసమత్వపుకృషి- దీనినిగూర్చి యాశ్రమము కృషి చేయుటకు సావకాశము లేదు. దీనినిగూర్చిన ప్రబోధము మాత్రము చేయుచు వచ్చిరి. ఆచరణములో పెట్టుటకు వీరే తలుచు అన్యసహాయ్య మపేక్షింపు చున్నప్పుడు వీ రితరుల కేమి చేసి చూపింపగలరు? కావున యీ యాశ్రమములో గాంధీగారి యభిప్రాయములగూర్చి విశేషప్రచారము మాత్రము గావింపబడినది. ఇక ఆశ్రమవాసులు చేసిన పనులనుగూర్చి వ్రాయుదును.

ఈ యాశ్రమమునకు ఖద్దరుశాఖ ముఖ్యమైనది. వీరు రాట్నము, కదుళ్ళు చేయించి, మంచిదూదితో యేకుల

గావించి, ఆశ్రమములోను, ఆగ్రామములోని కాపురస్తుల యిండ్లలోను కావలసిన సాధనసామగ్రి నిచ్చి ఖద్ద రుత్పత్తి చేయించుట ప్రారంభించిరి. ఒక రిద్ద రాశ్రమవాసులు ప్రత్యేకముగా ఖద్దరునకై యేర్పాటు గావింపబడిరి. ఈనాటికిని సీతానగరం ఖద్దరునకు మంచివిలువ గలిగి యున్నది. ఈ ఆశ్రమములోనుండి మంచివారపత్రిక నొకదానిని నడుపవలె నను నుత్సాహముబుట్టి యొక ముద్రణాలయమును కొని వ్యాపారమును సాగింప బ్రారంభించిరి. కాంగ్రెస్సు అను వారపత్రిక నొకదానిని ప్రచురించి దానిమూలమున ప్రజలకు వలసిన ప్రబోధము గావించెడువారు. ఈపత్రిక మద్దూరి అన్నపూర్ణయ్యగారి సంపాదకత్వముక్రింద ప్రకటింపబడుచు వచ్చినది. ఈపత్రికకు రెండు మూడు వేల చందాదారు లుండెడివారట. పత్రిక చక్కని సైజులో మంచి సుబోధకములగు వ్యాసములతో కృష్ణాపత్రికతో దీటు వచ్చునట్లు ప్రకటింపబడు చుండెడిది. ఇచ్చటనే వే రొక్కభవనమునందు వైద్యాలయమును నెలకొల్పి ఉచితముగ రోగులకు మందుల నిచ్చుచు ప్రజాసేవ చేయుటకు ప్రారంభించిరి.(సుబ్రహ్మణ్యముగారు) బాగుగ నారి తేరిన వైద్యులు. వీరికి లొంగని రోగము లేదు. అందుచే రోగులు వందలాదిగ వచ్చి వీరిచే వైద్యమును చేయించుకొని తృప్తి జెందుచుండెడివారు. ఇందుల కమితధనము వ్యయ

మైనది. ప్రజలనుండి ధనమును పోగుచేసి ఖర్చు పెట్టుచుండిరి. ఇందు వ్యవసాయశాఖనుగూడ నిర్మించుకొనిరి. వ్యవసాయము నకు గావలసిన పరికరములు, యెడ్లు, నంపాదింపబడినవి. ఆశ్ర మమునకు గావలసిన, కూరలు వగైరాలేగాక, జొన్నలు, చోళ్ళు, మిర్చి మొదలగు మెరకపంటలు పండించుచుండెడి వారు. ఈవ్యవసాయమువలన మంచి ఆదాయము వచ్చుచుండె డిది. ఈఆదాయముతో ఆశ్రమవాసుల భోజనాదికములు గడచిపోయెడివి. ఈఆశ్రమము మంచి యుచ్ఛస్థితిలో నుండగా గాంధీగారు వచ్చి ఆశ్రమమంతయు చూచి యచ్చట రెండు దినము లాగి, యాశ్రిమములో నతిథులై యుండి యాశ్రమము నాశీర్వదించి వెడలిపోయిరి.

ఈ ఆశ్రమము సీతానగరములో గోదావరిగట్టునకు జేర్చి కట్టబడినది. ప్రతిసంవత్సరము గోదావరికి వరదలువచ్చుట కలదు. ఆవరదలతో పాటు, సకల విధవృక్షములు, పాకలు, వందిళ్ళు, కొట్టివేసిన కఱ్ఱలు మొదలగునవి కొట్టుకొని వచ్చు చుండును. వీనితోబాటు వీని నంటిబెట్టుకొనియున్న వివిధసర్ప జాతులు, కూడ కొట్టుకొని వచ్చి గట్టునకున్న కలుగులలోను మరియితర రహస్యప్రదేశములలోను తల దాచుకొనుచుండును. ఇవి వఱదలు తగ్గినపిమ్మట క్రమక్రమముగా బహిరంగప్రదే శములకు జేరుచు మానవుల కంటబడినప్పుడు మృత్యువాతను

జేరుచుండును. గోదావరివట్టు గ్రామమునకున్న విశేషమే యిది. ఇట్లే సీతానగర ఆశ్రమముకూడ గోదావరిగట్టున నుండు టచే వివిధసర్పజాతులు ఆశ్రమము లోనికి వచ్చి తదాశ్రమ వాసులమూలమున చంపబడుచుండెడివి. ఇది ప్రతిసంవత్సరము జరుగుచున్న పనియే. కాని యెల్లకాలము నొక్కరీతినే గడ వదుగదా.

ఆశ్రమవాసులలో మామిడి లక్ష్మీపతి యను వైశ్య యువకుడు. సత్యాగ్రహోద్యమమునందు శ్రద్ధతోయి పనిజేసి యున్నాడు. రాజమహేంద్రవరమున గలవైశ్యప్రముఖులలో మామిడివా రొక్కరు. వీరు సంపన్న గృహస్థు లగుటచే లక్ష్మీ పతి ఆశ్రమవాసియై శ్రమ పడలే డేమో యని మొదట కుటుంబములోనివారు సందేహించిరి. తుదకు చెప్పినను ప్రయో జన ముండదని తలంచి యూరకుండిరి. లక్ష్మీపతి ఆశ్రమవాసు లలో జేరి కార్యరంగమున ప్రవేశించి అకుంఠితదేశభక్తితో బనిసేయ ప్రారంభించినాడు. ఆత డంత నిష్కళంక దేశభక్తు డగుట భగవంతునికి కిట్టలే దేమోయనునట్లు ఒక్కనాటిరేయి నాతడు సర్పదష్టుడైనాడు. ఆసర్పము త్రాచు కాదు. త్రాచైన చావో బ్రదుకో కొన్నిగంటలలో తేలిపోవును. అది యట్లు త్రాచుగాక రక్తపుపొడ యైనది. అందుచే పొడజాతిపాము యెక్కువ బాధపెట్టిగాని ప్రాణములు పుచ్చుకొనదు. చాల

కాలము ఆశ్రమవాసుడౌట అక్కడివా రందరీతనికి సర్వవిధోప చారముల జేయుచుండెడివారు. అక్కడికి దూరగ్రామమున నున్న నొక కోయవానిని రప్పించి తురాయిల కట్టించిరి. దానితో నాతనికి కొంచెము నింపాదిగానుండుట ప్రారంభించి నది. కాని అట్లు వారముదినములు జరుగుటలోడనే వేరే వైద్యమును చేయింపవలెనని తలంచి ఆతురాయిలను విప్పిరి. మరికొలదిసేపట్లోనే ఆతడు విషపూరితుడై మరణించినాడు. ఇది ఆశ్రమమునకు తీరని లోపము. లక్ష్మీపతివంటి దేశభక్తుడు, స్వార్థత్యాగి, నిరాడంబరుడు పోవుట ఆశ్రమవాసులకేగాక ఆంధ్రదేశమునకే తీరని కొఱంత. ఈదారుణమునకు కడమ వారు జంకలేదు. ఈఆశ్రమవాసి లేనిలోపము పూరించుటకో యనునట్లు ద్విగుణీకృతోత్సాహులై మిగిలినవా రందరు పని చేయుట ప్రారంభించిరి.

ఈఆశ్రమము అత్యుచ్ఛస్థితిలో నుండగా 1930 సం॥ వత్సరమున తిరిగి మహాత్ముడు ఉప్పుసత్యాగ్రహమును ప్రారం భించినాడు. ఈసత్యాగ్రహసమయములో సుబ్రహ్మణ్యము గారు రెండవసారి అరెస్టు కాబడిరి. ఒక సంవత్సరము తిరిగి శిక్ష విధింపబడి రాజమండ్రిలోను, కడలూరు జెయిలులోను శిక్షాకాల మంతయు గడపి ఆశ్రమమునకు వచ్చి వేసిరి. తిరిగి ఆశ్రమములో ప్రవేశించి వ్యవహారము లన్నియు సరిజూచు కొనుచు కాలక్షేపము చేయుచుండిన సమయ మది.

## 1932

అది 1932 సంవత్సరము. హిందూదేశచరిత్రములో నది యొక విషాదఘట్టము. గాంధీమహాత్ముడు రౌండుటేబిలు కాన్ఫరెన్సునకు వెళ్ళి అచ్చటజార్జిసార్వభౌముని యతిథిగానుండి హిందూదేశమునకు తిరిగి రాగానే మహాత్ముని పట్టుకొని చెరలో పెట్టిరి. అంతతో ప్రభుత్వమునకు కసి తీరిపోలేదు. సత్యాగ్రహోద్యమము నాశనమును చేయ స్థిరసంకల్పులై కాంగ్రెస్సువ్రచారకులపై తమక్రోధమును ప్రకటింప జొచ్చిరి. అన్నిరాష్ట్రములలోను యీాదురంతరములు జరిగినవి. కాని తూర్పుగోదావరిజిల్లా అన్నిటిని మించిపోయినది. ఇంతటిఘోరములు మరెక్కడను గావింపబడ లేదని ప్రజ లనుకొను చుండెడివారు. ఇంతకుముందే పెద్దాపురములో లాఠీచార్జి తోటవిందు సమయములో జరిగినది. అక్కడ పోలీసులు చేసిన భీభత్సముచే పాపము మిత్రుడు కోడేటి రంగాచార్యులు చేయి విరిగిపోయినది. అది తిరిగి అతుకుకొనలేదు. ఆబాధతో తీసి కొని తీసికొని ఆతడు 1937 సం॥రములో ప్రాణములు వదలి నాడు. ఆ 1932 సం॥రములోనే బులుసు సాంబమూర్తి ప్రభృతులను కాకినాడలో దారుణమైన లాఠీచార్జికి గురిచేసిరి. శ్రీ సాంబమూర్తిగారి శరీరప్రకృతి మిక్కిలి మంచిదగుటచే

కాబోలు వారిగాయములు పదిహేను దినములలో తగ్గి నివృత్తించినవి. కాని ఆసంవత్సరములోనే రాజమండ్రీ డెప్యూటీ సూపరింటెండెంటు ముస్తఫాలీఖాను డాక్టరు సుబ్రహ్మణ్యాం గారిమీద తనకు గల క్రోధమంతయు దీర్చుకొన సంకల్పించి యున్నాడు. అట్లే వానికి సమయముకూడ చిక్కినది. నాటితో ముస్తఫాఆలీఖానుగారి చర్య దేశచరిత్రములోని కెక్కినది. ఈతడు ప్రభుత్వోద్యోగి. పైగా మహమ్మదీయుడు. కలిగిన క్రోధమును దీర్చుకొనగల సమర్థత గల అహంకార పూరితోద్యోగము. అట్టివానిని ఆసమయములో అడ్డగలవారెవ్వరు? ఆపగల వారెవ్వరు? మహోగ్రావేశని పేరొందినముస్తఫాతలంచిన దంతయు నెఱవేర్చినాడు.

రాజమహేంద్రవరములో సత్యాగ్రహోద్యమము విజృంభించినది. డాక్టరు సుబ్రహ్మణ్యాంగారీయుద్యమమును నడుపుటకై రాజమండ్రీ వచ్చియుండిరి. ఇది ముస్తఫా చూచియున్నాడు. పోలీసు సిబ్బందిని తీసికొని వచ్చినాడు. నాళం భీమరాజుగారియింటిలో సుబ్రహ్మణ్యముగా రుండుట నెరింగినాడు. లోపలకు వార్త నంపించి వారిని వీధిలోనికి రావించినాడు. వచ్చుటే తడవుగ వారిపై బడినాడు. లాటీచార్జిచేయుట ప్రారంభించినారు. పోలీసువారెవరిని కొట్టుచున్నారో, యెందులకు కొట్టుచున్నారో, ఎన్నిదెబ్బలు కొట్టవలెనో అట్లెంతసేపు కొట్ట

వలెనో, తెలియనిస్థితిలో పాపము తమకృత్యమును ప్రారం
భించిరి. మోకాళ్ళపై కొట్టినదెబ్బలు-తొడలపై నిడినవాతలు-
నడుముపై నిడిన ఘాతములు- జెబ్బలపై తగిలిన ప్రహారములు-
తల పగులగొట్ట నిడిన పోట్లు- వందలా? వేలా? వెన్నుపై
గ్రుద్దిన గ్రుద్దులు- ప్రక్కలో పొడిచిన పోట్లు- మోముపై
నొసగిన గాయములు- గుండెలలోనికి దింపినయీలాంటి మొనలు-
పదిమందివా? పాతికమందివా? నోటికిరాని బూతులు- ఇప్పు
డేమి చేయుదు వనుచుతిట్లు- నీగాంధీ వచ్చివాడా యనుచు
దుర్భావలు- ఈనాటితో నీబ్రతుకున కాఖరు- అనుచు శాపా
లవములు- ఒకవిధమా! ఒక్రమమా? అహంకారపూరిత
గర్జారావములతో- ఇనుపతొడులుగలిగిన లాఠీపోటుల వర్షపు
జడులతో- కాలిసేతుల పిడికిటి పోటుల నశనిపాతములతో-
కొట్టినదెబ్బలు- పొడిచిన పోట్లు- తిట్టిన బూతులు- నాడు
చూచినవారికి- వినినవారికి- చదివినవారికి- హృదయము మూగిపో
యినదో? ఒడలు జలదరించినదో? నిలువెల్ల స్వేదతావృత్తియే
గలిగినదో? కాని ఒక నేరమున కొకశిక్ష- ఒక దోషమున
కొకఖైదు- ఒకసాహసమున కొకప్రతీకారము- నేరమే లేదే-
శిక్షించుటకు! దోషమే లేదే- బంధించుటకు! ఒకసాహసమును
చేసియే యెరుగడే యొకప్రతీకారమును తీర్చుకొనుటకు! దేశ
సేవాభిలాషి కా యీపిడికిటి గ్రుద్దులు? తనదేశమునకు తన

ప్రాణములీయదలచిన వానికా యీ లాఠీపోటులు? సర్వసంగ పరిత్యాగమునకు సంసిద్ధమై, బాహ్యప్రపంచమును రోసి- అంతర్ముఖుడై- నిమీలితనేత్రుడై- దేశమును- భగవంతుని దప్ప వేరేమియు గాంచని- నిశ్చలభక్తునకా? వినిర్మలధీరునకా? ప్రతిమలవీరునకా?- ఈ దారుణములు- ఈఘోరములు ఈ దౌర్జన్యములు. కడిగిన ఆణిముత్యమే- స్వచ్ఛందమైన స్ఫటికమే- దేవార్చన కిడిన సాలగ్రామమే- మా సుబ్రహ్మణ్యము. అట్టి వానికా యిట్టి- కనరాని- వినరాని- తలపరాని- అమానుష భీకరదుష్టదౌర్జన్య కృత్యములు? వేంగిదేశమును స్వతంత్రముగ స్వేచ్ఛగ పరిపాలించిన ఆంధ్రరాజు రాజరాజు రాజవీధిలోనా ఆంధ్రనాయకుని శరీరాంగచ్ఛేదనము. పతితపావన గౌతమీ నదీ ప్రవాహోదకములు ప్రవహించుచోట దక్షిణకాశికాపురవరనాయకునకా- ఘోరభీకరభీభత్స స్వరూపసమన్విత శల్యమాత్రావశిష్టత- ఎంత మోటమొండి, మొఱకు కఱకుదనము- ఎంత నిర్దాక్షిణ్యత- ఎట్టి వజ్రహృదయము. ఆ హృదయములో- దయ- దాక్షిణ్యము- ప్రేమ- అనురాగము- భక్తి- గౌరవములకు తావు లేదా? కాక-మానవహృదయమే గాదా అది? అట్టిలక్షణముల గలిగియుండుటకు. దారునిర్మితమా? పాషాణసదృశమా? లోహసమన్వితమా? వజ్రసన్నిభమా? [illegible]దించునైజలక్షణముగూడ నశించినదే నాటిముస్తఫాహృదయమునకు—

ఆలాటిపోటు- ఆవెనుకప్రక్క, రెక్కగూడులమధ్య, వెన్నెముకకు ప్రక్కగ పొడిచిన ఆఒక్కపోటు- చర్మములో నుండి యెముకల సందునకు- ఎముకలసందునుండి మాంసము లోనికి- మాంసములో నుండి కండరములలోనుండి యూపిరి తిత్తులలోనికి తూటుపడునట్లు పొడిచిన ఆఒక్కపోటు, ఎట్టిదా రుణము చేసినది? సుబ్రహ్మణ్యముపాలిటి యశనిపాతమైనదే ఆపోటు. ఊపిరితిత్తులలోతూట్లు పడ సేసి క్షయను రావించి ఆరోగ్యమును సంపూర్ణముగ నశింపజేయ గలిగినదే. సర్వవిధోపచారములు గావించినను, సమస్తసదుపాయములు సమకూర్చినను, సకలారోగ్యవిధుల సంపాదింపజేసినను ఫలము లేకుండ జేసినదే ఆఒక్కపోటు. బెజవాడలోని మందులను గుంటూరులోని యౌషధములను రాజమహేంద్రవరములోని యారోగ్యాశ్రమమునుగూడ- నిరర్థకమును జేసినదే- ఆఒక్కపోటు. అమితమైన ధనమును- బ్రదికితీరవలె ననునభిమానమును- జీవితాధారమైన ప్రాణమును కూడ కొనిపో గలిగినదే ఆ ఒక్కపోటు.

నాడు 23వ డిశంబరు. 1936 సం॥రము. వైకుంఠ యేకాదశి. నాడు స్వర్గద్వారమును అపావృతముజేసి దేశస్వాతంత్ర్య దీక్షాపరతంత్రుని ఆహ్వానించినాడు తదధిపతి. బంధుమిత్ర పరివృతుల నెడబాసి- సూర్యబింబమును భేదించుకొని- స్వర్గ

లోకమున కరిగినాడు. స్వరాజ్యమును కాకపోయినను స్వారాజ్యము నైన పొందగలిగినాడు మాసుబ్రహ్మణ్యా మానాడు.

మ న వి.

మహానుభావుడై త్యాగియైన డాక్టరు సుబ్రహ్మణ్యముగారిని బలవన్మరణమునకు పాల్జేసిన ముస్తఫాల్ ఖాన్—కడుపు కక్కూరితికై యుద్యోగములో బ్రవేశించి-ప్రజాసేవకుడను మాట మఱచి- దేశసేవాభిలాషులగు ప్రజలు సాటిమానవులే. వారికిని భార్యయు, బిడ్డలు, సంసారము మొదలగునవి కలవను నింగిత జ్ఞానము లేక దండనమే ప్రధానముగ- కఱకుమొఱకుదనమే జీవితాశయముగ- పరుల దుఃఖభాజనుల జేయుటే తన సుఖజీవన సాధనముగ నెంచి, దేశహితైకపరులు- స్వార్థత్యాగులు- అభిమానధనులు- నిరాయుధులునగు కాంగ్రెస్సువారిపై సలిపిన దౌర్జన్యములు- ఘాతుకకృత్యములు- నీచప్రవర్తనములు- అమానుష కార్యములు- ఆంధ్రదేశములోని వివిధ ప్రాంతీయులకు తెలియ జెప్పవలసియున్నది. రావణ, కంస, నరకాసురాదుల హైందవజాతి యెట్లు మఱువజాలదో- అష్లే జనరల్ డయ్యర్- ముస్తఫాలీఖానుల చరిత్రములు హైందవజాతి మఱువజాలదు. ముస్తఫాలీఖానులవంటి దౌర్జన్య స్వభావులాంధ్ర దేశములో నక్కడక్కడ కొంద ఱుండవచ్చును కాని అట్టివారలలో ముస్తఫా మొదటివాడు. ఆంధ్రరాష్ట్రము

నకు- భారత దేశమునకు- కాంగ్రెస్సునంస్థకు, వినరాని- కలన రాని లోపమును కలుగ జేసి- ప్రజలయొక్క-యు- వర వేశ్వ రుని యొక్క-యు ఆగ్రహమునకు పాత్రుడై చేసిన ఘాతుక కృత్యములకు పాల్పడవలసి వచ్చిన దేశసేవా పరాయణుల గూర్చి తెల్పుట యప్రస్తుతము కాదు.

1931 సం॥లో వాడపల్లిలోని రథోత్సవ సందర్భములో రథముపై గాంధీమహాత్ముని పటము పెట్టినగాని రథమును లాగ మని ప్రజలు పట్టుపట్టగా కలహమును పెంచి నిరాయుధులగు రథోత్సవదిదృక్షాయుత్తులై వచ్చిన యమాయకపు ప్రజలపై టుపాకుల కాల్పించి నిరపరాధులగు ముగ్గురి మరణమునకు కారణభూతుడైనాడు. రమారమీ పదిమందికి గుండ్లదెబ్బలు తగులుటచే వారిని ఆసుపత్రి పాలోజేసినాడు.

ఈ హత్యల యనంతరమునందే డాక్టరు సుబ్రహ్మణ్యం గారి హింసాకాండము. (1932 సం॥)

1930 లో మిత్రుడు సంపన్న గృహస్థుడు స్వార్థత్యాగి యగు డాక్టరు వెలిదండ్ల హనుమంతరావుగారిని గూర్చి తెలిసి కొనుట యవసరము.

## కీ॥ శే॥ వెలిదండ్ల హనుమంతరావుగారు

వీరు బెజవాడ వాస్తవ్యులు. బ్రాహ్మణులు, సంపన్న గృహస్థు. వైద్యవృత్తి B. A; L. M. & S. పరీక్షలలో

కృతార్థులై నెలకు వేయిరూప్యములు గడించుకొనెడివాడు. 1930 సం॥రమున గాంధీమహాత్ముని యుప్పు సత్యాగ్రహోద్యమమునకు ముందు గాంధీమహాత్ముడిచ్చిన యుపన్యాస మూలమున రాజకీయరంగములోనికి ప్రవేశించి వలంటీరుగ జేరివచ్చెను. కృష్ణజిల్లా ఉప్పు సత్యాగ్రహమున ద్వితీయదళమునకు నాయకత్వమును వహించి జైలునకేగెను. వీరు బెజవాడలో శిక్షింపబడి యేప్రియల్ మా సాంతమునకు రాజమహేంద్రవర కారాగారమునకు వచ్చెను. ఆ చెరలో ఖైదీలకిచ్చు బియ్యమునందు పురుగు లెక్కుడుండుటచే భోజనము నందసహ్యము కలిగి యొకటి రెండుపూటలు భుజించుటయే మానెను. ఈ రచయిత మే 14 వ తేదీని ఆ చెరలోనే పెట్టబడిన పిదప హనుమంతరావుగారి మైత్రిని సంపాదించుకొనెను. ఉభయులుకలసి బియ్యమునుగూర్చిన తగాయిదాను లేవనెత్తిరి. రాజకీయ ఖైదీ లుదయము పూట గంజిత్రాగుటమానిరి. వెంటనే జెయిలునూపరింటెండెంటు రిజర్వుపోలీసువారిని రావించెను. వారిని యుచితస్థానములలో నిలపి జెయిలరును "గంజిత్రాగుట యెందులకు మానిరో కనుగొనిరమ్ము" అని వర్తమానించెను. అందుపై హనుమంతరావుగారు గంజిపై తేలిన పురుగులన్నిటిని నొక్కసారి యధికారికి జూపించెను. జెయిలరు బియ్యము బాగుచేయింతునని చెప్పుచు వెంటనే కొన్ని నంబర్లు తీసికొని

వెళ్ళి మరునాటి రాత్రి డేబదిమంది సి. క్లాసు ఖైదీలను తొమ్మండుగుర బి. క్లాసు ఖైదీలను రాయవెల్లూరు జెయిలు నకు బదలాయించిరి. ఈ డేబదితొమ్మండుగురిలో నలువది మంది తూర్పుగోదావరిజిల్లా నివాసులే. ఈరచయిత మొదటి జట్టుతో రాయవెల్లూరునకు పంపబడెను. మరుచటివారము రెండవజట్టును బయలు దేరదీసిరి. అందులోని వారందరు బి. క్లాసులోని వారే. ఈ జట్టునకు ముఖ్యుడు మిత్రుడు వెలిదండ హనుమంతరావుగారు. వీరి నందరిని రాత్రి 12 గంటల బండికై ప్రయాణించిరి. ముస్తఫాలితో సహా పోలీసులారీలు సిద్ధము చేయబడెను. బహిర్ద్వారమునుండి యొక్కొక్కరినే పిలువ ప్రారంభించిరి. వారలలో మొట్టమొదటివాడు హనుమంత రావుగారు. వీరు వెలుపలకు రాగానే పోలీసువారు- సార్జంట్లు- తమ హత్యాకాండమును ప్రారంభించిరి. గేటునుండి వెలువ లకురాగానే పోలీసు ఒక గ్రుద్దు హనుమంతరావుగారి వీపుపై గ్రుద్దెను. హనుమంతరావుగారు క్రిందపడిరి. వానిప్రక్కనున్న సార్జంటు లాఠీతో చావమోదెను. వేరొక సార్జంటు హనుమంత రావుగారిని లేవనెత్తి తిరిగి తానుకూడ లాఠీతో కొట్ట ప్రారంభించెను. మరొక్క పోలీసు వారు హనుమంతరావుగారి సామానులు బిగ్గలు కొట్టుట పుస్తకములు చింపి వైచుట- మంచి సామానులు హరించుట మొదలగు నీచాతినీచమగు కార్య

ములు జేయుట ప్రారంభించెను. ఇంతలో హనుమంతరావు గారు స్పృహతప్పి పడిపోయిరి. ఇట్లు స్పృహతప్పిన హనుమంతరావుగారిని కాళ్ళు చేతులు పట్టుకొని బస్సు పైపున కీడ్చిరి. పాపము హనుమంతరావుగారికి స్మృతిలేదు. అట్లు పడియున్నవారిని బస్సులోనికి గిరవాటువైచి లాఠీతో వెన్నుపై నొక్కపోటు పొడిచి ఆపడియున్నవానిని లోనికిగెంటిరి. అట్లే రైలులోకూడ నెక్కించిరి. రాయవెల్లూరురాగానే ఆసుపత్రిలో జేర్చి కొంత చికిత్స చేసిరి. కాని యీ దెబ్బల మూలమున హనుమంతరావుగారికి యూపిరితిత్తులు చెడినవి. రాజయక్ష్మ ప్రవేశించినది. నాటినుండి వారు లేచి తిరిగి యారోగ్యమును పొందలేదు. ఎన్ని వైద్యముల చేయించినను హనుమంతరావు గారు కోల్కొనలేదు. వీరు చెరలోనికి ప్రవేశించిన రెండు మూడు దినములకే బెజవాడనుండి వీరియాప్తులు రాయవెల్లూరునకు వీరిని చూడవచ్చిరి. వీరి కందరకు బెజవాడలో హనుమంతరావుగారు దెబ్బలుతిని మరణించిరను నీలివార్త తెలిసినదట. అందుపై వారందరు రాయవెల్లూరు వచ్చి హనుమంతరావుగారిని ఆసుపత్రిలోనే సందర్శించివెళ్ళిపోయిరి. విడుదలవై బెజవాడ చేరుకొనిన పిమ్మటగూడ హనుమంతరావు గారట్టి యనారోగ్యస్థితిలో నుండియు గూడ జైయిలునకేగి వచ్చిన తోడివారి యిండ్లకువెళ్ళి వారి కుచితముగ వైద్యసేవ చేసి వచ్చుచుండెడివారట. అట్టి త్యాగి - అట్టి నిరాడంబరుడు -

జీవించియున్నచో దేశమున కుపయోగించెడివాడు కదా? అట్టి ధీరుడు- అట్టి ప్రజాన్వితుడు- సజీవియైయున్నచో కాంగ్రెస్సు ఉద్యమము మతింత జాజ్వల్యమానముగ ప్రకాశించెడిది గదా! అట్టి ప్రజాసేవకుడు- అట్టి నాయకుడు- బెజవాడలో నివసించు చున్నచో దేశసేవకుల కెంత చేయూతయుండెడిదో! అట్టి మహానుభావు డస్తంగతుడైనాడు. అట్టి మహాత్యాగిని ఆ 1984 సం॥రము తనకాలగర్భములోనికి తీసికొనినది. హను మంతరావు మరణించినాడు. ముస్తఫామోము వికసించినది.

వీరి యనంతరమున వెలిదండ్ల హనుమంతరావుగారిపేర గ్రంథాలయము నొకదానిని వారి మిత్రులందరు కలసి నెల కొల్పిరి. బెజవాడ పురపాలకసంఘమువారు గవర్నరుపేటలో శ్రీ హనుమంతరావుగారిపేర ఒక చక్కని పార్కును నిర్మించి నారు. మిత్రుడు హనుమంతరావు జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల అచిర పరిచితుడనైన నాకు కన్నులు చెమ్మగిల్లుచుండ వారి సహ చరులకు సన్నిహితులకు హనుమంతరాయ నిర్యాణమెట్టి విప దాంబుధియగునో అట్టి మిత్రునకు అశ్రుతర్పణములు తప్ప వేరేమి చేయగలము. మిత్రమా! ధన్యజీవుడవయ్యా!!

## డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు

వీరు పశ్చిమగోదావరిజిల్లాలోని గరగపఱ్ఱు గ్రామ లో 1884 సం॥రమున జన్మించిరి. సత్కుటుంబమునకు

జెందిన బ్రాహ్మణులు. మెట్రిక్యులేషన్ పరీక్షయందు తీర్ణులై వైద్యవిద్యలో ప్రవేశించి L. M. P. చదివి కృతార్థతజెంది రాజమహేంద్రవరములో వైద్యవృత్తివలన సుఖజీవనము చేయుచుండిరి. వీరు 1910 సం॥రమున రాజమండ్రిలో గవర్నమెంటు ఆసుపత్రిలో ప్రవేశించి 5 సం॥రములు పనిచేసిరి. పిదప 3 సం॥రములు ఏజన్సీలో పనిజేసిరి. 1918 సం॥రమున గవర్నమెంటు పదవినిమాని రాజమహేంద్రవరమువచ్చి స్వంతముగ వైద్యాలయమును నెలకొల్పి ప్రజాసేవచేయుట ప్రారంభించిరి. అప్పటినుండియు హరిజనోద్ధరణమునందు వీరి కభిమానము కలిగినది. ఇందులకు రాజమహేంద్రవరములోని సంఘసంస్కరణోద్యమమే కారణమై యుండవచ్చును. వీరు 1925 నుండి 1927 వఱకు రాజమహేంద్రవర పురపాలకాధ్యక్షులు. వీరు ఆంధ్రమెడికల్ అసోసియేషన్‌కు మూడుసారులు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. మద్రాసు మెడికల్ కౌన్సిలులోని యెక్జిక్యూటివు కమిటీలో సభ్యులుగ నుండిరి. ఉత్తరవిశాఖ జిల్లాలో క్షామము వచ్చినప్పుడు వీరు మిక్కిలి శ్రద్ధవహించి పనిచేసిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్సు కమిటీ సభ్యులుగ నుండి కాంగ్రెస్సుసేవను చేసిరి. ఇట్టి మహానుభావుని 1930 సం॥రములో అక్టోబరు మాసమున రాజమహేంద్రవరములోని పందిరివారివీధిలో ముస్తఫా వీరిని స్వయముగా లాఠీచార్జి చేసెను.

గురుమూర్తిగారి శిరస్సును బట్టుకొని గోడకువేసి కొట్టెను. ముస్తఫాలో నొక్కగుణమున్నది. అది క్రోధోద్రేకము. అది యెక్కువయగు చుండుటేగాని తగ్గించుకొనుట యాతడెరుగడు. అట్టివాని చేతిలో బడిన గురుమూర్తిగారు ఎన్నిదెబ్బలు- ఎన్ని పోటులు- తినియుందురో చదువరులే యూహించుకొందురు గాక.

## వెన్నేటి సత్యనారాయణగారు

వీరు బ్రాహ్మణులు-కాతేరు వీరి స్వగ్రామము. బి. ఏ. పరీక్షయందు త్తీర్ణులయిరి. రాజమహేంద్రవరములోని వీరేశ లింగం హైస్కూలులో నుపాధ్యాయులుగ బనిచేసి విరమించు కొని ప్లీడరీపరీక్షకు చదివి యుత్తీర్ణులై రామచంద్రపురములో న్యాయవాదవృత్తి నవలంబించి గాంధీమహాత్ముని తొలిపిలుపు నకు జవాబిచ్చి వృత్తి విసర్జనము చేసిరి. 1921-22 సం॥రము లలో చెరయందు పెట్టబడిరి. అప్పటినుండియు కాంగ్రెస్సు సేవ చేయుచుండిరి. 1930 సం॥రములో ఉప్పుసత్యాగ్రహో ద్యమములో తిరిగి రెండవసారి చెరలోపెట్టబడిరి. 1932 లో ముస్తఫా స్వయముగ వీరిని లాఠీచార్జీచేసి సత్కరించెను. తిరిగి చెరసాల-విడుదలయై వారికి తోచినరీతిని గ్రామపునర్నిర్మాణ మునకు-గృహపరిశ్రమలకు- ఖద్దరుత్పత్తికి-పాటుపడి పనిచేయు

చున్నారు. వీరిని చేసిన లాఠీచార్జి చాలా తీవ్రమైనదనియు డాక్టరు సుబ్రహ్మణ్యముగారి తర్వాత వీరినే యెక్కుడుగ కొట్టి రనియు రాజమహేంద్రి పురవాసులు తెల్పుదురు.

## కీ॥ శే॥ నాళం భీమరాజుగారు

వీరు వైశ్యులు. రాజమహేంద్రవరములోని సుప్రసిద్ధ వైశ్యకులజులలో నాళము వారొక్కరు. భీమరాజు యీయింటి బిడ్డడే. వైశ్యులకు పిరికి దనము సహజలక్షణమని లోకప్రతీతి. కాని భీమరాజుసాహసి, ధీరుడు. 1930 సం॥రమున ఉప్పుసత్యాగ్రహములో చెరలో పెట్టబడెను. 1930 డిశంబరులో జరిగిన పెద్దాపురంతోట విందు నేర్పాటు గావించిన వారలలో నొక్కడు. ఆతోటవిందు సందర్భమున నొక్కమాట చెప్ప వలసియున్నది. నాటిమధ్యాహ్నము తోటవిందు పూర్తియైన పిమ్మట గం॥ 2-30 లకు పోలీసువారు లారీలతో వచ్చుచున్నారను వార్త వచ్చినది. మిత్రులు పెద్దలు కొందఱు అందఱు చెదరిపోవలసినదని సలహానిచ్చిరి. ఒకభీమరాజే లాఠీచార్జికి మనమెల్ల సిద్ధపడవలెను. మనము పారిపోకూడదని పట్టు పట్టెను. మరి అరగంటలో పోలీసువారి లాఠీచార్జి ప్రారంభ మైనది. అప్పుడే మిత్రుకు కోడేటి రంగాచార్యులుచేయి విరగ గొట్టబడినది. ఆచేతి యెముకతిరిగి యతుకుకొనలేదు. 1937 లో

రంగాచారి మరణించినాడు. ఆతోటవిందు లాఠీఛార్జికి సిద్ధపడిన వాడు సిద్ధపఱచినవాడు భీమరాజు. 1932 సం॥రములో డాక్టరు సుబ్రహ్మణ్యముగారితో కూడ భీమరాజు ను లాఠీఛార్జి చేసిరి. తిరిగి చెరలోపెట్టిరి. విడుదలయై వచ్చినపిదప హృద్రోగము వలన నాకస్మిక మరణమునకు బాల్పడెను.

## డాక్టరు కొరళ్ళ రాజారావుగారు

వీరు వైశ్యులు. కాకినాడలోని జగన్నాథపురవాసులు. మెట్రిక్యులేషన్ పరీక్షవఱకు చదివిరి. పిదప వీరి గురువులవద్ద ఆయుర్వేదము క్రమపఠనము గావించి క్రమశిక్ష నొందిరి. బాల్యము నుండియు దేశసేవాభిలాష మెండు. 1921–22 సం॥రముల నుండియు కాంగ్రెస్సుసేవ చేయుచుండిరి. కాని చెరలో పెట్టబడ లేదు. 1930 సం॥ ఉప్పుసత్యాగ్రహోద్యమమునకు సిద్ధపడిన రెండువందలమందిలో శ్రీ బులుసు సాంబమూర్తి గారు రాజారావుగారినే ప్రప్రథమ సత్యాగ్రహిగా నెన్ను కొనిరి. వ్యక్తి సత్యాగ్రహములో గాంధీమహాత్ముడు వినోబా భావే గారిని యెన్నుకొనినట్లు శ్రీ సాంబమూర్తిగారు రాజా రావుగారి కట్టి సావకాశ మొసంగినందుల కాతడు ధన్యవాదములర్పించెను. వీరు సత్యాగ్రహానంతరము కొందఱు ప్రచారకులతో రామచంద్రపురము ప్రచారమునకు వెళ్ళిరి. అచ్చటి

బంగాళాలో రాత్రి పండుకొని యుండగా ముస్తఫా కది యెల్ల తెలిసి రాత్రి పన్నెండు గంటలవేళ ఆయింటిలోనికి ప్రవేశించి నిద్రపోవుచున్న రాజారావుగారిని టుపాకీమడమతో పొడిచి లేపి లాఠీఛార్జి చేయుట ప్రారంభించెను. కాని రాజారావుగారు చలింపలేదు. అదిచూచి ముస్తఫా రాజారావుగారిని కొట్టుటకై నల్గురి రిజర్వుపోలీసువారి కప్పగించెను. పోలీసులు వీరిని దారుణవధ చేసిరి. నెత్తురు వరదలైనది. కాని మానవుడు చలించలేదు. బరిపై నిలచి ముస్తఫాతో బాహాబాహి పెనగు లాడవలసి వచ్చినచో ముస్తఫాను చిత్తుచేయగల సమర్థుడే రాజారావుగారు. కాని దౌర్జన్యరాహిత్యతత్వమునకు కట్టుబడు టచే నట్టి దాతడు తలపెట్టుకొనలేదు. ముస్తఫా మిగిలిన వారి నందర చక్కబెట్టి వచ్చి తిరిగి రాజారావుగారిని హింసించుట ప్రారంభించెను. ఈ రెండవసారి లాఠీచార్జి చేయుచున్నప్పుడు గాంధీమహాత్ముని దివ్యదర్శన మైనదని రాజారావుగారు చెప్పి యున్నారు. అప్పటికిని చలింపకుండుట జూచి ముస్తఫా తన మిలిటరీబూటుతో నాయువుపట్టున తీసిపెట్టి తన్నెను. అప్పుడు రాజారావుగారికి స్పృహతప్పినది. క్రిందపడినాడు. గిల్లార్చు కొని పోయినాడు. తిరిగి ముస్తఫా తన్నినాడు. రాజారావు గారు నెత్తురు కక్కుకొనిరి. కొంతసేపటికి ముస్తఫా నవ్వుచు వెడలిపోయినాడు. గ్రామస్తులెవ్వరు రాజారావుగారిని లేవ

దీయ లేదు. చూడ లేదు తుదకు భోజనమైన పెట్టలేదు. నాటి రాత్రికి మెల్లిగా కాకినాడ చేరుకొనిరి. ఆనాటినుండియు వీరి యారోగ్యము చెడినది. వీరికికూడ రాజయక్ష్మ ప్రవేశించి చాలా బాధ పెట్టినది. కాని వీరు సుప్రసిద్ధ ఆయుర్వేద లగుటచే బ్రదికిరి. 1941 లో వ్యక్తి సత్యాగ్రహములో పాల్గొనిరి. కాని పోలీసువారు వీరిని అరెస్టుచేయుక స్వల్పశిక్షతో వదలి వేసిరి.

## కాశీభట్ట జగన్నాధంగారు

వీరు తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకా కడలిగ్రామ కాపురస్తులు. బ్రాహ్మణులు. వైదీకకుటుంబములో బుట్టిన ఛాందసుడు. మొట్టమొదటనుండియు గాంధీ మహాత్ముని యుద్యమములో ప్రవేశించి పనిచేయు చుండెను. కాలినడకను గ్రామగ్రామములు తిరిగి ప్రచారముచేయుచు మహాత్ముని సందేశము ప్రజల కెఱుక పఱచుటయే వీరిపని. దేహావసరకర్మల నొనర్చుకొను చున్నప్పుడు తప్ప మిగిలిన జాగ్రదావస్థలో తకిలీపై నూలు తీయుచుండుటయే వీరిపని. లెఖ్ఖ వేసి చూచిన మహాత్మునికంటె కూడ వీరెక్కుడు నూలు తీసియే యుందురు. వీరికి కాంగ్రెస్సుసేవ తప్ప వేరువృత్తి వేరు జీవితము లేదు. కలిగిన స్వల్పముతో పరాధీనత లేకుండ కాల

క్షేపము చేయవలెనను నదియే వీరి జీవితాశయము. వీరికి కాంగ్రెస్సువారి సంబంధించిన సంస్థలలోనికి ప్రవేశించుటయందు కూడ అభినివేశము లేదు. తఱచుగ ప్రక్క గ్రామములలో జరుగు సంతలలోనికిబోయి యచ్చట ప్రజల జేరదీసి గాంధీ మహాత్ముని సందేశమును తెలియజెప్పుటే వీరి పని. అట్లే వీరు 1932 సం॥రములో నొక గ్రామమునకేగి అక్కడ త్రివర్ణ పతాకమును ప్రతిష్ఠాపించి యిరుగుపొరుగువారల బిలచి వారికి గాంధీమహాత్ముని ఖద్దరు మాహాత్మ్యమును గూర్చి చెప్పుచుండగా ముస్తఫావచ్చి జెండానుచించి జగన్నాధముగారిని లాఠీఛార్జి చేయించినాడు. ఆతనిని వస్త్రవిహీనుని జేసి విదేశ గుడ్డ మీదకు గిరవాటువైచి యది కట్టుకొనవలసినదిగా ఆజ్ఞాపించినాడు జగన్నాధముగారు కట్టుకొనలేదు. అందుపై జగన్నాధముగారు కట్టుకొనివచ్చిన ఖద్దరు బట్టల నచ్చట అప్పుడు తగులబెట్టించినాడు. తిరిగి జగన్నాధమును లాఠీఛార్జి చేసినాడు. తగిలిన ప్రతిదెబ్బకు "గాంధీ-గాంధీ,గాంధీ" యని యాక్రోశించుట తప్ప వేరేమియు జగన్నాధముగారు చేయలేదు. క్రింద పడినవానిని ధూళిలో పొరలించినాడు. బూట్సు జోడుతో తన్నినాడు. కాని కసిదీరలేదు. జగన్నాధముగారు గాంధీనామమును దప్ప వేరేమి స్మరించుటలేదు. ఆతని మెడలోని జందెమునుజూచి జగన్నాధముగారు బ్రాహ్మణుడని

తెలిసికొని వెంటనే కల్లుకుండను తెప్పించి నోటిలో పోయుటకు ప్రయత్నించెను. జగన్నాథముగారు నోరు విప్పలేదు. అందుపై ముస్తఫా "బాయునెట్టు"తో నాగని నోటిని పెకల్చెను. కల్లు పోసెను. కాని వెంటనే జగన్నాథముగారు ప్రక్కకు తిరిగి యుమియగా, నాతని గుండెలపై కూర్చుండి తిరిగి బాయ నెట్టుతో నోటిని పెకల్చి రెండవసారి కల్లుపోసెను. ఆకడవ యెల్ల మోముపై దిమ్మరించి లేచి వెడలిపోయెను. జగన్నా థముగారు లేచి అదియెల్ల వమనముచేసికొని వేరొక్కరిచ్చిన ఖద్దరు తువ్వాలును గట్టుకొని యింటికిపోయెను. అట్టి యభినవ ప్రహ్లాదుడు జగన్నాథముగారు. కాంగ్రెస్సుసంస్థలకు యెన్నికల పని వచ్చినప్పుడు మాత్రము జగన్నాథముగారు కాన్పింతురు. ఏది యెట్లున్నను జగన్నాథముగారు నిశ్చల దేశభక్తులు. అచంచలమైన సత్యాగ్రహి. గాంధీమహాత్మ నొక్కనినే నమ్ము కొనినవాడు. ధనముకై-పదవులకై-పలుకుబడికై ప్రాకులాడు వాడు కాడు.

## రాపాక తిరుపతిరాజుగారు

వీరి జననం 1904. బ్రాహ్మణులు. రాజోలు తాలూకా పోతవర గ్రామకాపురస్తులు. 1921 సం॥ నుండియు కాంగ్రెస్సు సేవ చేయుచుండెను. 1921 లో వీరికి శిక్ష విధింప బడినది.

రాజమండ్రి చెరలోనుండి విముక్తులైరి. 1929 సం॥ నుండియు అఖిలభారత చరఖాసంఘములో నుద్యోగములో ప్రవేశించిరి. 1930 స ॥రములో నుప్పుసత్యాగ్రహము నం దారుసార్లు లాఠీ ఛార్జి చేయబడిరి. కాని ఆరోగ్యవంతుడగుటచే మంచము పట్టలేదు. ఇట్లే అకుంఠిత ధైర్యసాహసోత్సాహములతో సత్యాగ్రహోద్యమములో పనిచేయుచునే యుండిరి. పిదప డాక్టరు కొరళ్ళ రాజారావుగారితో కూడ బయలుదేరి ప్రచారము నిమిత్తము రామచంద్రపురము వచ్చి వారితోబాటు నాటి రాత్రి ఆసత్రమునందే పండుకొని యుండగా ముస్తఫా రాజారావుగారి హింసాకాండ పూర్తిజేసికొని తిరుపతిరాజుగారిపై విజృచుకొనిపడి లాఠీఛార్జి చేయుట ప్రారంభించెను. తిరుపతి రాజుగారు దెబ్బలుతిని పడిపోయిరి. వెంటనే ముస్తఫా టుపాకీకి అమర్చబడియున్న బాయనెట్టుతో మోకాలిపై పొడిచెను. నెత్తురు వరదలైంది. ఇరువురు పోలీసు వా రీతని నిలువబెట్టిరి. ముస్తఫా లాఠీతీసికొని కుడిదబ్బపైకొట్టెను. అది యెంత బలమైన దెబ్బయో, ఆతనికి సత్యాగ్రహులన్న నెంత ద్వేషమో కాని ఆ దెబ్బకు జబ్బలోని యెముక విరిగినది. వీరిని అరెస్టుచేసి జైలునకు పంపిరి. ఆరుమాసముల శిక్ష. బళ్లారి జైలులో గడపివచ్చిరి. నాటినుండియు దేశసేవయే పని.

## పోడూరి పేరాజుగారు

వీరు బ్రాహ్మణులు. జననం తారణ సం॥ షష్టి పూర్తి యైనది. కృష్ణజిల్లా బందరు తాలూకా చినగొల్లపాలెములో వీరు జన్మించిరి. 1906 సం॥రము వఱకు రాజమండ్రి ట్రైయినింగు కాలేజీలో చదువుకొని వందేమాతరం హడావడిరాగానే చదువు చాలించి స్వగ్రామమైన పోడూరు చేరుకొనిరి. 1907 లో బొంబాయిచేరి కాశీనాధుని నాగేశ్వరరావుగారి అమృతాంజనం డిపోలో ప్రవేశించిరి. 1908 లో రంగంవెళ్ళి అక్కడ ఒక్క సంవత్సరం కాలక్షేపంచేసి తిరిగి స్వగ్రామం వచ్చి కొన్నిదినములు మాత్రమే యుండి తిరిగి రంగూనువెళ్ళి అక్కడ కొంతడబ్బు గడించి రాజకీయముల పాల్గొను చుండెడివాడు. పిదప స్వగ్రామమునకు వచ్చి వివాహము చేసికొని రాజమహేంద్రవరములో వ్యాపారమును బెట్టి యుద్ధసమయమున నమితలాభమును సంపాదించి హోంరూలులీగ్గులో ప్రవేశించి పనిచేసి 1919 లో వ్యాపారమును వదలి గాంధీగారి సత్యాగ్రహోద్యమములో ప్రవేశించినేటివఱకును కాంగ్రెస్సునే నమ్ముకొని యుండెను. ఇతను నాలుగైదు సార్లు శిక్ష ననుభవించినాడు. 1930 సం॥రములో రాజమహేంద్రవరమునుండి రాయవెల్లూరునకు మార్చబడిన వెలిదండ్ల హనుమంతరావుగారి జట్టులో పేరాజుగారు కూడ కలరు. వీరి కప్పుడు పెద్దమీసము

లుండుటచేతను వీరు పొట్టివారగుటచేతను అక్కడ లాఠీఛార్జి చేయుచున్న సార్జెంటు వీరి మీసములు పట్టుకొని (You are a Lilliput. I am a lilliput) అంటూ వానిని బట్టి యిటులాగి యటులాగి లాఠీతో వెన్నుపైనను పిఱ్ఱలపైనను దిట్టముగకొట్టి దగ్గరనున్న లారీలోనికి గిరవాటువైచిరి. పే్రరాజు గారు చావు తప్పి లారీలోపడి రాయవెల్లూరు చేరుకొనిరి. అప్పటినుండియు వీరు కాంగ్రెస్సు సేవచేయుచు స్వచ్ఛందమైన జీవితమును జీవించుచున్నారు. నిరాడంబరుడు. నిష్కపటి. నిశ్చల దేశభక్తుడు.

రాజమహేంద్రవరమునుండి రాయవెల్లూరునకు మార్చ బడిన వెలిదండ్ల హనుమంతరావుగారి జట్టులో రమారమీ 40 మంది కలరని వ్రాసియున్నానుగదా. రమారమీ వారి నందరిని కూడ లాఠీఛార్జిచేసిరి. ఇదియెల్ల ముస్తఫా దగ్గరనుండి చేయించినాడు.

## మర్ల అప్పయ్యశాస్త్రి

ఆర్యావటం సాయంకాలం ౫౦7—30 లకు నాలుగులారీలతో యేబదిమంది రిజర్వుపోలీసు వచ్చి మర్ల అప్పయ్యశాస్త్రిగారి యింటిమీాద దాడి చేసినారు. వచ్చిన వెంటనే యింటిలో ప్రవే శించి అప్పయ్యశాస్త్రిగారు భోజనము చేయుచుండగా స్మృహ తప్పి పోవువఱకు లాఠీలతో మోదినారు. తలమీాదను శరీరము

మీాదను గాయములైనవి. అప్పయ్యశాస్త్రిగారి యింటిలో నున్న ఆడవారిని వృద్ధులను దొడ్డిలోనికి గెంటివేయించి యింటిలోనున్న సుమారు రూ 1500—0—0 ల జౌషధముల సీసాల బ్రద్దలుకొట్టి వీధిలో పారవేసినారు. అప్పయ్యశాస్త్రిగారిని వెంటనే అరెష్టుచేసి రామచంద్రపురం పోలీసు స్టేషనులో పెట్టి చాల హింసించి నోటిలో మంచినీరు కూడ పోయకుండ చేసి నోటిలో గుడ్డలు కుక్కి నంకెళ్ళు కాళ్ళకు చేతులకు వేసి కొట్లో పడవేసినారు. మూడుదినములు హారము నీయకుండ అప్పయ్యశాస్త్రిగారి నీవిధముగ బాధించిరి. నాడే వీధినిబోవు వీరి సోదరులను మరికొందఱుగ్రామస్థులనుకూడా లాఠీఛార్జీ చేసినాడు.

శ్రీ సామవేదం అచ్యుతరామయ్యగారు. వీరు రాజమండ్రి వాసులు. బ్రాహ్మణులు. 1932 సం॥ ముస్తఫాలీచేసిన లాఠీఛార్జిలో చేయి విరిగిపోయినది.

వల్లూరి సూర్యనారాయణరావుగారు. వీరు కొవ్వూరు వాసులు. ప్లీడరువృత్తి. 1932 ముస్తఫా రాజమండ్రిలో వీరి నెత్తిపై దరించిన గాంధీటోపీని లాగివేసికొనెను. అందుపై సూర్యనారాయణగారు వీరిని మూడుకోర్టులు త్రిప్పి మూడు చెరువులనీరు త్రాగించిరి. ముస్తఫాలీ సీతానగర సత్యాగ్రహ ఆశ్రమంలో చేసిన దారుణములు లాఠీఛార్జిలు రాబోవు సంపు

టములో శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారి జీవితములో వ్రాసి ప్రకటింపనున్నాను. అందుచే నిక్కడ వ్రాయుటలచు కొనలేదు.

ముగింపు.

డాక్టరు సుబ్రహ్మణ్యంగారిని ది 26-1-1982 తేదీని లాఠీఛార్జిచేసి వారిమీద జాయింటు మేజస్ట్రేటు పి. వి. బాల కృష్ణఅయ్యర్, ఐ. సి. యస్. గారి వద్ద యిండియన్ పీనల్ కోడ్డు 195, 188, 157 శెక్షన్ల క్రిందను న్నూ 1932 వ. సం॥రపు 5 వ ఆర్డినెన్సు 4 వ. సెక్షనుక్రిందనున్నూ, క్రిమినల్ లా ఎమెండుమెంటు అక్టు 17 (2) క్రిందనున్న ఆరోపింపబడే నేర ములను డాక్టరు సుబ్రహ్మణ్యం, నాళం భీమరాజుగార్లు చేసి నట్లు రాజమండ్రి పోలీసు డెప్యూటీ సూపరింటెండెంటుగారు యిచ్చిన ఛార్జిమీద తీర్పులోని ఒకటిరెండు భాగముల నుదహ రించుచున్నాను.

94. "ఈ సంగతులన్నీ చూస్తే అక్కడలేని ప్రా॥ 2 వ సాక్షి (అబ్దుల్ సలామ్) తప్ప మిగిలిన ప్రాసిక్యూషన్ సాక్షు లందరును తండోపతండములుగా అబద్ధములను చెప్పిరి. 3 వ సాక్షి అప్పలస్వామి అప్రయత్నముగా చెప్పాడు అబద్ధాలు. అంతాకూడా తెలివితక్కువగా అబద్ధాలు చెప్పారు. అంతవిప రీతంగా చెప్పినప్పుడు ఆలాగే జరుగుతుంది. దరహాంమీద

మాట్లాడితే సరిగా కనబడక పోవచ్చును. కాని యీ ప్రాసి క్యూషను వారి కట్టుకథలో ప్రతిఒక్క భాగము అబద్ధమే.

97. ప్రాసిక్యూషను వారు కేసును బలము చేయుటకు చెప్పిన సంగతులన్నియు అసత్యములని యిందు మూలముగా నిర్ధారణ చేయుచున్నాను. క్రిమినలు ప్రొసీజరు కోడ్డు సెక్షను 258 (1) క్రింద ముద్దాయీలను విడుదలచేయుచున్నాను."

తూర్పుగోదావరిజిల్లా జడ్జీగారి కోర్టులో ది 3 జనవరి 1936 శుక్రవారం న్యాయమూర్తి పి. రాజగోపాలన్ ఐ. సి. యస్. గా నమక్షమున O. S. No. 29 of 1933 లో బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు వాదిగను ఖానుబహద్దరు ముస్తఫాలీఖాను ప్రతివాదిగను తేబడిన మానసష్టపు దావా లోని తీర్పునందలి భాగములు.

45. "పోలీసు అధికారి యొంత నిందాస్పదుడుగా గన్పట్టినను అమాయకునిగా తెలిసియుండియు, అసత్యమగు నేరముపై ప్రాసిక్యూటు చేయుటలో ప్రాసిక్యూటరుయొక్క భావము నిర్మాలిన్యమనిగాని, అక్రమముగా లేదనిగాని చెప్ప జాలము. వాదిని జెయిలునకు పంప నాతురతగా నుంటినని ప్రతివాదియే చెప్పెను. ప॥ 1 వ. సాక్షి (Mr. ఎ. ఎఫ్.

బక్కిలే) కూడ నదియే చెప్పెను. అదియే వారి యుద్దేశ్య మగుచో అసత్యపునేరముపై ప్రాసిక్యూషను చేయుట తప్పక ద్వేషబుద్ధితో కూడినదని చెప్పవచ్చును. అన్యాయముగా చేసిన లాఠీఛార్జి దాచుటకే పనిచేసినను ద్వేషబుద్ధియేయగును."

51. "ప్రతివాదిచే ద్వేషబుద్ధితో ప్రారంభింపబడిన ప్రాసిక్యూషనుకు గాను వాదికి రూ 750 లు. నష్టపరిహార ముగా నీయవలసినదని ప్రతివాదిని ఆజ్ఞాపించుచున్నాను.

52. ప్లెయింటులో కోరబడిన మొత్తముపై కోర్టువారు నిర్ణయించు ఖర్చులు వాదికి ప్రతివాది యిచ్చుకొనునటుల ఆజ్ఞాపించు చున్నాను."

పై రెండు కేసులు జరుగుచున్న కాలమునందు సుబ్రహ్మణ్యముగారు గుంటూరు మదనపల్లి మొదలగు వివిధ గ్రామములలోని వైద్యాలయముల కేగి యచ్చట వైద్యసేవనుబొందిరి. విశేషధనము వ్రయము కూడనైనది. కాని లాభము లేక పోయినది. మదనపల్లి నుండి రాజమహేంద్రవరమునందలి శాని టోరియమునకు వచ్చియచ్చట వైద్యసేవను బొంద నారంభించిరి. కాని ఆరోగ్యము పొందజాలక పోయిరి. చనిపోవుటకు ముందు కొంచె మారోగ్యము చేకూరినట్లు కన్పించినది. కాని యాకస్మికముగ వారు ముక్కోటి యేకాదశినాడు వీర స్వర్గమును చూరగొనిరి.

## గు ణా దు లు.

సుబ్రహ్మణ్యముగారు నిరాడంబరుడు. మంచివక్త. గంభీరుడు. తాను నమ్మినదే ధర్మమని తలంచెడివాడు. తల పెట్టిన కార్యమును తగినదీక్షతో నెరవేర్చెడువాడు. సాహస వంతుడు. ముప్పది నలువది వేలరూప్యముల ఖరీదుగల ఆశ్ర మము నిర్మించి అందుననే వసించి పదిమంది కుపాధి గల్పించి నాడు. మహాత్యాగి. రాజకీయసన్యాసి. నెలకు వేలాది రూప్య ముల యార్జనమును వదలుకొనినాడు. ఆంధ్రరాజకీయవేత్త లలో నమ్మినది యాచరించిన వారలలో నొక్కడు. ఉద్యో గములపై, పదవులపై, వ్యామోహమును బెట్టుకొనక తాను నమ్మిన సత్యాగ్రహోద్యమమునకు గురియై బలియైన డాక్టరు సుబ్రహ్మణ్యము త్యాగి.



ఆంధ్రరత్నం: దుగ్గిరాల గోపాలకృష్ణయ్య (లండనులో)

# ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

## భక్తుడు

హిందూమత సాంప్రదాయానుసారముగ భక్తుడగ్రి
స్థానము నలంకరించుచున్నాడు. భక్తి జ్ఞాన వైరాగ్యములలో
భక్తికే ప్రధానస్థాన మీయబడినది. ఈభక్తి యనునది యష్ట
విధములు. భాగవత వాత్సల్యము, భగవత్పూజ యందను
మోదము, భగవదర్చన, భగవద్విషయమునం దదంభము,
భగత్కథాశ్రవణేచ్ఛ, స్వరనేత్రాంగ వికారము, సదాభగ
వదనుస్మరణము, అమాంసభక్షణము. ఈభక్తిలక్షణములు
నవవిధములు. శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ,
అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము.
భక్తులలో నీ లక్షణము లన్నియు బొందినవారు తక్కువ.
నవవిధలక్షణములు గలిగి పరమేశ్వరుని భక్తితో సేవించి
ధన్యజీవులై యశఃకాములైన వారుకూడ కలరు. శ్రీరామ
చంద్రమూర్తిని గూర్చిగాని, శ్రీ పాండురంగ విఠలుని గూర్చి
గాని భక్తితో సేవించి భజించిన వారికందరికి దొరకు ఫల
మొక్కటే. అదియే ముక్తిలేక మోక్షము.

ఈముక్తి లేక మోక్షమునునది యైహిక సంబంధమై దృగ్గోచరమైన విషయము కాదు. అందుచే బెక్కండ్రు మోక్షమునునది లేదని నమ్మి క్రమముగా నాస్తిక వాదులగు చున్నారు. అట్టివారికి భక్తియు లేదు. పరమేశ్వరుడును లేడు. వీరి వాదనకు భక్తునినే సాక్షిగా తీసికొని వాదించుచున్నారు. సర్వసంగ పరిత్యాగియై యైహిక సంబంధముల దెగ ద్రెంపు కొనుచు అజ్ఞానదశయందు గావించిన వివాహఫలితముగ లభించిన భార్యాపుత్రాదులతో బాధపడుచు నిర్వేదముతో, నాక్రోశముతో, "పరమేశ్వరా" యని భజించి భజించి, కట్టు కొనుటకుగుడ్డ, తినుటకు తిండి లేక- మలమల మాడుచు- జీవితాశయమును- జీవిత పరమావధిని మాత్రము దృష్టిలో నిడి కొని స్వమతస్వదేశ సంరక్షణల బ్రిధానముగ జూచుకొనుచు నమ్మిన పరమేశ్వరునే భజించి తరించిన భక్తులు కలరు. అట్టి వారలలో నొక్కడు గోపాలకృష్ణుడు.

అధునాతనులు సాధారణ మానవుల బూజించి భజించి తరింపజూతురు. హరనాథభక్తులు, సాయిబాబాభక్తులు, రాధాస్వామిభక్తులు, లోకములో విజృంభించుచున్నారు. నాటి సమకాలీకుల కే భగవల్లక్షణముల నాపాదించి బూజించుటకంటె వాల్మీకాది మహాకవులచే- భరద్వాజాది మహాఋషులచే- వశిష్ఠాది మహాపవిత్ర చరిత్రులచే, కీర్తింపబడి-

పూజింపఁబడి- సతింపఁబడి, సుగ్రీవునకు నేతయై- మారుతికి త్రాతయై. విభీషణునకుదాతయై, నెగడిన పరమపురుషుడు- పురాణపురుషుడు- సంపూర్ణమానవుడై యలరారిన శ్రీరామ చంద్రమూర్తిని బూజించి, భజించి, తరింపజూచుట సర్వోత్కృష్టము కాదా! అట్టి శ్రీరామభక్తులు యుగయుగముల నుండి, తరతరములనుండి జన్మించుచు, జన్మపావనము జేయు తారకమంత్రోపదేశము మూలమున తరించి పూతచరిత్రులై నెగడిన పుణ్యాత్ములు పెక్కండ్రుకలరు. అట్టివారలలో నొక్కడు మన గోపాలకృష్ణుడు.

## బాల్యము.

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణుడు తండ్రి కోదండ రామస్వామిగారికిని తల్లి సీతమ్మగారికిని కలిగిన గారాబు ముద్దుబిడ్డ. ఇతడు విరోధినామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధచవితి (౨—౬—188౯) తేదీని కృష్ణజిల్లా నందిగామ తాలూకా పెనుగంచిప్రోలులో జన్మించెను. వీనితల్లి దండ్రులకిత డేకైక పుత్రుడు. ఇతడు వైదీకకుటుంబములోని వెలనాటిశాఖకు జెందిన హరితసగోత్రుడు.

ఇతడు జన్మించిన మూడవదినమునందే తల్లి సీతమ్మ పరలోకగతురాలాయెను. పురిటిదినములు గడచిన పిదప

తండ్రి కోదండరామస్వామి తమ స్వగ్రామమైన గుంటూరు జిల్లా రేపల్లెతాలూకాలోని కూచినపూడికి యీచంటిబిడ్డను గొనితెచ్చి తమ యింటగల పుసలమ్మచేతిలో నాతసిబెట్టి "ఇతడు నీబిడ్డగాని నాబిడ్డగాడు" అని చెప్పెను. అందుల కామె వల్లెయని యంగీకరించి యీబాలుని పెంచుచు కంటికి రెప్పవలె కాచుచుండెను. తండ్రి కోదండరామస్వామి దిన దిన ప్రవర్ధమానుడై యెదుగుచున్న బాలుని జూచుకొనుచు దినముల గడుపుచుండెను. కాని యీతడా రీతి పెక్కేండ్లు గడపలేక పోయెను. అకాలమృత్యువు కోదండరామస్వామిని యచిరకాలములోనే తన పొట్టలో బెట్టుకొనెను. అప్పటికి గోపాలకృష్ణునికి మూడవయేడు. కోదండరామస్వామి సోదరుడు శివరామయ్య యీబాలుని దరికి జేర్చుకొని పెంచ నారంభించెను.

ఇతడు సామాన్యకుటుంబములో జన్మించెను. విశేషమైన భూషసతిగాని మేడలు మిద్దెలుగాని వీరికి లేవు. కీర్తి గౌరవములే కుటుంబమున కాస్తిపాస్తులు. గౌరవముగ కుటుంబమును పోషించుకొనుచు చంటిపిల్లవాడైన గోపాలకృష్ణుని పెంచుకొనుచు జీవయాత్రను గడుపుచు శివరామయ్య దినములు వెళ్ళబుచ్చుచుండెను.

గోపాలకృష్ణుని కైదవ సంవత్సరము రాగానే విద్యాభ్యాసమును గావించి పాఠశాలకు పంపుట ప్రారంభించిరి.

బడిలోనివంతులు, యింట పితవండ్రియు గోపాలకృష్ణునికి చక్కని విద్య బోధింపవలెనని ప్రయత్నించిరి. కాని గోపాల కృష్ణునికి యాటలందేగాని విద్యయందు శ్రద్ధ లేకుండెనది. ఎన్నివిధముల బ్రయత్నించి సీతనికి పాఠశాలలకు బంపించినను చదువుటకు చదివినది జ్ఞాపకమునం దుంచుకొనుటకు, పినతండ్రి గాని- గురువుగాని- యేమి చేయగలరు. వారికిగల సర్వశక్తుల వినియోగించి సీతని విద్యావంతునిగ జేయ బ్రయత్నించిరి. కాని యితని కాటపాటలయందు, అల్లరియందు, నాటకముల యందుగల శ్రద్ధ విద్యలో లేకపోయినది. ఈ విధముగనే మొదట కొంతకాలము బాపట్లలోను పిదప 1906 సం॥రము వఱకు గుంటూరులోను విద్య నభ్యసించెను.

ఇతనికి 1898 వ సంవత్సరమున ఉపనయనము జరుప బడినది. శ్రీభారతుల మృత్యుంజయ అవధానులుగారి యుప నయనమును గావించిరి. 1903 వ సంవత్సరమున సీతనికి వివా హమహోత్సవము జరుపబడినది. ఇతని యత్తవారు కూడ కూచినపూడి వాస్తవ్యులే. అర్ధాంగిపేరు శ్రీ దుర్గాభవాని. వీరి యుభయులకు గలిగిన యేకైకపుత్రుడు రామచంద్ర మూర్తి. చిరంజీవియై వర్ధిల్లుచున్నాడు.

1906 సం॥ంమున గుంటూరులో మెట్రిక్యులేషన్ పరీక్షయం దుత్తీర్ణుడుకాలేక చదువు విరమించెను. 1907 సం॥న

శ్రీ పంచాపకేశఅయ్యరుగారి మైత్రి సంపాదించి వారి సహాయ్యమున జాతీయనాట్యమండలిని స్థాపించెను. ఆంధ్రరాష్ట్రమున నాట్యకళకు బ్రసిద్ధి కెక్కిన కూచినపూడి వాస్తవ్యుడును చక్కనిరాగ, లయ, జ్ఞానములు గలిగినవాడును, యౌవన శ్రీచే, మంచియారోగ్య భాగ్యముచే నలరారినవాడును, అగు గోపాలకృష్ణుని నాటకరంగస్థల మూశ్రయించినది. ఇతడు నాలుగైదు సం॥రములు నాటకకళాభిమాన పురస్సరముగ కాలమును వెచ్చించెను.

1911, 12 సం॥రములలో నాంధ్రరాష్ట్రమందలి పెక్కు మండలములలో నుండి యువకులు విద్యాభ్యాసమునకై ఇంగ్లాడు పయనించిరి. ఆకాలములో గుంటూరునుండి కూడ పెక్కండ్రు విదేశములకు బయలు దేరిరి. శ్రీ నడింపల్లి నరసింహారావుగారుకూడ బారిష్టరు పరీక్షకై యింగ్లండు వెళ్ళినవారే. గోపాలకృష్ణయ్యకు గూడ యింగ్లండునకు వెళ్ళి విద్యనభ్యసింప వలెనని బుద్ధి పుట్టినది. శ్రీ నడింపల్లి నరసింహారావుగారి యౌదార్యాభిమానములచే నితని ప్రయాణము కొనసాగినది. ఇతడు తిన్నగ లండన్ పట్నమునకు వెళ్ళి మెట్రిక్యులేషన్పరీక్షలో కృతార్థుడై స్కాట్లండు దేశమునకు ముఖ్యపట్టణమైన యెడింబరోలోని విశ్వవిద్యాలయములో యం. యే. పరీక్షయందు త్తీర్ణుడయ్యెను.

గోపాలకృష్ణుడు స్కాట్లెంఢులో విద్య నభ్యసించుచున్న కాలములో నొక్కొక్కప్పుడు వెచ్చించుకొనుటకు డబ్బులేక పోవుట తటస్థించెడిది. అట్టి సమయములయందు దాతడొక చక్కని పద్ధతిని ధనమాకర్షించెడివాడు. ఏ నాటకశాలయో అద్దికి తీసికొని యచ్చట టిక్కెట్ల నమ్మించి తనగానమాధుర్యమును ప్రదర్శించెడివాడు. ఆద్వారమున వచ్చిన ధనముతో నాతడు జీవయాత్రను గడపుచు, విద్య నభ్యసింపుచు, యెడింబరో విశ్వవిద్యాలయపు శిష్యునిగ మంచి కీర్తిని గడించుకొనెను. దక్షిణ ఆఫ్రికాలో సత్యాగ్రహోద్యమమును జయప్రదముగ కొనసాగింపుచు నింగ్లాండు రాయబారమునకు వెడలిన గాంధీమహాత్ముని మొదటి పర్యాయ మచ్చటనే నీతడు సందర్శించెను. 1914 సం॥రమున ప్రారంభింపబడిన మొదటి ప్రపంచ యుద్ధసమయమున నింగ్లాండు దేశమునందలిహిందూ దేశపు విద్యార్థులందరు తిరిగి తమ స్వదేశమునకు జేరుకొనిరి. గోపాలకృష్ణుడు కూడ విద్యయందు త్తీర్ణుడై స్వదేశమునకు వచ్చివేసెను.

గోపాలకృష్ణుడు స్వదేశమునకు జేరుకొని తనకభిమాన విద్యయగు గానమునందు కొంతికృషిచేయుచు, పురాణగాథలు తోలుబొమ్మలు, జంగంకథలు, నాటకములు, కొండపీఁడు,

కోటప్పకొండ మున్నగు పీరదుర్గములు, క్షేత్రములు, దర్శిం పుచు కాలక్షేపము చేయుదొడగెను. కాని యుద్యోగవిష యమై యింకను శ్రద్ధ తీసికొనియుండలేదు. ఇంతలో రాజ మండ్రిలోని గవర్నమెంటు కాలేజిలో నొక యుద్యోగము ఖాళి వచ్చుటచే మిత్రుల ప్రోత్సాహమున దాని కాతడు దర ఖాస్తు పెట్టవలసి వచ్చినది. ఆతని జీవితములో నుద్యోగ ప్రయ త్నమున కిదియే తొలిసారి కడసారి. ఆతడు పెట్టిన దరఖాస్తు పై నతనకి యుద్యోగము వచ్చినది. అందుచే గోపాలకృష్ణుడు రాజమండ్రిలో 1917 సం॥రమునందుద్యోగమున ప్రవేశించెను.

## ఇతని యుద్యోగములు.

రాజమహేంద్రవరములోని ట్రెయినింగు కళాశా లలో నీతడు 1917 సం॥రమునందు విద్యాబోధకుడుగ (Lecturer) గ పనిచేయుట ప్రారంభించెను. మొదింబరోలో నీతడు యం. యే పరీక్షయందు త్తీర్ణుడగుటచే నీత డింగ్లీషు పాఠములనే జెప్పుచుండెడివాడు. సునిశితమైన ప్రజ్ఞయుండు టయే యీతనికి మంచి యధ్యాపకుడని పేరు వచ్చినది. పాఠ ముల చక్కగ చదివించి, బాగుగ బోధించి, సవిమర్శకముగ నుపదేశించి కళాశాలలోని కెల్ల చక్కని బోధకునిగ రాణిం చెను. కాని యితనికి మతాభిమానము హెచ్చగుటచే నిత్యము

రామాయణ పారాయణాదికములచే బడికి పోవుటలో కొంచె మాంద్యమాచుండెడిది. నాటికళాశాలాధికారి (Principal)కి యిది కిట్టలేదు. గోపాలకృష్ణ డాలస్యముగ వచ్చుటయేగాక, రాగానే తన పేరున కెదురుగ హాజరుపట్టీ (Atten Dance Register) లో సంతకము చేయుచుండెడివాడు. ఈవిషయమై యధికారి తన కెన్నిసారులు చెప్పినను గోపాలకృష్ణుడు సరకుచేయలేదు. తనధోరణి తనదే. తనపద్ధతిని తాను వచ్చెడివాడు. హాజరుపట్టీలో మాత్రము సంతకముజేసి పాఠముచెప్పవలసిన తరగతిలోనికి వెడలి విద్యార్థులకు పాఠములు చెప్పుచుండెడివాడు.

ఇట్లుండగా నొకనాడు కళాశాలాధికారికి (Principal) ఇతనిపై యాగ్రహము వచ్చినది. కళాశాలకు కొట్టవలసిన గంటలు అనగా విద్యార్థులకు అధ్యాపకులకు కళాశాలకువచ్చు సమయమైనదని తెల్పుటకై కొట్టెడిగంటలు పూర్తియైన వెంటనే కళాశాలాధికారి తననౌకరుని బిలచి యాతనిని పెద్దగేటు తాళమువేసి రమ్మనమని తెల్పెను. ఆజ్ఞాబద్ధుడగుట నౌకరు గేటునకు తాళము వేసి వచ్చెను. అప్పటికింకను గోపాలకృష్ణుడు కళాశాలలోనికి రాలేదు. అందుచేతనే యాతనిని పరాభవింపనెంచి కళాశాలాధికారి యీపని జేయించెను.

గోపాలకృష్ణ డిదియెల్ల నెఱుగడు. తనయింట దేవతార్చనాదికముల పూర్తి గావించుకొని కళాశాలకు వచ్చెను.

వచ్చునప్పటికి పరామూలుపద్ధతినే "స్ట్రైకు" అయిపోయినది. కాని యిది పఱకొన్నడు లేని క్రొత్త యాచార మమలులోనికి వచ్చినది కనిపెట్టెను. గేటుతాళము వేయుటగాంచి యింటికి వెనుకకుబోవుటా? లేక కళాశాలలోని కెట్లోబోవుటా? యను వితర్కమానసుడై కళాశాలలోనికి వెడలుటకేనిశ్చయించుకొని గేటు ప్రక్కనున్న గోడపైకెక్కి దాటి కళాశాలలోనికి దూకి వచ్చెను. వెంటనే హాజరుపట్టీలో సంతకము గావించి తనకై నియమింపబడిన తరగతిలోనికి వెడలి పాఠములు ప్రబోధింప ప్రారంభించెను.

కళాశాలాధికారి గోపాలకృష్ణునిపై కన్నువేసి యుంచెను. ఇతనిరాక, హాజరుపట్టీలోని సంతకము, తన తరగతిలో పాఠము జెప్పుటమొదలగునవియెల్ల నాతడు గుర్తింపకపోలేదు. అందుచే గోపాలకృష్ణుడు పాఠము ప్రారంభింపక పూర్వమే కళాశాలాధికారి రమ్మని నౌఖరుచే వార్త నంపించెను. గోపాలకృష్ణుడు నవ్వుకొనుచు పుస్తకమును మూసి యా నౌఖరు వెంట నధికారి గదిలోనికి వెడలెను. వా రిరువురకు నీ దిగువ సంభాషణ జరిగినది.

అధికారి—మీరు కళాశాలలోనికి వచ్చి యెంతసేపైనది?

గోపాల—ఇప్పు డిప్పుడే వచ్చితిని.

అధి—హాజరుపట్టీలో సంతకము జేసితిరా?

గోపా—ఆ! చేసితిని.

అధి—మీరాలస్యముగ వచ్చియు నెందులకు సంతకము చేసితిరి?

గోపా—కళాశాలకు వచ్చితిని గావున వచ్చినట్లు తెలియబఱచుటకై జ్ఞాపకార్థము సంతకము జేసితిని.

అధి—మీరాలస్యముగ వచ్చితిరా?

గోపా—ఔను.

అధి—కారణము?

గోపా—పెద్దగేటు తాళము వేయబడి యుండుటచేత—

అధి—కళాశాలకు రావలసిన సమయమువఱకు తెఱచియే యుంచితిని. సమయమైపోయిన పిమ్మటనే తాళము వేయించితినే.

గోపా—ఇది లేని యాచారము.

అధి—ఉన్నయాచారమో? లేని యాచారమో? తాళము వేసియుండగ మీ రెట్లు రాగలిగితిరి?

గోపా—గోడదాటి.

అధి—ఓ! గోడదాటుట హద్దుమీరి ప్రవర్తించుట గాదా?

గోపా—హద్దు లెవరికి? కళాశాలతో సంబంధము లేనివారికి. నేనిందు అధ్యాపకుడను. ప్రభుత్వము నే నిక్కడ పని చేయుచున్నందులకు ప్రతిగంటకు ప్రతినిమిషమునకు

నాకు జీతమిచ్చుచున్నది. ఇంతేగాక అన్ని సెలవు దిన
ములలోని ప్రతి నిమిషమునకు కూడ జీతము వచ్చు
చున్నది. అందుచే నాకును నాకళాశాలకును సర్వకాల
సర్వావస్థలయందును అవినాభావ సంబంధముండినది.
నావిధ్యుక్తధర్మమును నేను నెరవేర్చుకొనుటకై కష్ట
పడి గోడదాటి కళాశాలకు వచ్చితిని. నేను పైవాడనై
కళాశాలతో నాకెట్టి సంబంధము లేనప్పుడు నేను
హద్దుమీరి ప్రవర్తించిన వాడనగుదును. నాకీ కళా
శాలతో సంబంధ మున్నంతకాలము నేను నాధర్మము
నే నిర్వర్తించి తీరెదను. నేను పైవాడనుకాను. కళా
శాల నాకు క్రొత్తదిగాదు. నేను హద్దుమీరలేదు.

అధి—నీవు విదేశములకేగి విద్య నభ్యసించి నాగరికతబొంది
వచ్చితివే. ఆ మాత్రము మర్యాద తెలియదా? గోడ
దాటరాదని తెలియలేదా?

గోపా—అప్రస్తుతము. నా నాగరికతతో నీ కేమి ప్రసక్తి.
పాశ్చాత్యనాగరికతా వ్యామోహముచే పీడింపబడెడి
వాడనుకాను. అనవసర ప్రసంగము చేయవలదు.
జాగ్రత్త.

అధి—(కాగితమొక్కటి సంతకము జేసియిచ్చి) మీ తర్కము
నకు బహుమానము. అని గోపాలకృష్ణుని యుద్యో

గములోనుండి తీసివేసినట్లు వ్రాయబడిన కాగితమును చేతికీయ గోపాలకృష్ణుడు "మీకింత శ్రమయెందులకు? గేటునకు వెలుపలనే వ్రాసి పట్టుకొని వచ్చిన. రెజిగ్నేషన్ రాజీనామా కాగితమిదిగో! పెద్దలు గ్రహించండి. అని తన యుద్యోగమునకు విడుదల కాగితమిచ్చుచు

"అయ్యా! నాకీ నాడు రామాజ్ఞయైనది. నీయట్టి వానిక్రింద నుద్యోగము చేయుట నాయట్టి శ్రీరామభక్తునకుతగదు. మానాభిమానముల జంపుకొని జానెడు పొట్టకై సేవకావృత్తి నవలంబించ రాదనియు, నీసేవకావృత్తి బానిసత్వములోనికి దింపుననియు శ్రీరామచంద్రమూర్తి నేడు చెప్పినాడు. నీకు కూడ నే నిదే యుపదేశించుచున్నాను. ఈ ప్రభుత్వమువారి యుద్యోగాలయములను కారాగారముల క్రింద భావించి నీవు కూడ వెలికిరమ్ము. నిన్ను పోషించు భారమునాది. మీరట్లు రాదలచు కొననియెడల మీకు, మీ యుద్యోగమునకు మీ శళాశాలకు కూడ శ్రీమద్రామారమణ గోవిందోహరిః అని చెప్పుచు వెలుపలకి వచ్చివేసెను.

ఇంతటితో గోపాలకృష్ణుని యుద్యోగప్రయత్నము పూర్తికాలేదు. కాలేజీ యుద్యోగమంతము కాగానే యాతడు ప్రభుత్వోద్యోగుల యధికారములకు వారి యహంకార పూరిత గర్వోన్నతికి, వారి దురాగ్రహమునకు, సేవగించు

కొని బందరులోని యాంధ్రజాతీయ కళాశాలలో నధ్యాపకు డుగ పనిచేయ ప్రారంభించెను.

ఇతడు బందరు జాతీయకళాశాలలో బనిచేయుచున్న కాలములో మ. ట్నూరి కృష్ణారావు, డాక్టరు పట్టాభిగార్లతో మైత్రి సంపాదించుకొనెను. వీనికి జాతీయ ప్రబోధము బాగుగ నభివృద్ధియైనది యీ యుద్యోగము మూలమున నే. వీనికి దేశ సేవానురక్తి మెండైనది యీకాలమునుండియే. వీనికి జాతీయ మైన రాజ్యాంగవిధానము నందభిలాష బలవత్తరమైన దీబంద రులోనే. వీనికి రాజ్యాంగదృష్టి- జీవితదృక్పథము మారినది జాతీయకళాశాలలోని యుధ్యాపకత్వము మూలమున నే. వీనికి ధనసంపాదనమునందు వైముఖ్యమును గలిగించినది యిచ్చటి నిరాడంబర జీవితమూలమున నే. ఇత డచిరకాలములోనే యీ యుద్యోగమునుండి విడివడి దేశసేవచేయుట ప్రారంభించెను, ఇతడు బందరులో పనిచేసినకాల మొక్క- సంవత్సరమే యని చెప్పనొప్పను. అప్పటికి 1919 సం॥రము వచ్చినది.

దేశము మహాసంక్షోభము జెందిన కాలమది. ప్రపంచ యుద్ధ పరిసమాప్తి- దేశమునందల్ల కల్లోలములు- గాంధీ మహాత్ముని నాయకత్వము- పంజాబు దురంతములు- ఖిలా ఫత్తులోని అన్యాయములు- కాంగ్రెస్సుయొక్క- దృక్పథము మారుట- మొదలగు విశేషములు పెక్కు-లు జరిగినవి. గోపాల

కృష్ణుడు బందరులోని యుద్యోగానంతరము చీరాల గ్రామము నకు ప్రవేశించి ఆ గ్రామమునందలి పురపాలకసంఘ వ్యవహార ములలో జోక్యము కలుగజేసికొని ప్రజల యాదరాభిమాన ముల చూరగొనెను. ఈవిషయమంతయు "చీరాలరంగము" అనుప్రకరణములో విపులీకరింతును. ఈ 1921 సం॥నుండియే గోపాలకృష్ణుని ఘనత యాంధ్రలోకమునకు సుబోధకమైనది. ఆంధ్రరాష్ట్రమున కీత డానా డేకైకనాయకుడై దేశమున కాదర్శపురుషు డయ్యెను.

## ఇతని రాజకీయములు.

గోపాలకృష్ణు డాంగ్ల దేశమున నున్నరోజులలో ఎడింబరో యూనివర్సిటీయందలి భారతవిద్యార్థి సంఘకార్యదర్శిగ యాతడు తిలకు మహాశయుడు మాండలే జైలునుండి విడుదలయైన యుత్సవము జరిపించెను. లండనులో 1913 సం॥న శ్రీ గాంధిమహాత్ముని సందర్శించెను. గాంధీ—గోపాలకృష్ణుల ప్రథమ సమావేశము చారిత్రాత్మకమని చెప్పనగు. ఏలయన "యీ గాంధీఋషియే మీ దేశపు భావిపురుషుడు (He is the coming man of your country) అని డాక్టర్ ఆనందకుమారస్వామి యాతనికి ముందుగ నుపదేశించెనట.

1921 లో శ్రీ గాంధీమహాత్ముడు అసహాయోద్యమము నారంభించినప్పుడు గోపాలకృష్ణయ్య "సర్వధర్మాన్

పరిత్యజ్య'' యను గీతానూక్తి ననుసరించి, తన గోష్ఠిధర్మ మును గూడ త్యజించి సంపూర్ణముగ గాంధీ సమరములో దిగిపోయెను. మొట్టమొదట శ్రీ గోపాలకృష్ణయ్య గోష్ఠి సంఘమునకు ప్రభుత్వము చీరాల ప్రాంతమున అరవై యకరముల భూమిని గ్రాంటుగ నొసంగెను. కాని యీసమయము ననే ఆతడు బెజవాడలో శ్రీ గాంధీమహాత్ముని యుపన్యాసము తర్జుమా జేసిన కారణముచే వెంటనే ఆగ్రాంటు రద్దు చేయబడినది. అనహాయోద్యమ మారంభమున కౌన్సిలు బహిష్కారము, స్కూళ్ళ బహిష్కారము, కోర్టుల బహిష్కారము మున్నగు ఉద్యమప్రచారములో శ్రీయుతులు భట్టిప్రోలు సూర్యప్రకాశరావు, రాజా నరసింగరావు మున్నగు కొందరు మిత్రబృందముతో జేరి ఆంధ్రజనులలో గాఢమగు రాజకీయ బీజములను వెదజల్లినవారిలో ప్రప్రథముడు—మన గోపాలకృష్ణయ్య. 1921 లో పొన్నూరులో జరిగిన గుంటూరు మండల సభలో యీతనికి "ఆంధ్రరత్న" మను బిరుద మొసంగబడినది. నాటికిని నేటికిని "ఆంధ్రరత్న" మీతడొక్కడే! 1921 లో భారతావనిలో స్వరాజ్యము స్థాపింప వలయునను శపథమును శ్రీ మహాత్ముడు పూరించగనే మన గోపాలకృష్ణయ్యయిటీవల పెద్దలు సూచించిన "Do or die" అనగా 'యశోవా మృత్యోర్వా' స్థితి నెదుర్కొని శ్రీ గాంధీ

ఋషి నాయకత్వమున, ఆ యేటనే, తనయూరనే, స్వరాజ్యమును సాధించుటయో, లేక శాంతి సమరమున పడసి వీర స్వర్గ మలంకరించుటయో, యను దృఢనిశ్చయమునకువచ్చెను.

## శ్రీ రా మ దం డు.

ఈ రామదండు యుద్దేశ్యములను యాతడిటుల విశదీకరించెను. "రామదండు ఉద్దేశ్యములు రెండు: (అ) నిరంతరము భగవన్నామస్మరణచేయుట; (ఆ) రామకార్యములని అంగీకరింపబడు సమస్త సత్కార్యములకు యిందలి సభ్యులు తమ సర్వస్వమును సమర్పింప సంసిద్ధులై యుండుట."

శ్రీరామదండుయొక్క దీక్షావిధానమునందు భటావళి రూపమున చెంగావిధోవతి, చెంగావిచొక్కా, తలపాగ, కుంకుమతిలకము, రుద్రాక్షమాలికము, అంగవస్త్రము, తామ్రపాత్రి, దండము, తాళపుచిరుతలు, ఒక పచ్చని రెమ్మయు ధరించవలయునని యాతడు విధించెను. ప్రయాణములందొక సంచియు, వంటసామగ్రియు నుండును. పండుగదినములు, దండుశాసనసభచే విధింపబడు యితర దినములును, దీక్షాదినములు. "శ్రీమద్రమారమణ గోవిందోహరిః" "హరహర మహాదేవ" "దశరథ" మున్నగు వాక్యములు దండువాక్యములు. అతిపవిత్రమును, తేజోవంతమును, మహాశక్తియుతము

నగు వజ్రిము (ఇంద్రధనస్సు) దండుధ్వజము. ఇందుపై శ్రీ ఆంజనేయుని ప్రతిమను చిత్రింపవలయును.

ఈ రామదండు విధానమునకు ప్రాతిపదికగ శ్రీగోపాల కృష్ణుడొసంగిన యీదిగువ హెచ్చరిక ఆంధ్రులకు చిరస్మరణీయము.

## శ్రీరామదండు హెచ్చరిక.

శ్లో॥ రామేతి వర్ణద్వయ మాదరేణ
సదాస్మరన్ ముక్తి ముపైతి జంతుః
కలౌయుగే కల్మషమానుషాణాం
అన్యత్ర ధర్మే ఖలు నాధికారః॥

ఆంధ్రదేశమందు గతానుగతికముగ "రామదండు" అను ప్రతిష్ఠాపనము నెలకొల్పబడుచు వచ్చినది. రామశబ్దము శైవ వైష్ణవాది సమస్తమైన యాంధ్రహైందవ సంప్రదాయముల కత్యంతాదరణీయమగుట "రామదం" డను పేరును నిరాక్షేపణీయముగ జేసెను. క్షామసమయములు, అరాజక సమయములు రామదండుయొక్క యుత్పత్తికి కారణము లయ్యెను.

ప్రస్తుతస్థితిగతులలో ధర్మసందేహము లెక్కువగుటయు, దారిద్ర్య మధికమగుటయు, బహునాయకత్వ మేర్పడుటయు,

ప్రజలయం దశాంతి యతిశయించుటయు ముఖ్యముగా గమనింప దగినవి. వీనిని జయించుటకు నిదానము, వివేకము, నిరోధము, ధైర్యము, శౌర్యము, స్థైర్యము, శీలము అత్యవసరములు. అవి సంపాదించుటకు ఆధునికులు స్వార్థజ్ఞానమే (Knowledge of self interest) ప్రబల సాధనమని చెప్పుచున్నారు. ఆర్యసంప్రదాయ మిందుకు భిన్నముగ నిరంతర మీశ్వర సేవాపరాయణత్వమే సాధనమని సిద్ధాంతీకరించియున్నది. స్వార్థజ్ఞాన ముపదేశించి ప్రజల నావేశపూరితుల గావించినచో, అందు బయల్వెడలిన అహంకార విజృంభణము వలన కొంత కార్యసాధన సమకూరునుగాని, అవసరమగుపట్ల జనసమూహమును శాంతుల, ప్రసన్నుల జేయుట మిక్కిలి కష్టమును కొన్ని కొన్ని సందర్భములలో బొత్తుగా వీలుపడకుండుటయు అనుభవైకవేద్యము. రామశబ్దప్రవేశ మైనచో, దృష్టియందు నిలచియున్న స్వార్థపరత ధర్మనిరూపణ మవలంబించును. నాయకు లప్పుడు విశ్వమూర్తియగు మహాజనసమూహమునకు నిగ్రహానుగ్రహములు రెండును ప్రసాదింపగలుగుదురు. తాము రామశబ్దసహాయముచే ప్రయోగోపసంహారములయందు సమర్థత గలవారలగుదురు. అందు ముఖ్యముగ ప్రజలు సమిష్టిగా తమలోక వ్యవహారములను జరుపవలసి వచ్చిన యీరోజులలో రామశబ్దరహిత సమిష్టివ్యవహారము నిష్ప్రయోజనము, అనర్థజనకము, అపాయకరమును అగును.

కావున ప్రజల సంకల్ప సీమల రామభక్తి ప్రవేశపెట్టి నచో, వివేకము గలవారై చిత్తనిరోధము గలవారై, సిశ్చ లులై, శాంతులై కార్యసాధనకు గడంగుదురను విశ్వాస ముతో నీ రామదండేర్పాటు గావింపబడినది.

ఇంచుమించు ఇట్టి యుద్దేశముతోనే, బాలభట సంఘ మను నొక పాశ్చాత్యప్రతిష్ఠాపన మిప్పుడు కొందరు పెద్దలచే నామోదింపబడి మన యనుష్ఠానమునకు విధింపబడినది యను లక్షణము లాంధ్రమహాజనుల కందరికి విదితములే. ఈ రెం డింటికిగల భేదాభేదములు, యోగ్యతా యోగ్యతలను విచా రించినచో మనతత్వమునకు యుక్తమైనది రామదం డనియే తేలగలదు.

"స్కౌటు" అనుపదమునకు 'అన్వేషించువాడు' అని యర్థము. శ్రీరామచంద్రునియొక్క భాగ్యలక్ష్మి, రాజ్యలక్ష్మి, యర్ధాంగలక్ష్మియగు శ్రీ సీతామహాదేవిని అన్వేషించిన వారే రామదండు. కావున పాశ్చాత్య రూపమగు స్కౌటుకు రామ దండను పదమే యోగ్యమైన ప్రాచ్యానురూపము, జాతీయ మును అగుచున్నది. ధర్మాన్వేషణముగావించి ధర్మసంస్థాపన మునకు తోడ్పడవలసినది రామదండనియే సిద్ధాంతమగును.

రామదండు కామధేనువు. ప్రజలవ్యవహారము లన్నిటి యందు నిఖిలపురుషార్థసాధనయందు రామదండు ప్రయోజన

కారిగ నుండును. ధర్మవిషయములు, ఆర్థికవిషయములు, రాజకీయములు, మతసంబంధములు వగైరా అన్నిటియందు రామదండుకు జోక్యము గలుగజేసుకొనుటకు అధికారముకలదు. మహాజనముమీద జరుగవలసిన కార్యములకు ప్రయోగమందే గాక యుపసంహారమందు గూడ శక్తిసామర్థ్యములుండుట ముఖ్యముగా నవసరము. కనుక రామమంత్రి బలిమిచేగాక యింకొక విధముగా వీలులేదు. కావున రామదండు మార్గమే అవసరమని గ్రహింపనగును.

ఆంధ్రమహాజనులు రామదండువిషయము తగు శ్రద్ధ వహించి యుద్ధరింప బూనవలయునని నా ప్రార్థన.

చిత్తగించవలెను,

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య.

ఇట్టిమహదాశయములతో శ్రీగోపాలకృష్ణుడు 1921లో తన రామదండును నెలకొల్పి, ఊరూర ప్రచారము గావించి ది 30–3–21 న బెజవాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు కమిటీకి సుమారొక వేయిమందికి పైగా కల రామదండు స్పెషల్ రైలును తీసికొనివెళ్ళి, అచ్చట సమావేశమైన లక్షలాది జనసమూహమునకు కాంగ్రెసు వాలంటీర్లు సేవచేయ లేనితరి నత్యద్భుతముగ మహాసభ జరిపించి, ప్రజలయొక్కయు మహాత్మగాంధీ, చిత్తరంజనదాసు, ఆలీసోదరులు మున్నగు

నాయకుల యొక్కయు మన్ననలకుపాత్రుడై, అప్పటికేముఖ్య రముగనున్న చీరాలపేరాల రంగమందు అద్వితీయముగు ప్రజాసేవయొనర్చి, నాయకుడని మెప్పువడసెను. దరిమిలా 1924 ఏప్రియల్ నెలలో ఆలమూరులో జరిగిన గోదావరి జిల్లా స్వచ్ఛందసేవక మహాసభయందును, మరుచటినెలలో కొవ్వూరులో జరిగిన రామదండు శిక్షాశిబిరమునందును, కొంత ప్రచారముగావించి, రాష్ట్రకాంగ్రెసు ద్వారా తన రామదండును శాశ్వతసంస్థగ యొనర్ప ప్రయత్నించెను. గోపాలకృష్ణుని మరణానంతరము మహారాష్ట్రనాయకుడగు మూంజీ మహాశయుడు మాత్రము గోపాలకృష్ణుని రామదండును శిరసావహించి, చీరాలయందలి రామనగరువలెనే నాశికా సమీపమున "రామభూమి" ని నెలకొల్పి, అందు యిదు లక్షల రూప్యములతో నొక సైనిక శిక్షణాలయమును స్థాపించి, అచ్చటి విద్యార్థులకు "రామదండీ" లని పేరిడి, తన తంతివిలాసమునకు "రామదండీ-నాశిక" యని నామకరణ మొనర్చి, తా నాధ్యక్ష్యము వహించుచున్న హిందూమహా సభయందలి ఐచ్ఛిక భటవర్గమునకు "రామసేన" యని పేరిడి యిప్పటికిని రామసేవకై యథాశక్తి పాటుబడుచున్నాడు. ఈ సందర్భమున ఆంధ్రులు గోపాలకృష్ణుని యీదిగువ మాటలను మరువకుందురుగాక!

"శిక్కుల అకాలీజట్టులవంటివే మన శ్రీరామదండు... ఆంధ్రమహాజనులీ రామదండు విషయమై తగు శ్రద్ధవహించి, ఉద్ధరింపబూనవలెనని నాప్రార్థన. ఇదితప్ప యింకొక మార్గమున మనము కార్యమును సాధింపగలమనుమాట కల్ల" (ఆల మూరు ఉపన్యాసము)

గోపాలకృష్ణయ్య రామదండునిర్మాణమునకు ముగ్ధులైన యాంధ్రులు పెక్కండ్రు కలరు. వివిధగ్రామములలో రామదండును నిర్మించుటకై ప్రయత్నములు లానాడు జరిగినవి. కొలదిగ్రామములలో రామదండు నిర్మింపబడినది.

ఈవిధానమునుజూచి తూర్పుగోదావరిజిల్లాలోని పెద్దాపురమునందుగూడ నొక పెద్దదండు నిర్మింపబడినది. అందులకు నాయకులుగ నీరచయితయు - మిత్రుడు శ్రీవిరోగి సుబ్బారావుగారునుకలిసి పనిచేసిరి. ఇందు రమారమి అయిదువందలమందిసభ్యు లుండిరి. ఈదండును పెద్దాపురమునుండి కాకినాడకు గొనివచ్చి పురవీధుల నూరేగించి కాకినాడపౌరుల కత్యుత్సాహము నొసంగిరి. నాయకు లాశీర్వదించిరి. అట్లే చామర్లకోట - పెద్దాపురము మొదలగు గ్రామములలో నూరేగించి ప్రజలలో జాతీయభావముల రేకెత్తించిరి. ఈవిధాన మానాటి ప్రచారమున కత్యుత్తమమైనమార్గముగా తోచినది. తన్మూలమున ప్రజలలో రాజకీయదృక్పథము మారినది. బెజ

వాడసభ యుపంతరమున గోపాలకృష్ణయ్య చీరాలగ్రామ మును జేరి 25-4-1921 సం॥రమువఱకు పురపాలక వ్యవహార ములలో బనిచేసెను. కాని గోపాలకృష్ణుని ప్రయత్నము లన్నియు నిష్ఫలములయ్యెను. అందుచే నాతడు ది 25.4.21వ తేదీరాత్రి చీరాలగ్రామవాసులనందరి వెంటబెట్టుకొని గ్రామ బహిష్కారముచు గావించెను. సెప్టెంబరు నెలవరకును చీరాల పౌరులతో గ్రామాంతరసీమల కష్టసుఖముల పాల్గొనుచుం డెను. ఇట్లుండగా సెప్టెంబరులో బరంపురమునందు అంధ్ర మహాజనసభయు, అంధ్రరాష్ట్రీయసభయు జరిగినవి. ఆసభల కీతనిని యధ్యక్షునిగా రావలసినదని సన్మానసంఘమువారు కోరుటచే నీత డంగీకరించి బరంపురమునకు పయనమయ్యెను. కాని బరంపురములో నాడు మండలాధికారిగ Ruther ford పనిచేయుచుండెను ఇతడు చండశాసనుడని వదంతి. గోపాల కృష్ణయ్య బరంపురము చేరగానే యీమండలాధికారి అనగా (District Collector) ఆతనిని యుపన్యసింపగూడదని యుత్తరువుచేసెను. అందుచే మండలాధికారి యాజ్ఞలద్రోసి పుచ్చి శాసనోల్లంఘనము చేయ నిశ్చయించుకొని గోపాలకృష్ణు డాసభలో గంభీరోపన్యాసముగావించెను. అందులకై యాతడు పోలీసు వారిచే పట్టుకొనబడెను ఒకయేడాదినిడి ఖైదు(Simple-Imprisonment) విధింపబడెను. పిదప బందరుజిల్లా మేజ

స్త్రీలు తిరిగి రాజద్రోహమున తాతని విచారించి తొమ్మిది మాసములు శిక్షవిధించిరి. ఈ రెండు శిక్షల నొకేసారి అనుభ వించి 1922 అక్టోబరు 2 వ తేదీని తిరుచునాపల్లిజైలునుండి విముక్తుడయ్యెను.

1922 నవంబరు, డిశెంబరు నెలలలో యాత డాంధ్రి దేశమందలి పలుచోట్ల పర్యటనమొనర్చి యిటు తన సేవిన బ్రాహ్మణధర్మపరిబోధమును, అటు శ్రీగాంధీమహాత్ముని కారా గారవాసముతో మందగమనము నొందిన కాంగ్రెస్సోద్యమ మును తిరిగి తనశక్తికొలది ప్రోత్సహించి, ఖాళీయైన కాం గ్రెసు బొక్కసములను తన "మాటపదహార్ల"తో కొంతవరకు నింపి, ఆసంవత్సరాంతమున గయలో దేశబంధుదాసుగారి అధ్యక్షతక్రింద జరిగిన కాంగ్రెసు మహాసభకు సతీసమేతుడై వెడలెను.

ఈ వైఖరిలో యాతడు సంపూర్ణముగ చిత్తరంజనుని స్వరాజ్యోద్యమమునకు విరుద్ధభావముబూని, గాంధీమహాత్ముని యడుగుజాడలలో నేతృత్వము వహించిన శ్రీమాన్ రాజ గోపాలాచారి ప్రభృతులతో జేరి సంపూర్ణముగ "నో ఛేంజి" పక్షమునకే తనబలమునంతను ధారబోసెను. కాని మరుచటి నెలలో నాతడు కాశీకిబోయి అటనుండి తిరిగివచ్చుచు రాజ మహేంద్రవరమందొక పత్రికావిలేఖరి కొసంగిన యీక్రింది

భావము లాతని నిజాభీష్టములను కొంతవరకు తెలుపుననుటకు సందియము లేదు.

"గయా కాంగ్రెసు సారాంశములు శ్రీ గాంధీమహాత్ముని యెడ నద్వితీయమగు విశ్వాసప్రకటన మాత్రమే అయియున్నవి. సి. ఆర్. దాసుగారి రాజీయత్నము లెంతనిష్ప్రయోజనములో, రాజగోపాలాచారిగారి శాసనోల్లంఘనయత్నములు నంత అనుచితములే. గయా కాంగ్రెసు తీర్మానమునందలి శాసనోల్లంఘనా భాగము కేవల లాంఛనముగ మాత్రమే అంగీకరింపబడినది. అందు స్పష్టీకరణమేమియు లేదు. శ్రీమాన్ ఆచార్యులవారు ధనము, వాలంటీర్లు కావలెనని కోరిరేకాని, వీనితో యేమిచేయ నెంచిరో, ఎందుకు కావలెనో తన నిజోద్దేశముల నెఱుక పరచలేదు. ఇందు కాతని సంశయాత్మ కారణమా? లేక అదొక లేక్యమా? ... ఈ యాలోచనలకన్నిటికిని ముందుముందు చాల సావకాశ మున్నదని యాతడు చెప్పెను. అన్నిటికిని "శ్రీ గాంధీ ఉవాచ" మంత్రము మనలను తృప్తిపరచినది. కాని అసలు బురదలో దిగవలసిన మాబోంట్లకుమాత్రము యీవిషయమై యింకను సందేహాస్పదముగనే యున్నది... ...అందుచే శాసనోల్లంఘన విషయమై మనము విశేషముగ యోచింపనవసరము లేదు. ధన, జనములను సేకరించుటలో మన మీశాసనోల్లంఘన

గూర్చి తలపెట్టకూడదు. ఏప్రియల్ నెలాఖరున ఎ. ఐ. సి. సి. కాని, వర్కింగ్ కమిటీకాని, శాసనోల్లంఘన మవసరమని తీర్మానించినను, ఆంధ్రదేశమం దీవిషయమై మనఅంగీకార అనంగీకారములను తెలుపుటకు ప్రత్యేకరాష్ట్రీయసభ జరుపుట అవసరము. ఏలయన యీవరికరములు రెండును మనకు లభించినను, నిర్మాణకార్యక్రమము సంపూర్తికామిచే శాననోల్లంఘనమునకు మనమింకను అనంసిద్ధులమే యగుదుము. శాసనోల్లంఘనమే శాసనోల్లంఘనకు తోవజూపుననుసూత్రమును నేనంగీకరింపజాలను.”

ది 10—7—1923 న నాగపురమందు కూడిన అఖిల భారతకాంగ్రెసు కమిటీసమావేశములో ఆంధ్రరత్నము కాంగ్రెసు ప్రధానకార్యదర్శియై కార్యాలయమును విజయవాడకు మార్పించెను. ఆంధ్రదేశమున కాంగ్రెసు ప్రధాన కార్యాలయ మవతరించుట గత యేబదియేండ్లలో నదియే మొదటి సారి, అదియే ఆఖరుసారికూడను. గోపాలకృష్ణుని కార్యదర్శిత్వములు ఢిల్లీలో అవసర కాంగ్రెసు సమావేశమును, కాకినాడలో మామూలు మహాసభయు జరిగినవి. రెండును దిగ్విజయములే. అందు ముఖ్యముగ దేశమందు అప్పటిలో ప్రబలిన స్వరాజిస్టు—‘నో ఛేంజి’ కలతలు సమసిపోయి కాంగ్రెసు వాదులలో తిరిగి సఖ్యత యేర్పరచుటకే ఢిల్లీసభ జరుపబడి

వది. ఆసభకు మౌలానా అబ్దుల్ కలామ్ అజాద్ గా రధ్యక్షుడు
వదో యొక పథకముతో సఖ్యత యేర్పడెను. ఆ పథకము
కాకినాడలో 1923 వ సం॥రమున జరుపబడిన 38 వ కాంగ్రెసు
మౌలానా మహమదల్లీగారి అధ్యక్షత క్రింద ధృవపరచెను.
ఇతరవిషయములందును ఆంధ్రరత్న మితరులకుతీసిపోయినవాడు
కాడు. మహావైభవముతో రాజకీవి, లాంఛనములతో,
కార్యాలయమును, సిబ్బందిని నడుపుచు, వివిధరాష్ట్రములకు
పోవుచు, అందరమెప్పును బడయుచు, తన విధ్యుక్తధర్మము
నద్వితీయముగ నడిపించుకొనుచువచ్చెను.

ఆరోజులలో కాంగ్రెసులో నొక ఆచారముండెడిది.
కాంగ్రెసుయొక్క ముగ్గురు కార్యదర్శులలో నొక్కరను
కాంగ్రెసు మహాసభ జరిగిన రాష్ట్రమునుండి యెన్నుకొనవలె
నని సాంప్రదాయము. కాంగ్రెసు ఆంధ్రదేశమందు జరుగ
నున్నది. గోపాలకృష్ణు డదివరకే కాంగ్రెసు ప్రధానియై యుం
డెను. ఆతని ఆధ్వర్యము ప్రజానురంజకముగను, బలిష్ఠముగను
కాంగ్రెసు ఉద్యమమునకు మిగుల ప్రోత్సాహకరముగ నుం
డెను. అందు ముఖ్యముగ గాంధీమహాత్ముని నిర్మాణకార్య
క్రమమందే యాతడు విశేషదీక్షను బ్రకటించెను. ఆ కార్య
క్రమమందలి జాత్యైక్యత, అస్పృశ్యతానివారణ, ముఖ్యభాగ
ములని అంతకుముందు ఆంధ్రదేశములో దెల్పిన యంశము

లనే బొంబాయి యందును అహమ్మదాబాదు, ఢిల్లీ, లాహో
రు లందును యాతడు ప్రచార మొనర్చి, వేలవను, సన్మాన
మునుకొనుచున్న కాంగ్రెసు నిర్మాణకార్యక్రమమునకు పటి
మయు, గాంభీర్యమును, రసజ్ఞతయు, శక్తిసామర్థ్యముల
నొసంగుట కాతడు ప్రయత్నించెను.

"ఈజాతియంతయు నొక్కటి కావలసినదే. ఇందుకు
వలయు మూలసూత్రమును మనము న్వేషింపవలయును. ఇదొక
మహాత్కార్యము... కాంగ్రెసు నిర్మాణ కార్య క్రమమందు
జాత్యైకత, అస్పృశ్యతానివారణ, యీ రెండే ప్రధానవిషయ
ములు... ఈ జాతిలో యేకత్వమును సాధించుటకు లోగడ
గురునానకు, అక్బర్ బాదుషాలు యత్నించిరి. వారి యత్న
ములకు మించిన కార్యమునే మనమిప్పుడు సాధించవలసి
యున్నది. అంతకు తక్కువ కార్యము మనకు వలదు. శ్రీగాంధీ
ఋషియొక్క ఋణమును జాత్యైక్యతవలననే మనము తీర్చు
కొనగలుగుదుము. ఇది యెంతకష్టమైనను సరే. అందరును తక్ష
ణమే యోచించి, యెట్టి సంశయమును లేకుండా, మనము
కార్యదీక్ష బూనవలెను... హైందవులు, అల్లాను తమ అవ
తారపరంపరలో జేర్చుకొనవలెను. ఖురానును తమ పురాణము
లందు జేర్చవలెను. ముసల్మానులును తమ హైందవాద్వైత
సంఘమందలి అంతర్భాగములుగ భావించవలెను. అటులనే

మునల్మానులును హైందవులు తమ విశ్వమానవ సౌభ్రాతృత్వమునకు నూతన ఔరసులుగ నంగీకరింపవలెను. ఇండియా విపత్తు నుద్ఘోషించి, కాంగ్రెసు మన మహాలానాలను, పండితులను పిలచి, "ఓ అయ్యలారా! మన దేశము నీవిపత్తునుండి తప్పించుటకు పలయు సాంఘిక, మత, సమన్వయమును మీరు సిద్ధపరచవలెను... సర్వమానవాద్వైతమే మన దేశమున కిప్పుడు శరణ్యము...ఇప్పుడందఱు నట్టియేకత్వమునే ఆరాధించవలెను. ఇందుకవసరమగు సంస్కారమును మనమిప్పుడు కావించనగు. ఇందుకు కాలము పరిపక్వమైనది. మిగత పనులన్నియు నట్టిసమ్మిప్రియము లే యని 1923 నవంబరులో నీతడు ప్రకటించెను.

"ఈ మహావిప్లవమును కాంగ్రెసు సాధించక తప్పదు. మన సంఘమును బంధించి అణచిపెట్టు బంధనముల నీవిధముగ ఛేదించి ఆత్మకు ముక్తినొసంగినచో, తద్వారా మనకు సంక్రమించు స్వాతంత్రిశక్తుల ప్రథమ వెల్లువలో నెట్టి అహంకార సామ్రాజ్యములైనను కొట్టుకొనిపోక తప్పదు. అప్పుడే తిరిగి యీభూమి స్వర్గతుల్యము కాగలదు" (1928 డిశెంబరు)

కాని, నాడింకను మన ఆంధ్రదేశమందు పలయునంత సహనశక్తిలేదు. ఒక యువకరత్నము ముందుకు పోవుచుండుట పెద్దలకు ప్రాణసంకటమైపోయెను. గోపాలకృష్ణుడు కాం

THE READING ROOM

గ్రెసు పనిమీద దూరస్థ పాంచాలమందున్న సమయమున, 1923 నవంబరులో కాకినాడలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసభ జరిగెను. అచ్చటనే అఖిలభారత కాంగ్రెసు యెన్నికలు జరిగినవి. ఆ యెన్నికలలో గోపాలకృష్ణుడు తిరిగి భారత కాంగ్రెసు సభ్యుడు కాకుండ మంత్రాంగము జరిగెను. అందుచే డిశెంబరు నెలాఖరున కాకినాడలో జరిగిన కాంగ్రెసు సభనాటి గోపాలకృష్ణుడఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యుడే కాడు! సభ్యత్వమే లేనివాని కిక కార్యదర్శిత్వ మెక్కడ? పోనీ, ఆతని త్రోసివేసిన మహానీయులు తామైనను సాంప్రదాయ సిద్ధముగ తమ రాష్ట్రమునకు రావలసిన పదవిని సంపాదించుకొని, బెజవాడయందలి కార్యాలయమును సుస్థిరమొనర్చుకొన గలిగిరా? లేదు. అందుచేతనే కాకినాడ కాంగ్రెసు అనంతరము గోపాలకృష్ణుడు పత్రికావిలేఖరులతో యీవిధముగ తన హృదయవేదనను బ్రకటించుకొనెను.

“ఇంకొక గొడ్డుసంవత్సరము మనల నెదుర్కొనుచున్నది ... నాబోంట్ల కింకను కాంగ్రెసులో స్థానమున్నటుల తోచదు. తొందరవలదు. అనేక సంవత్సరములనుండి ఆచారముగ వచ్చుచున్న కాంగ్రెసు కార్యదర్శిత్వము నాకు రాకుండ జేసిన ఆంధ్రకాంగ్రెసువాదుల కుతంత్రములను నేను ఖండించుటలేదు ... కాని నా అహంకారమును మీరు కొంచెము

ఘటించినచో నాబోటివారును రంగస్థలమునకు లాగుటకు తగిన పరిస్థితి దేశమందింకను యేర్పడలేదనుకొంటిని. బహుశః యేదూరస్థ దేశమునుండియో, యెవ్వరైన, ఏమహోద్యమమునైన, ప్రారంభించువరకు అట్టిస్థితి సంక్రమించదు కాబోలు! ఇంతకును నేను రాజకీయములందు చేరుటయే పొరబాటేమో? కావున త్వరలో నే నజ్ఞాతవాసము చేయుచుంటిని. అచ్చటనే నాకానందము చేకూరును. అందును నా శరీరమునకు ఆవశ్యకమగు విశ్రాంతియు, మానసికోల్లాసమును, ఎలయు జీవనోపాధియు కలుగగలవని ఆశించుచున్నాను."

కాకినాడ కాంగ్రెసువిమ్మట 1924–26 లలో గోపాలకృష్ణుడాంధ్రదేశమందలి పమిడిపాడులో ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకును, ఆలమూరులో గోదావరిజిల్లా స్వచ్ఛందసేవాదళ సభకును, మాడుగులలో విశాఖపట్టణజిల్లా మహాసభకును అధ్యక్షత వహించెను. 1926 లో గుంటూరు మండల సభకు సన్మానసంఘమున కధ్యక్షుడయ్యెను. నెల్లూరు చిన్నపురి, బెజవాడ, బందరు, రాజోలు, అమలాపురం మున్నగు స్థలములందు సంచారమొనర్చి, కొంతకాలము ఆంధ్రస్వరాజపార్టీ యొక్కయు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము యొక్కయు కార్యదర్శిత్వమును వహించి యథాశక్తి రాజకీయములందు పాల్గొనెను. ఈకాలమందే 'సాధన' యను

నొక ఆంగ్ల వారపత్రికనుగూడ యాతడు ప్రారంభించెను. కాని దేశదౌర్భాగ్యమో, కాలపరిపక్వము కామియో అది యచిర కాలమునకే ఆగిపోయెను. ఇంతలో శరీరరుగ్మత అతిశయించి, 1926 జూన్ నాటికి యాతడు క్షయగ్రస్తుడని Lt. Col. శాస్త్రి గారు నిర్ణయించిరి. మరి రెండేండ్లలో ది 10—6—1928 న యాతడు గుంటూరులో దివంగతుడయ్యెను. ఆమరుచటిదినమున చీరాలపేరాలలో రామనగరుననతని కగ్నిసంస్కారము జరిగెను.

39 సం॥ము జీవితములో గోపాలకృష్ణుడు మంచి రాజకీయ పరిజ్ఞానమును సంపాదించి యాంధ్రుల నడిపింపగల నాయకుడై విరాజిల్లినాడు. ఇతని రాజకీయజీవితములో భిన్నాభిప్రాయముల పెట్టుకొని వర్తింపలేదు. తాను మొదటినుండియు నేసంస్థను నమ్మెనో ఆసంస్థకే తనజీవితసర్వస్వమును ధారవోసెను. గాంధీ మహాత్ముని యాశీర్వచనముల నందగలిగెను. ఆంధ్రరాష్ట్ర ప్రజలలో నద్వితీయుడని పేరొందగలిగెను. మూల్యయుతములైన నవరత్నముల మించిన ఆంధ్రరత్న మమూల్యముగదా!

## ఇతని సందేశములు.

“శ్రీమద్రమారమణ గోవిందో హరిః”

“గంజాంజిల్లా మేజిస్ట్రేటుగారగు టి. జి. రూథర్ ఫర్డు గారికి”

" రామదాసు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అనేక ఆశీర్వచనములు "

"మీరు 28 వ తేదీన నాకంపిన శ్రీముఖము సంతోషముగ గైకొంటిని. అందలి మీ కోర్కెను నెఱవేర్ప బ్రయత్నించితినిగాని యనుల్లంఘనీయమగు శ్రీరామాజ్ఞానువర్తినై నేటి సాయంత్రము శ్రీరామచంద్రుని ప్రత్యక్షస్వరూపమనదగు నాంధ్రమహాజన సమక్షమున నుపన్యసింపనెంచితినినని మీకు తెలియజేయుచున్నాను.

ఇట్లు,

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య."

తనయునంగు చీరాలపేరాలవాసుల కాత డొసంగిన సందేశ మిట్లున్నది.

"శ్రీమద్రమారమణ గోవిందోహరిః"

"చీరాలపేరాల గ్రామ మహాజనములకు రామదాసు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అనేక గాఢాలింగనములు గావించి వ్రాయున దేమనగా:—

"మనకు సంజీవియాచింప నాంధ్రదేశ సంచారము గావించుచు బ్రహ్మపురమువచ్చియుంటిని. ఇచ్చటి జిల్లామేజస్ట్రేటగు టి. జి. రూథర్ ఫర్డుగారు ౧౪౪ వ సెక్షను ప్రకారము నాకు వాగ్బంధనము విధించిరి. అందుల కియ్యకొనుట సత్వర

స్వారాజ్యలబ్ధికి ప్రతిబంధకమనియు, ఆంధ్రి యశశ్చంద్రునకు కళంక మాపాదించుననియు మనము గావించుచున్న మహా యజ్ఞమునకు భంగకరమనియు, తదుల్లంఘనము దేశీయమహా సభా శాసనానుసారము గాకపోయినను తదాదర్శములకు బ్రిధానపోషకమనియు, వీరపురుషోచితమనియు, శ్రీరామాజ్ఞ యైనందున నయ్యది శిరసావహించి బ్రిహ్మపురమునుండి శ్రీకృష్ణ జన్మస్థానమున కేగుచున్నాను."

"ఇంతవరకు భవదీయ సేవాపరాయణుండనై ధన్యుండనై తిని. ఇకముందు శ్రీరామరాజ్యస్థాపన యెన్నడుజరుగును? తిరిగి తమసేవ యెన్నడు లభించును? అని నిరంతర మాపురుషోత్తముని చరణకమలముల భజించుచుండెదను. శ్రీగాంధీ గురూత్తముని చరణారవిందములు హృత్పీఠమునధరించి సత్వర స్వారాజ్యమంత్ర జపమున కాలము గడపుచుండెదను. అమ్మహా మహుని యాదేశము నప్రతిహతముగ, నిర్వివాదముగ, నిష్కళంకముగ, నిశ్చలమనస్కులై, కొనసాగించెదరుగాక! యని మీకు సాష్టాంగప్రణామ పురస్సరముగ విన్నవించుకొను చున్నాను. మనకిప్పుడు ప్రతికక్షులుగ కనుపించుచున్న ప్రభుత్వమువారు మన స్వారాజ్యవ్రతదీక్షను బరీక్షింప నేతెంచిన ధర్మదేవతలో యన భావించి, వారియెడ యణుమాత్రమును ద్వేషభావమూనక, శ్రీమద్భాగవతమునందు గజేంద్రుని మార్గము—అనగా;

పాదద్వంద్వము నేలమోపి, పవనున్ బంధించి, పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి, బుద్ధిలతికన్ మారాకుహత్తించి, ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనగతిన్ క్రీడించు యోగీంద్రుమర్యాదన్.

పాటించి, నిష్కామకృతిని, శాంతచిత్తులరై, మన
మహోద్యమమును కొనసాగింతురుగాక! మన యుద్యమోద్యా
పన సమీపించు శుభసూచనలు కాన్పించుచున్నవి. అందు
ప్రధానమైనది నాకు లభ్యమైన వాగ్బంధనవిధియే. సత్వర
ముగ మనకు విజయము చేకూరనున్నది. కావున నీసమయ
మున మనవ్రతమునందు శ్రీహరిశ్చంద్రుని పుత్రవియోగ
కళత్ర సంహారాది సమయమునుబోలిన పుష్కరసమయముగ
భావింపవలయును. ఇప్పుడేకడుంగడు జాగరూకతతో సంచ
రింపవలెననియు, అణుమాత్ర మనుమానించిన వ్రతహానియు,
కీర్తిహానియు, స్వరాజ్యోద్యమ ధ్వంసమును పరిణమించి, అధో
గతిపాలై, ఆచంద్రార్కమవాచ్యమగు దుఃఖపరంపర ననుభ
వింపవలసివచ్చుననియు, స్పష్టముగ నెఱుంగునది. అప్పుడే
ప్రభుత్వ మంత్రివర్గముగావించు మాయోపాయములలో ప్రధా
నమైనది 'మీ దేశత్యాగమునువీడి గ్రామములోనికి వచ్చినచో
మీ మునిసిపాలిటీ రద్దుజేసెదము. రేపల్లె మ్యునిసిపాలిటీని
రద్దుజేయుట ఆప్రజలు గ్రామమును విసర్జింపకుండు కారణము
ననే', అని హెచ్చరికలు తమచారులచేత తీవ్రముగ వ్యాప్తి
జేయుటయే. దీనివల్ల నేమాత్రమును మోసపోకుడని పదేపదే

హెచ్చరించుచున్నాను. మహాపతివ్రతాతల్లజయగు శ్రీసావిత్రీ దేవిచరిత్రము ను గమనింపుడు, భర్తృప్రాణముల నిమిత్తము యమధర్మరాజుతో నసహాయోద్యమమార్గ మవలంబించి వెంబడించినపుడు ప్రథమమున లభించు వరము తన యత్త మామల నేత్రప్రదానము, పిమ్మట తల్లిదండ్రుల రాజ్యప్రాప్తి, ఆఖరునగాని తన భర్తృప్రాణములు లభింపలేదు. అటువలెనే మనయుద్యమముగూడ మన ప్రయత్నానుబంధమగు రేపల్లె వ్యవహారము ప్రథమమున జయముగాంచుటయు పిమ్మట నింకెన్నియో వాంఛితములుగూడ సిద్ధించుటయు, మనవ్యవహారము కేవలము కుటుంబకలహముగ ప్రారంభమై కురుక్షేత్ర వ్యవహారముగ బరిణమించుటజూడ, స్వరాజ్యప్రాప్తిగూడ ముందు కలుగుటయు, అనంతరమే మన మ్యునిసిపాలిటీ రద్దగుటయు సంభవించునని మీరు గ్రహింతురుగాక. చిత్తము శ్రీరామపాదములందు జేర్చి, నిరంతరదీక్షా పరతంత్రులై, ఆంధ్ర మహాజనులయొక్కయు, యావద్భారతసంతానముయొక్కయు ప్రతిజ్ఞ నిర్వహించిరను భాగ్యము సర్వేశ్వరుడు మీకు బ్రసాదించుగాక! యని నిరంతరము ప్రార్థించుచున్నాను. వ్యవహార సందర్భమున కొందఱియెడ కాఠిన్యమును, కొందఱియెడ దాక్షిణ్యమును, వహించి వర్తించితిని. ఇంకను నాకు మనోగతములుకాని లోపము లనేకము కాన్పించి యుండియుందును.

చీరాలపేరాలవాసు లాబాలగోపాలము నన్ను మన్నింతురు గాక! మీచరణకమలముల కిదియే ప్రణామము. తిరిగి యనేక గాఢాలింగనములు. నేను కారాగృహమందున్నను, తమ సమ క్షమున నున్నటులనే భావించి సర్వకార్యములు జయప్రద ముగ నిర్వహించెదరుగాక! ఆంధ్రమహాజనులు, అఖిలభారతీ యులు, గాంధీమహాత్ముడు, శ్రీరామచంద్రుడు, సర్వదా మిమ్ము గాపాడుగాక!

"స్వస్తి ప్రజాభ్యః... ...

ఇట్లు,

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య."

బరంపురములో గోపాలకృష్ణునకు శిక్ష విధించి తిన్నగ తిరుచునాపల్లి చెరసాలకు తీసుకొని పోయిరి. మొదట కొన్ని దినములు "Quorantine" కొరంటైనులోనుండి అచ్చటి పరీక్షలు పూర్తియైన పిమ్మట పెద్దచెరలో పెట్టబడి శిక్ష ననుభవించుట ప్రారంభించెను. ప్రారంభమున చెరసాల బహు బాధాకరముగను హేయముగను ఉండును. క్రమక్రమముగ నది యలవాటై సరిపోవుచుండును.

1921—22 సంllరముల యందలి చెరసాలలోని యనుభవములు వేరు. 1930 సంllరము నందలి చెరసాలలోని యనుభవములు వేరు. 1921—22 సంllరముల నాటి చెరలో విడి

ఖైదు. (Simple Imprisonment) కఠిన పటిశిక్ష (Rigorus Imprisonment) అను రెండు విధముల విభజనము చేయుబడెడిది. చెరలో పెట్టబడినవారిలో న్యూనాధిక్యతలు లేవు. అందుచే నెట్టివారికైన సమానమైన శ్రమయుండెడిది. ఎంతటి నాయకుడైన శ్రమలంది తీరవలసినదే. పురుగులతో కలసిన పులుసు అన్నముద్ద. తప్పతినుట కితరము లేదు. తిన కున్న నేరము. అందులకు శిక్ష. తిన్నచో పురుగులకూడు.

ప్రతిదినమునను పురుగులుండి తీరును. కారణము ప్రతి దినము పులుసు కాచుదురు. ఇది కాచి తీరవలసిన ముఖ్య పదార్థము. ఇందే కందిపప్పు. కాయగూరలు. ఆకుకూరలు. ఉల్లిపాయలు మొదలగు సర్వపదార్థములు వేసి తీరవలెను. ఈ సామానుల నిచ్చు యజమాని డెప్యూటీ జెయిలరు. ప్రతి జెయిలునకు అంటిపెట్టుకొని కొంత వ్యవసాయపు భూమియుండును. అందులో నిత్యము వంటకు పనికివచ్చు తోటకూర. దొగ్గలికూర. గోంగూర. మొదలగు ఆకుకూరలవేసి పెంచుదురు. ఈ పెరిగిన మొక్కలు మూడు నాలుగు మోపులు తెచ్చి నాలుగు ముక్కలకింద తరిగి పులుసులో పడవేయుదురు. ఈ ఆకుకూర మొక్కల కంటిబెట్టుకొనియున్న చిమ్మెటలు. పురుగులు. గొంగళీలు. యావత్తు నహేంద్రతక్షకాయ స్వాహాయన్నట్లు పులుసుకాగులలోబడి ఉడికిపోవును. ఈ ఆకు

కూరలు కొనిఇట్లో- కొంటే ఖర్చుపెసి డెప్యూటీజెయి లరు ధనవంతుడగుదురు. ఇట్లు కాచిన పులుసు అందఱు ఖైదీ లకు తలకొక పాఁడికట్టు చొప్పున పోయుదురు. అందు కనీ నము రెండుమూడు పురుగులుండి తీరును. ఇట్టి దౌర్భాగ్యము నకు జెయిళ్ళు పుట్టినిళ్ళు. ఇట్టి తిండి 1921—22 సం॥రములలో కారాగారములకు వెడలినవారి కందర కనుభవములోనిదే. ఈ రచయితకూడ 1922—28 స॥రములలో రాజమహేంద్రి వరమునందలి చెరసాలలో నిట్టి మనుభవమునే ఒక్క- నంవత్స రము పొందియున్నాడు.

ఆంధ్రరత్నముకూడ తిరుచునాపల్లి చెరలో నిట్టిబాధల నొంది 2—10—1922 స॥ తేదీని విడుదలయైనాడు.

కారాగారముంబడి శిక్షలనందిన వారలలో బెక్కండ్రకు సంపూర్ణారోగ్యము లుచెడి రుగ్మతశరీరులై వానివలన సకలబాధలనంది- ఆరోగ్యమునేగాక- ఐశ్వర్యమును- ఆనంద మునుగూడ గోల్పోయి. ఎచ్చటనో- ఏదుగ్రామములోనో- గ్రామవాసములకు- మోముపాచి దుర్మరణముపాలైన దేశ సేవా వరాయణులు పెక్కండాంధ్రభూమియందు కలరు. ఆంధ్రరత్న మవసానకాలమున నిట్టి బాధల గొన్నింటి బొం దియే కన్ను మూసెను. కారాగార వాసములలోని జీవితవిశేష మిదియే స్వప్రయోజనార్థమైగాక- దేశసేవాభిలాషతో శ్రమ

[illegible] సుదతి నివిని పొరుగని సువర్ణరణములకు గురి
యైన- దేశభక్తి పరాయణుల కష్టోర్పణములగాక వేరొక
నిజముగలిగిన దేది. అట్టి ధన్యజీవులకు- ధన్యవాదములు.

## చీరాలపేరాల యుద్ధము.

యుద్ధమన ప్రజలు సంభ్రాంతులగుదురు. చీరాలపేరాల
గ్రామములలో యుద్ధమా? ఎప్పుడు? కారణము లేమి? ఉభయ
పక్షము లేవి? సైన్యాధికారు లెవ్వరు? ఇత్యాది ప్రశ్నములు
వందలాదిగ బయలుదేరును.

కాని యుద్ధమన మారణహోమతంత్రాన్విత విధ్వం
స కృత్యము కాదు- వృకశునక సృగాలాదులు కాకఘూక
గృధ్రాదులకు పండుగ చేయు పీనుగ పెంట లుండవచట- భీకర
కఠోరఖడ్గ ధారాహతి మూలమున విఖండిత కళేబరాదులు ప్రేల్చి
తుత్రుళ్ళింతలాడు రుధిరార్ద్రభూమి కాదది.

ఇట తుపాకులుండవు- మరఫిరంగులు లేవు- మందుగుం
డ్లక్కర లేదు. యుద్ధసమయము యుద్ధవిరామ సమయములు
అవసరం లేదు. భూగర్భాంతరగాములు, ఆకాశపథాంతర్గా
ములు [illegible]గి యుండనక్కర లేదు. జయాపజయము లిటనున్న
ఇక యుద్ధ[illegible]మన నేమి? యుద్ధభూమి కురుక్షేత్రము. ఈయుద్ధము
ధర్మయుద్ధము. ఇందు దౌర్జన్యరాహిత్యతత్వం. మహాత్మమంత్రి

జపము. దీనికి సత్యాగ్రహమే నారాయణాస్త్రము. దిక్కులేక దీనులై - అనాధలగు నిరుపేద బానిససంఘములే స్వాతంత్ర్య నినాదములతో ధర్మపతాక ప్రతిష్ఠాభిలాషులగు సత్యాగ్రహ సమరవాహినులు. రాజగౌరవ ప్రతిష్ఠాపకులే ప్రతిపక్షులు.

ఇట ప్రతిష్ఠాపనమే- యుద్ధము- గౌరవమే- యుద్ధకారణము- రాజు- ప్రజ యివియే యుభయపక్షములు.

ఈ పోరాటమునకు విధివిరామములు లేవు. సమయాసమయములు లేవు. జయాపజయములు లేవు.

ప్రజాపక్షమునకే జయము.సత్యము-నిత్యము-ధర్మము. ఈసూత్రములపైన నడుపబడినదే చీరాలపేరాల యుద్ధము. దీనినిగూర్చి శ్రీ గుమ్మడిదల సుబ్బారావుగారీక్రిందిరీతిని రచించి యున్నారు.

చీరాల పేరాల గ్రామములు ఆంధ్రసముద్రమునకు నాలుగుమైళ్ళలోనున్న రెండు చిన్నగ్రామములు. ఇవి యొకటితోనొకటి కలిసియుండును. ఈగ్రామములకు చేరువలో జాండ్రపేట, పాతచీరాల, వీరరాఘవపేట యను గ్రామములు కూడ కలవు. ఈ మైదూళ్ళజనాభా మొత్తంమీద 18 వేలుండెడిది—దాదాపు 25 యేండ్లక్రిందటి విషయము. చీరాల పేరాల గ్రామములను ప్రభుత్వమువారు గుంటూరు జిల్లాబోర్డు యాధీనమున నొక యూనియను గావించిరి. ఈ యూనియను

వారే గ్రామములందలి బజులు, దీపములు, ఆరోగ్యము పరి పాలించుచుండిరి. యూనియనుకు సాలుకి నాలుగువేల రూప్య ముల పన్నువసూలయ్యేడిది. చీరాలలోని మిషన్ ఆస్పత్రి; లోకల్ ఫండ్ ఆస్పత్రులవల్ల వైద్యవిషయమును, గ్రామీ యులు నెలకొల్పుకొన్న ప్రైవేటుబడులవల్ల విద్యాసమస్యయు, జిల్లాబోర్డుసహాయముచే రోడ్లును, కొంతవరకు కడతేరుచు, మితవ్యయముతో గ్రామపాలనా వ్యవహారమంతయు సుళు వుగా సాగుచుండెడిది.

ఇట్లుండగా 1914 లో గుంటూరుజిల్లాలో ప్లేగుజాడ్య ముబయలుదేరి, చీరాలకుగూడ వ్యాపించి, కొలదిగ ప్రాణ నష్టము గల్గించెను. తత్కారణమున ఆరోగ్యశాఖాధికారి సలహా ననుసరించి ప్రభుత్వము చీరాల, పేరాల, పాతచీరాల, వీరరాఘవపేట, జాండ్రపేటల నొకటిగ జేర్చి మునిసిపాలిటీ నేర్పరుప నుద్దేశించిరి. 1915 లో జిల్లాకలెక్టరు చీరాలకు ముని సిపాలిటి అక్కరలేదని అభిప్రాయ మొసగెను. యూనియను మునిసిపాలిటిగ మార్చినచో పన్నులభార మతిశయించి, నాలు గువేలనుండి నలభైవేలు యిర్నాలు కావలసివచ్చును; వ్యయ ము రెండువేలనుండి యిరవైవేలవరకు పెరుగును. అచ్చట నివ సించు జనులలో అసంఖ్యాకులు బీదవారు. వారి యిండ్లు చాల వరకు పూరిపాకలేకాని, ఆరోజులలో పెద్దభవనములు లేవు.

బావులలో నెచ్చటజూచినను బారెడులోతులో మంచినీరు
లభ్యమగుచుండుటచేత యిచ్చట నీటికొరాయ లనవసరము.
ఊరంతయు యిసుకమయమగుటచే, మురికికాలవ కట్టుపను
లును, ఊరచుట్టు నెచ్చటజూచినను విశాలమగు ఖాళీస్థలము
లును, జీడిమామిడితోటలు నుండుటచే పాకీవనివాండ్రుకూడ
నెక్కుడవసరము లేదు. ఈ పరిస్థితులలో తమకు మునిసిపాలిటీ
వలదని యీ ప్రాంతీయులు తీర్మానించుకొనిరి. ఇంతలో బొబ్బల
జాడ్యమును వచ్చినది. వచ్చినట్లే మాయమైనది. కాని 1916లో
కొందరిప్రోత్సాహమువల్ల బాపట్ల తాలూకాబోర్డును, గుం
టూరుజిల్లాబోర్డును చీరాలకు మునిసిపాలిటీ అవసరమే యని
తీర్మానించినవి. ఇందుపై తర్జన భర్జనలు జరుగగా, తుదకు
జాండ్రపేటను వదలివేసి, చీరాల పేరాల గ్రామములను
మాత్రమే మునిసిపాలిటీ గావించిరి. అందుచే స్వల్పసంఖ్యాకు
లగు యీ చీరాల, పేరాల వాసులపైననే యీ మునిసిపల్
పన్నుల భారమంతయు పడినది. జనులలో నశాంతి ప్రబలెను.
ఎట్టెటులో ఖండనమండనములతో వ్యవహార మొకటి రెండేండ్లు
గడచెను. ఎట్టకేలకు 1919 లో మునిసిపాలిటీ స్థిరముగ నేర్ప
డెను. ఎన్నికలు జరిగినవి. కాని మనసులేని మనువు. మొదటి
యేడు ప్రజలు మూల్గుచు పన్నులు చెల్లించిరి. సర్కారువారికి
మహాజర్లు సాగినవి. ఆ సమయముననే మన గోపాలకృష్ణుడు

చీరాల ప్రవేశించెను. అతని అమూల్యసహాయమును, రాజకీయా
భిప్రాయములను యెఱిగిన చీరాలవాసుల కోసంగి, మునిసి
పాలిటీ వ్యవహారముగూర్చి చెన్నపురిలోని ప్రముఖులతోను,
ఉద్యోగులతోను సంప్రదించెను. కాని లాభము లేకపోయెను.
మునిసిపాలిటీవారు సభచేసి, తమకు మునిసిపాలిటీ అనవసర
మనియు, యూనియన్ మాత్రము చాలుననియు తీర్మానించిరి.
అట్టితీర్మానము గావించినవారిలో రెవరెండ్ థామస్ అను
నొక ఐరోపీయుడుగూడ నుండెను. కాని ప్రభుత్వము వినలేదు.
అంతట మునిసిపల్ సంఘసభ్యులు ప్రజాభిప్రాయమును గుర్తించి
1920 సెప్టెంబరులో తమ పదవులకు రాజీనామా యొసంగిరి.
మునిసిపల్ పరిపాలన స్తంభించినట్లుండెను. ఇంతలో నూతన
సంస్కరణల ననుసరించి రాష్ట్రశాసనసభ యెన్నికలు జరిగినవి.
శ్రీగాంధీమహాత్ముని యాదేశానుసారము కాంగ్రెసు యెన్నిక
లను బహిష్కరించగా, బ్రాహ్మణేతర పక్షీయులగు జస్టిస్
వర్గమువారు శాసనసభా సభ్యులై, కీ॥ శే॥ పానుగంటి రామా
రాయణింగారు, కూర్మ వెంకటరెడ్డినాయుడు, సుబ్బరాయులు
రెడ్డిగార్లు ప్రథమ మంత్రులైరి. వీరిలో పానుగల్లుప్రభువు
ప్రధానియు, మునిసిపల్ మంత్రియు నయ్యెను. ఆ హోదాలో
రామారాయణింగారు చీరాలను సందర్శింపవచ్చిరి. కాని
చీరాల పేరాల పౌరులు బ్రాహ్మణుడగు గోపాలకృష్ణునిమాట

విని యెన్నికలలో ఖాళీపెట్టెలను పంపిరను కారణముచే యాతడు వారిని చులకనగజూచి యెద్దేవములాడెను. అందుచే ప్రజలింకను కినుకబూని, మరింత సహాయనిరాకరణవాదులైరి. ఇంతలో నాగపురి కాంగ్రెసునందు "యేడాదిలో స్వరాజ్య" సూత్ర మంగీకరింపబడి, గోపాలకృష్ణుడు వెన్వెంటనే ప్రభుత్వ ముతో పోరుటకు సంసిద్ధపడెను.

1921 జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలలలో చీరాల వ్యవ హారములో ప్రభుత్వమెట్టి మార్పునను యొప్పుకొనలేదు. ప్రజలు పన్నులు చెల్లింపనిరాకరించిరి. సర్కారువారు మునిసి పాలిటీని తొలగించి నెలకు రు 300 లపై నొక వేతనపు ఛైయి ర్మనును నియమించి, 60 మంది ప్రత్యేక పోలీసులను గూడ యేర్పరచిరి. వీరు ప్రజలయొద్దనుండి బలాత్కారముగ పన్నులు వసూలుచేయ బ్రయత్నించిరి. ఈ సంఘటనలో ఉద్యోగుల యొత్తిడికి తాళలేక ప్రజలెప్పుడు శాంతిని వీడుదురో యని గోపాలకృష్ణుడు తహతహ లాడుచుండెను. ముఖ్యముగ యిందు లకే యాతడు తన రామదండును, భజనలు, పురాణశ్రవ ణము, భగవత్సంకీర్తనము, సద్గోష్ఠులను వినియోగించెను. గ్రామములో నంతఃకలహములు రాకుండుటకును, వచ్చిన పేచీ లను పరిష్కరించుటకును, పురప్రముఖులతో గూడిన పంచా యతీని యేర్పరచెను. ఈ పంచాయతీవారు ప్రతినిత్యము,

అన్నివిధముల తగవులను విచారించి, ర్పులు జెప్పి, ప్రభుత్వో ద్యోగులపై నహా జరిమానాలను విధించి, పనూలుచేయించు చుండిరి. సంఘమును పీడించు త్రాగుడు, జూదము, మొన్నగు దుర్వ్యసనములను రూపుమాపుటకై కులకట్టుల నేర్పరచి, దోషులగువారికి "కులతప్పు" లను విధింపజేయుచు యెల్లరను సన్మార్గవర్తనులుగ జేయసాగెను. జనులలో సదాచారము, దైవభక్తి, నీతి, ధర్మము వృద్ధి కాజొచ్చెను. రామారాయ ణింగారు చీరాలకేగు సమయమున జనులెల్లరు భజనలతో యెదురేగి, సీతాపహరణమున కొడిగట్టిన రావణునకు విభీష ణుడు "వారి సీతను వారికిచ్చి మంచి మార్గము బట్టిపోరా— రావణా" యని బోధించినరీతిగ, మునిసిపల్ సంఘమును రద్దు పరచి ప్రజలతో సఖ్యమొనర్చు కొమ్మని యాతనికి వారు హితవొసంగిరి. కాని రామారాయణింగారు ప్రజాభిప్రాయమును పెడచెవిని బెట్టెను.

ఇట్లుండ మార్చి 30, 31 తేదీలలో విజయవాడలో అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశమయ్యెను.

బెజవాడ సభల యనంతరము గాంధీమహాత్ము డాంధ్ర దేశ సంచారము జేయుచు, ఎప్రిల్ 6 వ తేదీన చీరాల, పేరాల గ్రామములు సందర్శించెను. రామనగరమున గోపాలకృష్ణుడు చక్కని పందిళ్ళను వేయించి, తాళపత్రముపై సుస్వాగతము

వ్రాసి, భక్తితో పట్టణప్రముఖులందరికి నమస్కరించెను. మహాత్ముడును చీరాలపేరాల భక్తికి, త్యాగసాహసముల కును అబ్బురపడి, కష్టసుఖములలోనుండియు వారొసంగిన నాలుగువేల రూప్యములను పదిమడుంగులుగ స్వీకరించెను. మునిసిపాలిటీ వ్యవహారము గూర్చి ముచ్చటించుచు, సత్యాది సక్రిహాందోళనమే యనియు, అట్లయ్యును మునిసిపాలిటీని తొలగించుటకు శాంతియుత శాసనోల్లంఘనముచే పన్నుల నిరాకరించుటగాని, పురత్యాగ మొనర్చుటగాని, రెండుమార్గములనియు, దేశమెల్లను చీరాల పేరాలపై దృష్టినిగిడ్చి చూచుచుండురనియు, జయము చేకూరినచో దేశీయులెల్లర ఆశీస్సులను, అపజయమైనచో దూషణలకు వారు పాత్రులగుదురనియు, అందుచే తమ నాయకుడగు శ్రీ గోపాలకృష్ణుని యాజ్ఞానుసారము శాంతిముగ తమ యుద్యమమును సాగించి విజయము బొందుడని యుద్బోధించి యాశీర్వదించెను. పురజనులెల్లరును మహాత్ముని వాక్సుధాధారలగ్రోలి, ఆనందపారవశ్యత జెందిరి. మహాత్ముని రాకచే తమ గృహములు పావనమయ్యెనని యెల్లరును సంతసించి, యాతని యాజ్ఞలను తలదాల్చి తమ యుద్యమమును కొనసాగింప దృఢనిశ్చయులైరి.

గాంధీమహాత్ముని రాకకు పిమ్మట చీరాల పేరాల పౌరులు తమ లక్ష్యసిద్ధికై పురత్యాగమే మేలని నిశ్చయించు

కొనిరి. అందుచే మునిసిపల్ సరిహద్దులకు బయట వేలు వేలు తాటాకు పాకలను నిర్మించి, ఆబాలగోపాలమును ఊరువిడచి పోవుటకు నిశ్చయించిరి. ది 25—4—21 రాత్రి సుముహూర్త మేర్పరుపబడెను. మంగళవాద్యములతోను, దేదీప్యమానముగ వెలుంగు దీపములతోను, 'శ్రీమద్రమారమణ గోవిందోహరి' 'మహాత్మా గాంధీకీ జై' యను శంఖారావములతోను, తాత తండ్రులనుండియు తాము నివసించుచున్న స్వగృహములను వీడి, చీరాల పేరాల ప్రజ తమ నూతన కుటీరములకు జనిరి. ఆనాటిరాత్రి వారి యుత్సాహమునకు మేరలేదు. గొప్పవారు, కొద్దివారు, భాగ్యవంతులు, బీదవారు, బలిష్ఠులు, దుర్బలులు, పెద్దలు, పిన్నలు, స్త్రీలు, పురుషులు, యెల్లరు గ్రామములను వదలిపెట్టిరి. ఆ నడివేసవిలో నాటిరాత్రియు, మరునటి మిట్ట మధ్యాహ్నము గూడ అచ్చటి ప్రజానీకము తమతమసామానులను నెత్తిపై బెట్టుకొని, చేటలు, చాపలు, చీపుళ్ళు, రోకళ్ళు, రోళ్ళు, పిడకలు, మున్నగువానిని మోసికొనిపోవు పురుషులను జూచినవారి కెవరికి కంటినీరు వరదలై ప్రవహించదు? గర్భిణీస్త్రీలు, బాలింతలు, పసిబిడ్డతల్లులు, ముదుసలులు, శిశువులు, రోగులు, యెల్లరు గ్రామమును త్యజించిరి. యీచీరాల పేరాల వారి త్యాగము శ్రీమాన్ ఎన్. శ్రీనివాస అయ్యంగార్, పంగుటూరి ప్రకాశం పంతులుగార్ల హృదయముల

నాకర్షింపగా వారుభయులు సచ్చటకువచ్చి చెరి వేయిరూప్య ములనొసంగిరి. రాష్ట్రకాంగ్రెసువారును మూడువేలతో చీరాలవాసులను దీవించిరి.

చీరాల పేరాల పౌరుల కార్యదీక్షయు, గోపాలకృష్ణుని అసమాన ధైర్యసాహసములును, ప్రభుత్వమును కలవరబెట్ట నారంభించెను. గోపాలకృష్ణుడును తనయొద్దజేరిన పేదప్రజల సహాయార్థమై ఆంధ్రదేశ మెల్లెడల సంచారమొనర్చి, 'సంజీవి' నర్థించి, తన యుద్యమ ప్రబోధము గావించుచుండెను. ఈ రీతిగ యాతడు బెజవాడ, ఏలూరు, భీమవరము, వుండి, నర్సా పురము, రాజమహేంద్రవరము, కాకినాడ మున్నగు స్థలము లను సందర్శించెను.

ఇంతలో చీరాలయందలి అధికారులు పురజనుల నెట్లయినను లొంగదీయవలెనను తలంపుతో నిర్బంధపు విధా నమునకు గడంగిరి. మహాత్ముడు చీరాలకు రాకపూర్వమే పం డ్రెండుగురు పురుషులును వృద్ధురాలగు నొక స్త్రీయు పన్నుల నిరాకరణకై కారాగారముల కంపబడిరి. పురజనులు భజనల తోను, జై జైలతోను వేనవేలుగ వారికి వీడ్కోలుచెప్పిరి. ఆ పదముగ్గురును విడుదలయై వచ్చిన పిమ్మట మహాత్ముడు వారిని పుష్పమాలాలంకృతుల గావించి, గౌరవించెను.

వేసవి గడచిపోయెను. కాని ప్రభుత్వము మునిసిపాలిటీని రద్దుచేయలేదు. ప్రజలూర లేనందున పన్నులబాధ తప్పినది. అందుచే వారివారి పాకలలోనే వారు తమ పనులన్నిటిని చేసుకొనుచు, అచ్చటనే పెండ్లి పేరంటములు జరుపుకొనుచు, అచ్చటనే హరికథలు, పాటకచ్చేరీలు, భజనలు, భాగవతములు, మొదలగునవి సాగించుకొనుచుండిరి. ఇఁక చీరాల పేరాల గ్రామములో? అవి నిర్మానుష్యములై భూతప్రేత పిశాచముల కాలవాలమై, విషసర్పములకును, సృగాలములకును నివాసస్థానమై, వెలవెలబోవుచు భీకరముగ నుండెను. ఇండ్లు కూలిపోయినను, చోరులు తలుపుల నెత్తుకొనిపోయినను, ఎన్ని యిక్కట్టులు వచ్చినను ప్రజ తమ దీక్షను వదలలేదు. ఇంతలో వర్షాకాలము వచ్చినది. అనేక కష్టములు సంప్రాప్తించినవి. కాని ప్రజలు పట్టినపట్టు వీడలేదు. నాయకుల అరెస్టు ప్రజలను మరింత యుత్సాహపరులుగ జేసెను.

ఇంతలో సెప్టెంబరు నెలలో బరంపురమందు ఆంధ్ర మహాజనసభయు, ఆంధ్రరాష్ట్రీయసభయు జరిగినవి. అప్పటికీ చీరాల రంగమువల్లనేగాక స్వరాజ్యసమరోత్సాహమువల్ల గూడ ఆంధ్రదేశమంతయు సట్టుడికినట్టుడికిపోవుచున్నది. ఎల్లెడలను నిర్బంధములే! ఎచ్చట జూచినను ప్రజలలో నమిత

భక్త్యుత్సాహములే. అన్నిచోట్లను ప్రభుత్వము నిర్బంధవిధా
నమునకు గడంగజొచ్చెను. అట్టి నిషేధాజ్ఞలను శిరసావహిం
చుటయా? లేక ఉల్లంఘించుటయా? అనునదే బరంపుర
మహాసభలో ప్రధాన ప్రశ్న. గోపాలకృష్ణయ్య నిర్బంధవిధా
నమునకు తల నొగ్గకుండుటే ప్రధానకర్తవ్యమని తలంచి తాన
నధికారమును గావించి శిక్షపడిన ప్రకరణము లోగడ చదివి
యే యుంటిమి.

గోపాలకృష్ణయ్యలోని గొప్పదనమున కిది యొక్కటే
కారణము. వీరిగోష్ఠిగాని, వీరి రామదండుగాని, వీరి రామా
లయములుగాని, వీరి సంఘసంస్కరణముగాని వీరి కారాగార
యాత్రగాని వీరి ఘనతకు కారణభూతములు కావు.

మానవునకు ప్రధానములు దేహగేహములు. దేహ
మును బాయుట యెట్టి శోచనీయమైన విషయమో గేహ
మును బాయుట కూడ అట్టిదే. స్వార్థత్యాగమున ప్రాణార్పణ
చేయగల యోధునిలోని యభినివేశమే గేహమును త్యజించి
జీవింపనెంచిన యోధునిలోని యభినివేశముకూడ నట్టిదే.
స్వార్థత్యాగి తా నొక్కడే మరణము నెదుర్కొనును. కాని
గేహములను గ్రామమును త్యజించి పోగలిగిన యభినివేశ
మును, త్యాగబుద్ధిని ప్రజానీకములో కలిగింపజేయుటే దివ్య

శక్తి అట్టి దివ్యశక్తి సమన్వితుడే గోపాలకృష్ణయ్య. ప్రజా సామాన్యమునకట్టి త్యాగబుద్ధిని గల్పింపజేసివారిచే స్వగ్రామ బహిష్కారమును చేయించగలిగిన వాడే ప్రజలకు నాయకుడు. ఆ నాయకత్వము సిద్ధించినది అఖిలభారతావనిలో నొక్క ఆంధ్రరత్నమునకే. అదే గోపాలకృష్ణునిఘనత.

## రామాలయ ప్రశంస.

1925 లో గోపాలకృష్ణు డిటుల వ్రాసెను. "నాకును, నేను చేయదలచిన కార్యములకును యీఆలయములు మిక్కిలి ముఖ్యమైనవి. అవి విలువగలవి కాకపోయినను, కనీసము రూప మైన యేర్పడవలెను. నా భావికార్యక్రమమున కీఆలయములు ప్రాణము. ఈ నాస్తికయుగమందీఆలయముల ప్రయోజనము మనలో చాలమంది యెఱుగరు. కాని వాటిమహిమ ఆస్వామి యెఱుగకపోడు. మనకు అంతేచాలును ... అసహాయోద్యమ మునకు పూర్వము నుండియు వీనికై నేను కృషిచేయుచున్నాను. కాని యింతవరకు అవి నా యూహాప్రపంచమునుగాని, రామ నగరు దిబ్బలనుగాని, వదలి బయటపడలేదు."

## ఆఖరు విల్లు.

"రామనగరు అను పేరును సార్థకపరచుటకై శ్రీరామాలయము కట్టబడి ఆయన వెంటనే శ్రీస్వామివారికే యీస్థలము నంతయు సమర్పించి, వారి కృపాకటాక్షముననే పైపరతులతో గ్రామమేర్పడ వేడికొని, కృతార్థుడను కానిశ్చయించుకొన్నాను. నాశరీరస్థితి ప్రస్తుత మవసానము ననుకరించుచున్నది. నేను మరణించులోగా తప్పక శ్రీకోదండరామస్వామివారి కీయావత్తు భూమిని అర్పించి అట్లు దస్తావేజువ్రాసి, పిమ్మట ప్రాణములు వదలగలనని యీదుకు సంబంధించినవారి కందరికి ప్రమాణ పూర్తిగ విన్నవించుచున్నాను. ఒకవేళ నా మరణమునకు పూర్వమీపని జరుగకపోయినచో, ఇదియే నావిల్లుగ భావించి ఆంధ్రమహాజనులు దీనిని చెల్లింతురుగాక!"

ఇది గోపాలకృష్ణుని విల్లు.

గోపాలకృష్ణుడు, వర్ణాశ్రమధర్మములగూర్చియు, గాయత్రీమంత్రమునుగూర్చియు కొన్నివిపరీతాభిప్రాయముల కలిగి యుండెడివాడు. విపరీతభావముల ప్రచారము గావించుటకై గోష్ఠియని యొకసంఘమును [విద్యాస్థానమును] బయలుదేర దీసి యీ యభిప్రాయముల తఱచు వ్యక్తపఱచుచుండెడివాడు. కాని ఆంధ్రులలో తగినంత సంచలనము రాలేదు. పెక్కండ్రు

గోపాలకృష్ణుని సాంఘిక, మత, సంస్కరణాభిప్రాయములు (Utopian Schemes) అని నిరాకరించినట్లు కనబడుచున్నది. గోపాలకృష్ణుని యనంతరము గోష్ఠినిగూర్చిన ప్రచారము తగ్గి పోయినది. కాని మిత్రుడు శ్రీగుమ్మిడిదల సుబ్బారావుగారు గోపాలకృష్ణునిగూర్చివ్రాసిన ఆంధ్రరత్న ప్రశంసలో వానినెల్ల విశదీకరించియున్నారు. వివరములు తెలిసికొనగోరినవారా గ్రంథమును జదువవలెను.

## ఆతని గుణములు.

వేరెవ్వరు శ్రమపడి వారిగుణలోపముల చెప్పనక్కర లేకుండ ఆంధ్రరత్నమే తనగుణములగూర్చి నిట్లు యాథార్థ్యమును వర్ణించుకొనినాడు. వరులెవ్వరైన వీరినిగూర్చిన యీ యభిప్రాయములే వెలిబుచ్చిరేని ఆంధ్రరత్నముయొక్క మిత్రుల సన్నిహితుల యాగ్రహమునకు వారు గురికావలసినవా రగుదురు.

సీ. వేదాంతములతోడ వెక్కిరింతలతోడ
లెక్చర్ల సాగించులీల నెవడు?
లక్ష్యమొక్కటి లేక యుత్సగానములచే
కాలంబు వృథ బుచ్చు ఘనుడెవండు?

భక్తుఁడు

చీరాల పేరాల చిన్నిగ్రామంబుల
దోసమెన్నక కొంపదీసె నెవడు?
ఆంధ్రరత్నంబంచు నహామికతో పిన్న
పెద్దలంచను మదినెన్న డెవడు?

అట్టి గోపాలకృష్ణుని హాస్యసరళి
గోపాలకృష్ణునిగా జేసి కొరతదీర్చె
గాక పట్టపగ్గములున్న గాడ్దు' కైన
రామనగరీవరాంగ శ్రీరామలింగ॥

ఓమ్-స్వస్తిశ్రీరామార్పణమస్తు.

సమాప్తి.

శాస్త్రప్రెస్, రాజమండ్రి-కాపీలు 1000-9-1-46 హో. నం. ఇ. జి. 34